అపరాధ పరిశోధన అనుబంధం—3

# నాలుగు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన అందజేస్తున్న మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## ఎర్ర పెట్టె?

రచన: మల్లాది వెంకటకృష్ణమూర్తి

## చిక్కుల్లో పడ్డ చిన్నది

రచన:— వాసవదత్త

## గాంబ్లింగ్!

రచన: మిస్. మధుబాల

## అపరాధి

రచన:— A.V. మోహన్‌రావ్

అపరాధ పరిశోధన సప్లిమెంట్—3
మార్చి, 1974
వెల: రు. 2-50

మేనేజింగ్ ఎడిటర్:
శ్యామ దామోదర్ రెడ్డి

సంపాదకవర్గం:
మల్లాది వెంకటకృష్ణమూర్తి
వాసవదత్త
కంచర్ల రమణ
ఏ. వీ. మోహన్రావ్
కె. శివరామ్
ఉప్పలూరి ఉషారాణి
మిస్. మధుబాల

కార్యాలయం:
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్—36959

ముద్రణ:
క్రాంతి ప్రెస్
12, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్
మద్రాసు—1

# మీరే ఎన్నుకోండి?

ఈ "సప్లిమెంట్" లో మొత్తం నాలుగు క్రైమ్ నవలలు ప్రచురించబడ్డాయి. నాలుగు నవలలూ మీ అభిమాన రచయితలు రాసినవే. వీటిలో మీకు అత్యుత్తమంగా తోచిన నవల పేరు ఒకటవ నెంబరు ప్రక్కన వ్రాయండి. తర్వాత వరుసక్రమంలో మీకు నచ్చిన మిగతా మూడు నవలల పేర్లు పూరించండి. పాఠకుల ఎన్నిక ప్రకారం అత్యుత్తమ నవల నిర్ణయించబడుతుంది.

కూపన్

మార్చి '74 నెల "సప్లిమెంట్"లో మేము మెచ్చిన నవలలు వరుసగా ఇవి:

1 ..............................

2 ..............................

3 ..............................

4 ..............................

పాఠకులు ఉత్తమ నవలగా ఎన్నుకొన్న ఆ నవలా రచయితకు రు. 116/- లు బహుమతి, నాలుగు నవలల ఎన్నికను సరైన వరుసక్రమంలో చెప్పగలిగిన పాఠకులకు ఒక్కొక్కరికి రు. 10/- లు చొప్పున బహుమతి ఇవ్వబడుతుంది.

పై కూపను కొట్టివేతలు లేకుండా పూర్తి చేసి, యీ పేజి పూర్తిగా కత్తిరించి, యీ నెల 10వ తేదీలోగా మాకు చేరేటట్లు పంపండి. మీ చిరునామా వెనుక ప్రక్కన వ్రాయటం మరచిపోవద్దు. ఫలితాలు వచ్చే నెల "అపరాధ పరిశోధన" మాసపత్రికలో ప్రచురించబడతాయి.

ఇక్కడ కత్తిరించండి

## చందా వివరాలు

ఏడాది చందా (సప్లిమెంట్ లేదా పత్రిక)

33 రూపాయలు.

30-3-'74 తేదీలోగా పంపేవారికి 25 రూపాయలు.

రిజిస్టరు పోస్టు చార్జీలు 12 రూపాయలు అదనం.

అట్టచివరి బొమ్మ: బూచి

అట్టమీది బొమ్మ: బుల్లెట్

# ఎర్రపెట్టె?

## మల్లాది వెంకట కృష్ణమూర్తి

రామనాథ్ బ్రహ్మచారి. ముప్ఫై నిండుతున్నాయి. దృఢంగా, ఆరోగ్యంగా వుంటాడు. తెలివయిన వాడని తెలిసిపోతుంది అతని మొహం వంక కొంచెం పరిశీలనగా ఎవరయినా చూస్తే. కొద్దిగా నలుపయినా అందమైన వాడికిందే లెక్కలోకి వస్తాడు.

సైకిల్ కి స్టాండ్, తాళం వేసి, తన పోర్షన్ తలుపుకున్న తాళం తీస్తూ పక్క పోర్షన్ తలుపుకు వేలాడుతున్న తాళం వంక చూసాడు. ప్రక్క పోర్షన్ వాళ్లు వూరికెళ్ళారన్న సంగతి గుర్తుకు వచ్చింది.

చన్నీళ్ళతో స్నానంచేసి, ఓసారి తన బెడ్ రూం వంక చూసాడు. సరిత రావడానికి ఇంకా ముప్పావు గంట పైనే

అవుతుంది. ఈ లోపల చాలా చెయ్యాలి ఆ గదికి. చకచకా గదినంతా సర్దటం ప్రారంభించాడు.

సరిగ్గా ఏడూ నలభై అయిదుకి వచ్చింది సరిత. రామనాథ్ బెడ్ రూం వంక చూసింది మెచ్చుకోలుగా. గది నీట్ గా వుంది. చిన్న స్టూల్ మీద వున్న అగరుబత్తి స్టాండ్ లో పదిదాకా కాలుతున్నాయి అగరు బత్తులు సువాసనతో కూడిన పొగవందిస్తూ.

కిటికీ తలుపులన్నీ వేసివున్నాయి పొగ బయటికిపోకుండా, లోపల ఏం జరుగుతోంది కనబడకుండా. పైన జి. ఇ. సి. సీలింగ్ ఫేన్ తిరుగుతోంది. తిరుగుతున్న ఫేన్ కి సరిగ్గా కిందగా మంచం, మంచంమీద తెల్లటి దుప్పటి పరిచిన పరుపు, పరుపునిండా పువ్వులు ఎర్రగా, తెల్లగా.

"ఎక్కడికి వెళ్ళాడు నీ మొగుడు? ఏ వూరు?" అడిగాడు రామనాథ్ బెడ్ రూం తలుపు మూస్తూ.

"నువు ప్రశ్న అడిగిన పద్ధతి నాకు నచ్చలేదు" అన్నది సరిత కొద్దిగా కోపంగా.

"సారీ, మీ ఆయన ఏ వూరు వెళ్ళారు?" అడిగాడు రామనాథ్.

"తాండూరు."

"ఆఫీస్ పనిమీదా?"

"అవును."

"మీ ఆయన పనిచేసే ఆఫీస్ వాళ్ళు మంచివాళ్ళు కదూ?"

చిన్నగా నవ్వింది సరిత.

"నువు బావుంటావు సరితా," అన్నాడు రామనాథ్ సరిత కళ్ళల్లోకి గుచ్చిగుచ్చి చూస్తూ.

"చాలాసార్లు చెప్పావ్ ఇదివరకు" అన్నది సరిత సిగ్గుగా తలవంచుకుని.

"నేను ఎన్నిసార్లు చెప్పినా నిజమే చెప్తాను. నీకు

సుదర్శన్‌తో పెళ్ళి కాకుండా వుండివుంటే, తప్పకుండా నిన్ను నాదాన్ని చేసుకునే వాణ్ణి. ఈ పాటికి మనిద్దరికీ పెళ్ళయి పోయేది తెలుసా.''

సరిత మౌనంగా వుండిపోయింది.

రామనాథ్, సరిత దగ్గరకి నడిచాడు. రెండు చేతులూ సరిత నడుం చుట్టూ వేసి, బిగించి, తన మీదకి లాక్కున్నాడు బలంగా. సరిత అభ్యంతరం చెప్పలేదు. రామనాథ్ మీదికి వరిగిపోయింది.

గాఢంగా చుంబించాడు సరితని రామనాథ్.

గాల్లోకి ఎత్తాడు సరితని చటుక్కున. గాల్లోకి ఎత్తి పట్టుకునే మంచంవైపు నడిచాడు సరితతో.

అరగంట దాకా ఆ గదిలో గాలి స్తంభించింది. శృంగారం రాజ్యం ఏలింది. ఓ కొత్త లోకం ఏర్పడింది ఆ కాస్సేపు.

అరగంట తర్వాత మాట్లాడాడు రామనాథ్.

''నెలనుంచి విడిగానే వున్నాం.''

''అవును.''

''పోనీ, సుదర్శన్‌కి విడాకులు ఇచ్చేయరాదు.''

''అమ్మో! విడాకులే?''

''అవును. విడాకులు.''

''విడాకులిస్తే ఇంకేమన్నా వుందా? పెద్దవాళ్ళకి ఏం సమాధానం చెప్పాలోవాలి?''

''ఏదయినా చెప్పచ్చు.''

''ఇచ్చి?''

''మనిద్దరం పెళ్ళి చేసుకుందాం.''

''కుదరదు.''

''ఇలా ఎంతో కాలం కుదరదనుకుంటాను కూడా.''

''కుదరనప్పుడు ఆలోచిద్దాం.''

రామనాథ్ సిగరెట్ అందుకుని అంటించి అన్నాడు.

"సీరియస్ గానే అడుగుతున్నాను... ఐ లవ్ యూ సరితా!"

సరిత మౌనంగా వుండిపోయింది. మాట్లాడలేదు. ఇంత వరకు పెళ్ళి గురించి మాట్లాడలేదు రామనాథ్ ఎప్పుడూ. మొదటిసారి ఇది. విడాకుల గురించి తనెప్పుడూ ఆలోచించలేదు కూడా. ఏం మాట్లాడాలో తెలియక మౌనంగా వుండిపోయింది.

రామనాథ్ సిగరెట్ తాగుతూ ఆలోచిస్తూండి పోయాడు.

"పెళ్ళి మీదకి గాలి మళ్ళిందా?" నవ్వుతూ అడిగింది సరిత రామనాథ్ భుజంమీద చేతులు వేసి.

"అవును. ఇంకెంతకాలం ఈ బ్రహ్మచారి బ్రతుకు."

తలుపు తట్టిన చప్పుడు వినిపించింది.

రామనాథ్ భుజం మీంచి చేతులు తీసి అడిగింది సరిత కొంచెం ఇబ్బందిగా.

"ఎవరో వచ్చారు. ఎవరినయినా రమ్మన్నావా?"

"ఎవరినీ రమ్మనలేదు. రావద్దని మా కొలీగ్స్ ఒకళ్ళిద్దరికి చెప్పి వచ్చాను కూడా."

"ఎవరో చూసి పంపించిరా."

"బహుశ పక్క పోర్షన్‌లో వాళ్ళు అయివుంటారు. వూరునించి తిరిగివచ్చి వుంటే కీళ్ళు అడుగుతారు. అంతకంటే ఇంకెవరూ అయివుండరు."

మళ్ళీ తలుపు దబదబ చప్పుడయింది.

"కొంపతీసి ఏ చుట్టమయినా అయితే?" అన్నది సరిత కంగారుగా.

"చుట్టమయితే కష్టమే. బాబాయి వస్తానని ఉత్తరం రాసారు. ఆ గదిలోకి వెళ్ళు," అన్నాడు రామనాథ్ ధైర్యం తెచ్చుకుంటూ.

"మరి నన్ను చూడకూ ఆ గదిలోకి వస్తే?"

"రానివ్వను. నువు త్వరగా వెళ్లు."

సరిత మంచం దిగి బెడ్ రూంలోంచి లోపలికి వెళ్ళింది, వెనక గదిలోకి.

మళ్ళీ తలుపు చప్పుడయింది. ఆగకుండా కొడుతున్నారు ఎవరో.

"వస్తున్నాను" అరిచాడు రామనాథ్ కఫ్‌లింక్స్ పెట్టుకుంటూ.

రామనాథ్, సరిత లోపలికి వెళ్ళగానే తలుపు వేసి బయట గొళ్ళెం పెట్టాడు. అలమార తెరచి తాళం కప్పా, తాళం చెవీ అందుకుని బయట గొళ్ళానికి తాళంవేసి, తాళం చెవి జేబులో వేసుకున్నాడు జాగ్రత్తగా.

తలుపుమీద చిన్నగా తట్టి అన్నాడు నెమ్మదిగా సరితతో.

"భయపడకు. వాళ్ళని పంపించి వస్తాను."

తలుపులు పగిలిపోయేలా బాదుతున్నారు ఎవరో.

"వస్తున్నాను. వస్తున్నాను. ఆగండి ఎవరో," గట్టిగా అరిచాడు రామనాథ్ కాస్త కోపంగా.

అద్దం ముందు నిలబడి గబగబా దువ్వెన అందుకుని చెదరిపోయిన జుట్టుని దువ్వుకున్నాడు చకచకా. ఆ గదిలోంచి ముందు గదిలోకి వచ్చి, ఆ గది తలుపులు దగ్గరగా నొక్కాడు లోపలికి వచ్చే వాళ్లు తన బెడ్‌రూంలోని అగరు బత్తుల వాసని, మంచంమీద పూలని చూడకుండా.

## 2

"మెలకువ రాలేదు. త్వరగా నిద్ర పట్టింది రోజూ" అన్నాడు రామనాథ్ తలుపు తెరుస్తూ.

గుమ్మం అవతల నిలబడివున్న మనిషిని చూడగానే ఎలక్ట్రిక్ షాక్ తగిలినట్లయింది రామనాథ్‌కి. కాళ్ళలోంచి వణుకు పుట్టుకు వచ్చింది.

సరిత భర్త!

సుదర్శన్!!

"మీరా?" అన్నాడు ఆశ్చర్యాన్ని కప్పి పుచ్చుకుంటూ.

"నేనే."

పేంట్ జేబులోంచి చేతులు తీయకుండానే, అలాగే నిలబడి నవ్వుతూ అన్నాడు సుదర్శన్, రామనాథ్ వంక చూస్తూ.

"సారీ. మెలకువ రాలేదు" అవలించాడు రామనాథ్.

"నేను సారీ చెప్పాలి మీకు, ఇప్పుడువచ్చి మిమ్మల్ని డిస్టర్బ్ చేస్తున్నందుకు."

ఏం మాట్లాడాలో తెలియలేదు రామనాథ్‌కి. సుదర్శన్ ఎప్పుడు ఆవేళప్పుడు రాలేదు. అసలు తనింటికి వచ్చింది ఒకటి, రెండుసార్లు మాత్రమే.

"బయటే నిలబెట్టేసారు. నేను లోపలికి రాకూడదా?" అడిగాడు సుదర్శన్.

"అబ్బే. రండి" పొడిగా నవ్వి పక్కకి జరిగాడు రామనాథ్.

"కూర్చోండి" అన్నాడు రామనాథ్ ముందు గదిలోనే వున్న పేము కుర్చీ వంక చూపిస్తూ. అక్కడకక్కడే మాట్లాడి పంపించాలి త్వరగా.

"థాంక్స్" కూర్చున్నాడు సుదర్శన్ కుర్చీలో.

రామనాథ్ ఆలోచిస్తున్నాడు. ఎందుకు వచ్చాడు సుదర్శన్ ఎప్పుడూ రానివాడు? రెండు రోజులు కేంప్‌కి వెళ్ళాడని చెప్పిందే సరిత? కేంప్‌కి వెళ్లలేదా? వెళ్లి తిరిగి వచ్చేసాడా ఏ కారణం చేతయినా? తమ విషయం తెలిసిపోయిందా లేకపోతే?

ఏదో ఆలోచిస్తున్నట్టుగా కూర్చున్న సుదర్శన్‌ని అడిగాడు రామనాథ్, తమ మధ్య నిశ్శబ్దాన్ని భరించలేక,

ఏదైనా మాట్లాడాలని.

"కేంప్‌కి వెళ్లలేదా?"

సుదర్శన్, రామనాథ్ వైపు తిరిగి అడిగాడు చటుక్కున.

"నేను కేంప్‌కి వెళ్లానని మీకెలా తెలుసు?"

గొంతులో పచ్చి వెలక్కాయ అడ్డుపడి నట్లయింది రామనాథ్‌కి. తొందరలో ఆలోచించకుండా పిచ్చి ప్రశ్న వేసాడు.

"ఆఫీస్‌కి నాకోసం ఫోన్ చేస్తే చెప్పారా, ఆఫీసులో ఎవరైనా నేను కేంప్‌కి వెళ్ళానని?" అడిగాడు సుదర్శన్.

"యస్. పొద్దున పదిన్నరకి ఫోన్ చేసాను. మీరు వూరెళ్లారని చెప్పారు. తాండూరుకని."

"దేనికి ఫోన్ చేసారు?"

"వూరికేనే. మాట్లాడుదామని."

"నేను పొద్దున ఆఫీస్‌లోనే వున్నాను. మీరు ఫోన్ చెయ్యలేదు. అబద్ధం ఆడుతున్నారు."

రామనాథ్ గొంతుకలో మరోసారి పచ్చి వెలక్కాయ పడ్డట్లయింది. ఉక్కిరిబిక్కిరయ్యాడు.

"చెస్ ఆడదామా? ఆడి చాలారోజు లయింది?"

వింతగా చూసాడు రామనాథ్ సుదర్శన్ వంక.

"ఇప్పుడా?"

"అవును."

"సారీ. ఇప్పుడు మూడ్‌లో లేను."

గట్టిగా గాలి పీల్చి అడిగాడు సుదర్శన్.

"అగరత్తుల వాసనేనా అది?"

"అవును" చెప్పాడు రామనాథ్.

"ప్రతీ రాత్రి మీరు అగరత్తులు వెలిగిస్తారా?"

"ఈ మధ్య అలవాటయింది."

సుదర్శన్ లేచి నిల్చున్నాడు. వెళ్ళిపోతాడేమో నను కున్నాడు రామనాథ్. వీధి గుమ్మంవైపు వెళ్ళలేదు సుదర్శన్.

పడక గదికీ, ముందు గదికీ మధ్యనున్న తలుపు దగ్గరికి నడిచి తలుపుతోసి, పడక గదిలోకి అడుగు పెట్టాడు.

తను ముందు జాగ్రత్త పడటం మంచిదయింది అనుకున్నాడు రామనాథ్. లేకపోతే సరిత, సుదర్శన్ కళ్ళబడేదే.

సుదర్శన్ ఆ పడక గదిలోని ప్రతీ వస్తువుకంకా పరీక్షగా చూసాడు. వెలుగుతున్న అగరత్తుల వంక, గదినిండా అలుముకున్న పొగవంక గది మధ్యలో తిరుగుతున్న ఫేన్ కింద వున్న మంచంవంకా, మంచం మీద నలిగి పడివున్న మల్లె, గులాబీల వంక, పక్క స్టూల్ మీద వున్న స్వీట్స్ వంక.

మంచం దగ్గరికి నడిచి మంచంమీద కూర్చుని అన్నాడు, తనలో తను అనుకుంటున్నట్టుగా, సుదర్శన్.

"పక్క బాగా నలిగిపోయింది అప్పుడే."

తలుపుకి అవతలివైపు మూడో గదిలోవున్న సరితకి వినబడుతున్నాయి ఇద్దరి మాటలు. గుండె విపరీతంగా కొట్టుకుంటోంది అమితవేగంగా. వళ్ళంతా చెమటలు పట్టేసింది. గుండెనిండా భయం కరుడు కట్టింది. భర్తగొంతు గుర్తుపట్టింది.

పక్కమీద కూర్చున్నాడు సుదర్శన్.

"ఆ గదిలో ఏముంది?" అడిగాడు సుదర్శన్ తాళం వేయబడిన గదివంక కడికాలు ఎత్తి చూపిస్తూ.

"సామాను" కోపంగా అన్నాడు.

"ఇంకా?"

"అంటే?"

"సామానుతో పాటు ఎవరున్నారు ఇంకా?"

"మిస్టర్ సుదర్శన్" అన్నాడు రామనాథ్ కోపం అణుచుకుంటూ.

"బహుశ ఆడవాళ్ళయి వుండచ్చు."

పిడికిలి బిగించి అన్నాడు రామనాథ్.

"మైండ్ యువర్ మేనర్స్ ఎండ్ చెక్ యువర్ టంగ్."

"అదే నేనూ చెప్దామనుకునేది. సరిగ్గా నా మనసులోని వుద్దేశాన్ని గ్రహించేసారు చూసారా?"

నవ్వాడు సుదర్శన్.

గోడకున్న మేకుకు వ్రేలాడుతున్న ఫ్లాస్క్ వంక చూసి అడిగాడు సుదర్శన్, రామనాథ్‌ని.

"కాఫీ వుందా దాంట్లో?"

తలూపాడు రామనాథ్.

రామనాథ్ ఫ్లాస్క్ అందుకుని, రెండు కప్పుల్లోకి వంచాడు కాఫీని, కప్పులని అలమారులోంచి తీసి.

"త్రాగండి" అన్నాడు.

కప్పు అందుకుని ఓ గుక్క త్రాగి అన్నాడు సుదర్శన్.

"థాంక్స్. ఆ గది తాళం చెవికూడా ఇస్తారా?"

మౌనంగా తన చేతిలోకి కప్పునందుకుని ఓ గుటక వేసాడు రామనాథ్, సుదర్శన్‌కి సమాధానం ఇవ్వకుండా.

"ఆ గది తాళంచెవి ఇవ్వ?" కటువుగా అన్నాడు సుదర్శన్.

సుదర్శన్ ఏకవచనంలోకి దిగడం గమనించి అన్నాడు రామనాథ్.

"చూడు మిస్టర్ సుదర్శన్. ఆ గదిలో మీరూహించినట్టుగానే ఓ అమ్మాయి వుంది. కాని మీకు కనపడదు. లోపల వున్నది ఎవరో మీకు తెలియటం అనవసరం."

"లోపల నా భార్య వుంది కనక నా కవసరమే."

"మిమ్మల్ని మీరు ఇన్సల్ట్ చేసుకున్నారు అలా భావించి."

"సరిగ్గా ఒక్క నిమిషం టైం ఇస్తున్నా. తలుపును తెరవకపోతే పదిమందిని పిలిచి గొడవ చేస్తాను. ముగ్గురికీ మర్యాదగా వుండాలంటే ఈ సంగతి మన ముగ్గురి మధ్యే

తెల్చుకోవటం మంచిది.''

''ప్లీజ్. మీరు నమ్మాలి, ఆ గదిలో వున్నది మీ భార్య కాదు.ఓ సంసార పక్షపు పిల్ల. మీరు ఆమెని చూడడం మంచిదికాదు.''

పకపకా నవ్వి అన్నాడు సుదర్శన్.

''నేనేం పిచ్చివాణ్ణి కాను. సరిత మీ ఇంట్లోకి రావడం స్పష్టంగా చూసాను నేను. గాలిలో కలిసి మాయమవలేదు. ఆ గదిలో నే దాచావని తెలుసు నాకు. దయచేసి టైం వేస్ట్ చేయక.''

సరిత గుండెల్లో రాయి పడ్డట్టయింది. తన భర్త చూసాడు తను రావటం? అంటే తమ రహస్యం ముందరే తెలుసుకుని అది నిరారణ చేసుకోవడానికి వచ్చారన్న మాట! నిలువెల్లా వణికిపోతోంది.

''రామనాథ్ తాళం తీస్తావా, లేకపోతే అందరినీపిలచి, పోలీస్ రిపోర్ట్ ఇవ్వనా?''

''అందరినీ పిలుస్తే మీ పరువుపోతుంది.''

రామనాథ్ నోరు జారినందుకు తనని తను తిట్టుకున్నాడు.

''క్విక్. తాళం తెరు,'' గర్జించాడు సుదర్శన్.

రామనాథ్‌కి అర్థమయింది ఆ గదితాళం తెరవడంతప్ప తనింక ఏమీ చేయలేనని. జేబులోంచి తాళం చెవితీసి, ఇష్టంలేకపోయినా, సరిత వున్న గదిగుమ్మంవైపు కదిలాడు.

ఆ క్షణంలో, చటుక్కున, సుదర్శన్ తను తెచ్చిన చిన్న సీసాని జేబులోంచితీసి, రామనాథ్ కొంచెం తాగి వదిలిన కాఫీకప్పులోకి వంచాడు ఆ సీసాలోని ద్రవాన్ని గబగబా. ఆ సీసామూతమూసి మళ్ళీ జేబులో వేసుకున్నాడు సీసాని.

తలుపు తాళంతీస్తున్న చప్పుడువిని కప్పలా కాలిపోయింది సరిత. ప్రాణాలని వుగ్గబట్టుకుని ఇందాకటినుంచి వింటోంది ఇద్దరి సంభాషణ. రామనాథ్ తెలివిగా ఏదోసర్ది

చెప్పి పంపిస్తాడని నమ్మింది కాని అలా జరగలేదు. తన పాపం బ్రద్దలయింది.

తాళం తెరచి లాగాడు తలుపుని. తెరచుకోలేదు. లోపల గడియ వేసివుంది. రామనాథ్ డ్రాయర్ మీద తాళం కప్పపడేసి గబగబా కాఫీకప్పు అందుకుని త్రాగేసాడు మొత్తం, అప్పటికే గొంతు తడారిపోవడంవల్ల.

"సరితా, తలుపు తీసుకుని బయటికిరా. నీఆట కట్టింది" అన్నాడు సుదర్శన్ క్రోధంగా.

తలుపులు తెరచుకోలేదు.

"సరితా నిన్నే" అరిచాడు సుదర్శన్.

నిశ్శబ్దం.

"సరితా, నన్నింకా రెచ్చకొట్టక. ఓడిపోయావు. తలుపు తెరు."

వణికిపోతోంది సరిత, బయట యముడిలా నిలబడివున్న భర్తని తలుచుకుని. సుదర్శన్ కోపం తెలుసు బాగా. అంగుళంకూడా కదలలేదు. కదలలేకపోయింది.

"సరితా! తలుపులు బద్దలు కొడతాను."

ఒక్క వుదుటున ఎగిరి తన్నాడు సుదర్శన్ బలంగా కాళ్ళతో తలుపుని కోపంగా.

సరిత స్ప్రింగ్‌లా లేచి తలుపు గడియ తీసింది లోపల. తలుపు తెరిచింది.

ఎదురుగా నిలబడివున్నాడు సుదర్శన్. కొంచెందూరంలో వెనకగా రామనాథ్ నిలబడివున్నాడు వాడిపోయిన ముఖంతో

జుట్టుపట్టుకుని లాగి, ఆ చెంపా, ఈచెంపా వాయిస్తాడనుకుని కళ్ళుమూసుకుని నిలబడింది సరిత.

"బయటకురా," అన్నాడు సుదర్శన్ శాంతంగా.

కళ్లు తెరచి భర్తవంకచూసి భయంభయంగా బయటికి

వచ్చింది సరిత.

జీవితంలో ఇంక ఇంతకంటె, నరకం వుండదనుకుంది సరిత. తప్పుచేయగా, రెడ్ హేండెడ్ గా పట్టుకుంటే, ఖైదీలాగా, భయంగా, సిగ్గుగా, సగంచచ్చి, తలవంచుకుని ఫలితంకోసం ఎదురుచూడటం. నరకంకన్నా హీనం ఆ క్షణం.

"మీరు మాట్లాడుతూండండి. నేను ఇప్పుడే వస్తాను" బయటికి నడవబోయాడు రామనాథ్.

"కదలకు. మేము మాట్లాడుకుంటూంటే నువ్వు వినకూడని రహస్యాలేమీ లేవు."

"ఇప్పుడే వచ్చేస్తాను మళ్ళీ" కదిలాడు రామనాథ్.

ఒక్కగంతులో రామనాథ్ దగ్గరకిదూకి చెయ్యిపట్టుకుని ఆపాడు సుదర్శన్.

"మీ ఇంటికి వెళ్ళండి ఇద్దరూ. రేపు మాట్లాడుకుందాం" అన్నాడు రామనాథ్ ఆవలిస్తూ.

లాగి దవడమీద కొట్టాడు సుదర్శన్ పిడికిలి బిగించి.

"స్టుపిడ్. అర్ధరాత్రి నిద్ర చెడుతోందేం?" రొప్పుతూ అడిగాడు.

వడిచేత్తో ఎడమచెయ్యి మెలిపెట్టాడు. బాధతో అరిచాడు రామనాథ్. గబగబా రెండుచేతులతో బాదుతున్నాడు సుదర్శన్ రామనాథ్ ని గుప్పిళ్ళతో. అందిన ప్రతిచోటా గుద్దుతున్నాడు. దెబ్బలు కాచుకునేందుకు అవకాశం లేకపోయింది రామనాథ్ కి.

పశుబలంతో, గుండెలు మండుతూంటే ఇష్టంవచ్చినట్టు బాదుతున్నాడు రామనాథ్ ని. ముక్కులోంచి, నోట్లోంచి రక్తం కారుతోంది. కింద పెదవి పగిలింది. సుదర్శన్ ఎలా తిప్పితే అలా తిరుగుతున్నాడు, మోకాళ్ళతో, మోచేతులతో దెబ్బలుతింటూ. ఎదురు తిరగడానికి మనసొప్పలేదు

రామనాథ్‌కి తప్పు తనదవడంవల్ల.

సరిత, తన భర్త కోపం చూడలేక పరిగెత్తికెళ్ళి రామనాథ్‌కి అడ్డంవెళ్ళింది.

"నీకూ కావాలా దెబ్బలు?"

సరితని రెండుసార్లు కొట్టి, మూడోసారి కొట్టడానికి చెయ్యి ఎత్తబోతూండగా చూసాడు సుదర్శన్, రామనాథ్ నేల మీదకి కూలిపోవటం.

వంగి చూసాడు. సొమ్మసిల్లిపోయాడు రామనాథ్. గుండెలమీద చేతినివుంచి చూసాడు. ముక్కుదగ్గర వేలి నుంచి చూసాడు.

"ఏమయింది?" అడిగింది సరిత.. అలా అడిగితే తన భర్తకి కోపం వస్తుందని తెలిసికూడా.

"చచ్చాడు" కసిగా అన్నాడు సుదర్శన్.

"పశువులా మీదపడి బాది చంపేసారు," అన్నది సరిత కోపంగా.

"పశువులతో పశువుల్లానే ప్రవర్తించాలి."

సుదర్శన్ గది నలువైపులా పరిశీలనగా చూసాడు. ఓ మూలాన ఎర్రరంగు పెట్టె పెద్దది కనిపించింది.

సుదర్శన్ ఆ పెట్టెవంక పరిశీలనగా చూసాడు, చేతులతో పొడవు, వెడల్పు కొలుస్తూ. చెక్కతో చేసిన పెట్టె అది. నాలుగున్నరడుగులపొడవు, రెండున్నరడుగుల వెడల్పు వుంది. తాళంలేదు. చిన్న కొక్కెంవుంది, తాళంవేయడానికి వీలుగా.

మూత తెరచిచూసాడు. లోపల పాతబట్టలు, చిరిగిపోయిన బట్టలు, కొంత స్టీల్ సామాను వున్నాయి. వాటిని బయటికితీసి మంచంకిందకి తోసాడు సుదర్శన్, బయటికి కనపడకుండా.

సుదర్శన్, రామనాథ్ శవం దగ్గరికివెళ్ళి, పక్కన కూర్చుని, అతని జేబులు వెతికాడు. ఏమీలేవు జేబుల్లో. తనతో తెచ్చిన బ్లేడ్‌తో షర్ట్‌కి, పేంట్‌కివున్న టైలర్ లేబిల్స్ కోసేసాడు. చేతిగడియారంతీసి వాటితోబాటుగా జేబులో వేసుకున్నాడు.

"సాయంపట్టు" అన్నాడు.

"నాకు భయం" అన్నది సరిత.

"చచ్చిపోయాడు. ఏంచెయ్యలేడు. సాయంపట్టు."

"అందుకే నాకు భయం. నాకు శవాలంటే చచ్చేంత భయం."

తనే తంటాలు పడ్డాడు రెండు చేతులతో రామనాథ్‌ని ఎత్తడానికి. సరితమీద గొణుక్కుంటున్నాడు.

తలుపు చప్పుడైంది.

భయంగా ఇద్దరూ ఒకరిమొహాలొకరు చూసుకున్నారు.

తలుపు చప్పుడైంది మళ్ళీ. ఎవరో తలుపుమీద బాదుతున్నారు దబదబా.

# 3

"ఎవరో వచ్చారు" అన్నది సరిత వణికిపోతూ.

"అవును."

"పోలీసులేమో?"

"పోలీసులకి అప్పుడే ఎలా తెలిసివుంటుంది? ఈపెట్టె వాళ్ళ చేతుల్లోపడి, తెరచి చూస్తేగాని తెలియదు."

బలమంతా వుపయోగించి రామనాథ్ శవాన్ని రెండు చేతులతో ఎత్తి, ఆ ఎర్రపెట్టెలో కుక్కాడు సుదర్శన్. మూత మూసేసాడు కంగారుగా. ఆ పెట్టెమీద ఓ దుప్పటి కప్పాడు, మంచంకిందకి తోసేందుకు ఓపిక, చోటు, సమయంలేక.

తలుపుబాదే శబ్దం అధికం అవుతోంది. ఇంకా బలంగా బాదుతున్నారు.

"అలా వెర్రిమొహం వేసుకుని నించోక. ఎవరయినాసరే మాట్లాడి పంపేస్తాను. పద చూద్దాం ఎవరో."

ఇద్దరూ వీధిగుమ్మంవైపు కదిలారు. తలుపు తెరిచాడు సుదర్శన్ అదిరే గుండెలతో.

ఎదురుగా పోలీసులులేరు సరికదా భయపడ్డట్టుగా.

ఓ ముసలాయన నిలబడివున్నాడు చేతిలో చిన్న ఏర్ బేగ్‌తో.

"రామ్‌నాథ్ లేడా?"

భార్యాభర్తలిద్దరివంకా అనుమానంగా చూస్తూ అడిగాడు ఆ ముసలాయన.

"ఎవరు మీరు?" అడిగాడు సుదర్శన్ మర్యాద వుట్టిపడేలా.

గుమ్మందాటి లోపలికి వచ్చాడు ఆయన. సిల్కులాల్చి, గ్లాస్కోపంచె, రోల్డ్‌గోల్డ్ ఫ్రేమ్, బట్టతల, కాళ్ళకి చెప్పులు.

"రామ్‌నాథ్ లేడా? నేను రామనాథ్ బాబాయిని."

"లేడు. బయటికి వెళ్ళాడు," చెప్పాడు సుదర్శన్.

"మీరు!"

"స్నేహితులం."

"ఎప్పుడు వస్తాడు రామనాథ్? సినిమాకి వెళ్ళాడా?"

"ఊరు."

"ఏవూరు?"

"కడప" తడుముకోలేదు సుదర్శన్.

"మీ రిద్దరూ ఒకే ఆఫీసులో పనిచేస్తున్నారా?"

"లేదు. క్లబ్‌లో పరిచయం మాకు."

"లోపలకు వెళ్దాం రండి" అన్నాడు రామనాథ్

బాబాయి.

ఆ ముసలాయన లోపలకి నడిచాడు. ఇద్దరూ ఆయన వెనకే దారితీశారు. గుండెల్లో రాయిపడ్డట్టయింది ఇద్దరికీ ఆయన లోపలికి రావడం.

"కోర్టుపనిమీద నల్లగొండనుంచి వచ్చాను. రెండుమూడు రోజులపని వుంది."

"అయితే... రెండురోజులూ ఇక్కడే వుంటారా?"

"ఉందామనే వచ్చాను," నవ్వి అన్నాడు ఆయన.

సుదర్శన్ మౌనంగా వుండిపోయాడు.

"మీరు ఇక్కడే వుంటారా?" అడిగాడు.

"లేదు. వెళ్ళిపోతాం ఇంకో పావుగంటలో. సినిమా నుంచి తిరిగివెళ్తూ తలుపు తెరచి చూడటానికి వచ్చాం అంతా సరిగ్గా వుందో లేదోనని, రామనాథ్ మమ్మల్ని ఇల్లు చూస్తుండమని చెప్పి వెళ్ళాడు."

"ఈ రెండు రోజులు నేనుంటాను మీకా శ్రమ అక్కర్లేదుగా."

సరిత భర్తవంక చూసింది ఏం చెప్తాడోనని.

"క్షమించండి. మీరు మరోలా భావించవద్దు. మీరెవరో మాకు తెలియదు.ఇలాంటి సందర్భంలో ఇక్కడ మీరుండటం భావ్యంకాదు."

"నేను రామనాథ్ బాబాయిని."

"కావచ్చు. అయినా మాకు రూఢిగా తెలియదా సంగతి. అసలు రామనాథ్‌కి బాబాయి వున్నారనే సంగతి కూడా తెలియదు నాకు."

ఆయన మొహం ఎర్రబడింది కొద్దిగా.

"ఆల్ రైట్. రెండు రోజుల భాగ్యానికి హోటల్‌లో వున్నా ఒకటే, ఇక్కడున్నా ఒకటే."

అయిదు నిమిషాలు కూర్చుని వెళ్ళిపోయాడాయన.

"అమ్మయ్య," అన్నది సరిత ఆయన వెళ్ళగానే. కొద్ది సేపాగి సరితను కూడా ఆమె పుట్టింటికి పంపించివేసాడు సుదర్శన్ బలవంతంగా. జరిగిన విషయం పొరబాటుగానైనా ఎక్కడా నోరు జారవద్దని హెచ్చరించి మరీ పంపాడు. సరిత అయిష్టంగానే అక్కడ్నుంచి వెళ్ళిపోయింది.

## 4

"చాలా బరువుందిసార్. మీరో చెయ్యి వెయ్యండి" అన్నాడు రిక్షావాడు పెట్టెని లాగిచూసి. సాయంపట్టాడు సుదర్శన్.

రిక్షాలో పెట్టాక అడిగాడు రిక్షావాడు, సుదర్శన్ ని.

"చాలా బరువుందిసార్. ఏంవున్నాయి ఈ పెట్టెలో?"

నిజమే. చాలా బరువుంది. శేకుపెట్టె బరువు. శవంతో అయితే ఇంకా బరువు.

"ఇనపసామానుంది."

రిక్షా తొక్కుతూ అడిగాడు రిక్షావాడు.

"ఏం సామానుసార్?"

"పంపుగొట్టాలు."

చేతిగడియారంవంక చూసుకున్నాడు సుదర్శన్ వీధి దీపం వెలుగులో. తొమ్మిది పదినిముషాలైంది. అయిదు నిముషాల తర్వాత స్టేషన్ లోని రిక్షాస్టాండులో ఆపాడు రిక్షాని, రిక్షావాడు.

పోర్టర్ ని పిలుచుకువచ్చాడు సుదర్శన్. రిక్షావాడికి డబ్బిచ్చి పంపేసాడు. ఆ సమయంలో రైళ్ళేవీలేవు. ఏదో రైల్లో ఆ పెట్టెని వదిలేయాలనుకున్నాడు సుదర్శన్. ఉదయం ఐదుగంటలకు ఓ రైలుంది. కాని అప్పటిదాకా ఆ ఎర్రపెట్టెని ప్లాట్ ఫారంమీద పెట్టుకుని కూర్చోవటం తనకే ప్రమాదం. తనను, ఆ పెట్టెను అందరూ గుర్తుపెట్టుకునే అవకాశం

వుంటుంది. కావున ప్రస్తుతానికి ఆ పెట్టెని క్లోక్ రూమ్‌లో పెట్టి వెళ్ళడం శ్రేయస్కరమనిపించింది సుదర్శన్‌కు. పోర్టర్‌తో క్లోక్ రూమ్ వైపు దారితీశాడు. తెరిచేవుంది క్లోక్ రూం.

"చాలా బరువుంది సార్. ఏం వుంది పెట్టెలో?"

"బంగారపు ముద్దలు" నవ్వుతూ అన్నాడు సుదర్శన్. వెంటనే పొరపాటు చేశానని నాలిక కొరుక్కున్నాడు. 'బంగారపు ముద్దలు' అన్న మాట గుర్తుంటుంది పోర్టర్‌కి. తనుకూడా గుర్తుంటాడు దాంతోపాటు.

రూపాయితీసి అందిచ్చాడు.

"ఇంకో అర్ధరూపాయి ఇవ్వండిసార్. మరీ తక్కువ. ముగ్గురుమోసే బరువుంది."

సుదర్శన్ మాట్లాడకుండా మరో అర్ధరూపాయి ఇచ్చాడు రైల్వే పోర్టర్‌కి, అది ఎక్కువేనని తెలిసినా. బేరం ఆడటం ఇష్టంలేదు.

"దీన్ని వుంచాలండి. రేపు ఉదయం తీసుకుంటాను" చెప్పాడు సుదర్శన్ లోపలవున్న అతనితో.

అలాగే నన్నట్లుగా చిరునవ్వు నవ్వాడు అతను.

ఓ పుస్తకంతీసి, కార్బన్ కాపీవుంచి గబగబా ఏదో రాయసాగాడు క్లోక్ రూంలో వున్న అతను.

సుదర్శన్ అతనందించిన చీటీ అందుకుని, అర్ధరూపాయి ఇచ్చి, చిల్లర తీసుకుని, చీటీ జేబులో వేసుకున్నాడు చిల్లరతోపాటుగా.

## 5

సుదర్శన్‌కు గుండెల్లో మండిపోతోంది, సరిత అవినీతికి. తన భార్య వేశ్యా ప్రవృత్తి తినేస్తోంది మనస్సుని. ఎంత కృతఘ్నత? ఇక ఎలా కాపరం చేయగలడు కులటతో? తన

భవిష్యత్తు ఏమవుతుంది? అందరూ తనని చూసి నవ్వుకుంటారు పెళ్ళాం ఇలాంటిదని వేలెత్తి చూపిస్తూ. తను తలెత్తుకుని ఎలా తిరగడం? సరితని ఏంచేయాలి? అసలు ఆ ఎర్ర పెట్టెని ఏంచేయాలి? మరునాడు భోజనం చేస్తూ తీవ్రంగా ఆలోచిస్తున్నాడు సుదర్శన్.

అవును. వెనక్కి తీసుకోకుండా వుంచేస్తే ఏమవుతుంది? తనెవరో ఎవరికీ తెలియదు. రెండు మూడు రోజులు చూసి, వాసనవస్తే, అనుమానం కలిగితే బ్రద్దలుకొట్టి చూస్తారు పెట్టెని. అప్పటికి తన రూపురేఖలు మర్చిపోతారు ఆ క్లోక్ రూంలోని మనిషి, పోర్టర్ కూడా.

రామనాథ్ శవాన్ని కూడా గుర్తించలేరు.

పదిలక్షలమందివున్న ఈ సిటీలో ఎవరినని హంతకుడిగా పోల్చగలరు?

ఓ నెలరోజులు శెలవుపెట్టి వెళ్ళాలి ఎటైనా. ఆ నెల రోజులూ ఎక్కడున్నదీ తెలియకూడదు ఎవరికీ. ముఖ్యంగా పోలీసులకి. తనని అనుమానిస్తున్నారా అన్న విషయం గురించి రహస్యంగా ఆరా తియ్యాలి తను రాబోయేముందు.

తను ఆలోచించిన పథకం బాగానే వున్నట్లుగా అనిపించింది సుదర్శన్ కి. తృప్తిగా నిట్టూర్చాడు.

గుడ్ ఐడియా. క్లోక్ రూం రసీదు చింపేసాడు జేబులోంచి తీసి.

వాష్ బేసిన్ లో చేతులు కడుక్కుని, కౌంటర్ ముందుఆగి టెలిఫోన్ రిసీవర్ అందుకున్నాడు, కౌంటర్ లోవున్నతని అనుమతిమీద.

ముందర రామనాథ్ ఆఫీస్ నంబర్ తిప్పాడు, డైరెక్టరీలో అతని ఆఫీసు నెంబర్ వెదకి.

"హలో" వినిపించింది అవతలనుంచి ఆపరేటర్ కంఠం.

"మేనేజర్ కి కనెక్షన్ ఇవ్వండి" చెప్పాడు.

ఆపరేటర్ మేనేజర్ ఎక్స్‌టెన్షన్‌కి కనెక్ట్ చేస్తున్న చప్పుడు వినిపించింది.

"హలో" వినిపించింది మళ్ళీ.

జేబురుమాలు జేబులోంచితీసి ముఖం తుడుచుకున్నట్లుగా నటించి, ఆ రుమాలని మౌత్‌పీస్‌కి అడ్డంగావుంచి అడిగాడు సుదర్శన్.

"హలో, మేనేజర్?"

"యస్ ప్లీజ్."

టైప్‌రైటర్ శబ్దం వినిపిస్తోంది.

"నేను రామనాథ్ మిత్రుడిని."

"రామనాథ్ రావటంలేదా?" వెంటనే వినిపించింది మేనేజర్ కంఠం కోపంగా.

"అవును. మీకు ఫోన్ చేసి చెప్పమన్నాడు."

"ఎప్పుడు వస్తాడు?"

"మరో వారందాకా రాడు. ఊరెళ్ళాడు వాళ్ళమ్మగారు పోయారని తెలిసే."

"అరెరె. నాకు తెలీదే."

మేనేజర్ కంఠంలో ఈసారి కోపం సూచనామాత్రంగా నైనా లేదు.

"అవును, రాత్రి టెలిగ్రాంవస్తే వెళ్ళాడు. మీకు ఫోన్ చేసి చెప్పమన్నాడు."

"అలాగే అయితే."

"థాంక్స్."

హుక్ నొక్కాడు. తన ఆఫీస్ నంబర్ తిప్పాడు, రుమాల అడ్డంతీసి. బెల్ మోగుతోంది అటువైపు.

"హల్లో" వినిపించింది బాస్ కంఠం.

"నేను సుదర్శన్ మాట్లాడుతున్నానుసార్. ఇవాళ, రేపు శెలవు కావాలిసార్," చెప్పాడు.

"మీకు లీవ్ వుందికదా. ఏంపని?"

"ఉందిసార్ చుట్టాలొచ్చారు."

"ఆల్ రైట్. తీసుకోండి."

"థాంక్యూ సర్."

క్లిక్ మనేదాకా పెట్టలేదు సుదర్శన్. తన బాస్ రిసీవర్ పెట్టేశాక తనూ క్రెడిల్ మీద వుంచాడు రిసీవర్ని. తనకి లీవ్ దొరకదని ఎప్పుడూ ఇబ్బంది పడక్కర లేదు. చాలా పొదుపుగా వాడతాడు తను. అత్యంత అవసరంవస్తే కాని తను సెలవు పెట్టడని తెలుసు బాస్కి. ఎప్పుడైనా కావా అంటే వెంటనే మంజూరు చేస్తాడు.

జేబులోంచి చిల్లరతీసి రెండు ఫోన్ కాల్స్కి చెల్లించాడు సుదర్శన్. ఓ ఖాళీ సోఫాలో కూర్చుని, జేబులోంచి కలం, కాగితం తీసి, అంతదాకా రామనాథ్ శవం వున్న ఎర్ర పెట్టెని వదిలించుకోవడానికి తను పెట్టిన ఖర్చు అంతా లెక్క రాసుకుని చూసుకున్నాడు ఎంతయిందో.

లేవబోతూంటే పలకరించారు ఎవరో.

"హలో మిస్టర్ సుదర్శన్."

"హలో" అపరిచిత వ్యక్తివంక చూసాడు గానిఎక్కడ ఇదివరకు చూసాడో గుర్తురాలేదు వెంటనే. సుదర్శన్ మొహంలోని భావం గుర్తించి అన్నాడావ్యక్తి.

"జ్ఞాపకంలేనా? మీ వెనక సందులో అద్దెకుందేవాడిని నాలుగేళ్ళక్రితం."

తెలూపాడు గుర్తువచ్చినట్లుగా, గుర్తురాకపోయినా.

"నిన్న మా ఆఫీస్కి వచ్చారటగా రాత్రి."

"మీ ఆఫీస్కా?"

"అవును. ఓసారి మా కొలీగ్ని పరిచయం చేసాను మీకు క్రికెట్ మాచ్ చూడటానికి మనమంతా వెళ్ళినప్పుడు. అతను చెప్పాడు."

"పారపడ్డారు నిన్న రాత్రి నేను మీ ఆఫీస్ కి రాలేదే?"

"వచ్చారు. ఓ ఎర్రపెట్టెని భద్రపరిచారటగా క్లోక్ రూంలో?" నవ్వుతూ అడిగాడు అతను.

"మీరు...?"

"క్లోక్ రూంలో పని చేస్తాను. అప్పుడే మర్చిపోయారే?" సుదర్శన్ గుండె కొట్టుకునే వేగం అకస్మాత్తుగా పెరిగింది.

"స్టేషన్ లోని క్లోక్ రూమ్ లో పని చేస్తారా మీరు?" అడిగాడు సుదర్శన్. అతనివంక గుచ్చిగుచ్చి చూస్తూ.

"అవును. కులాసానా? అక్కగారెలా వున్నారు?"

'అక్కగారు' అంటే సరిత అయివుండచ్చని అనుకున్నాడు సుదర్శన్. చేత్తోనే కులాసా అన్నట్లుగా సౌంజ్ఞ చేశాడు నోరు పెగలక.

"మీరు బాగా చిక్కిపోయారు, మిమ్మల్ని చూసిచాలా రోజులైంది."

"అవును" తేరుకుంటున్నాడు నెమ్మదిగా.

"మా కొలీగ్ రాత్రి షిఫ్టులో వున్నాడు. అతను చెప్పాడు నాకు ఏక్సిడెంటల్ గా మీరు ఓ ఎర్రపెట్టెని భద్రపరచిన సంగతి."

క్రితంరాత్రి క్లోక్ రూమ్ లోని అతను చిల్లర తిరిగి ఇస్తూ తనవంక చూసి నవ్వటం గుర్తువచ్చింది సుదర్శన్ కి. ఆలోచిస్తే ఇప్పుడు, ఆ నవ్వుల్లో పలకరింపుకూడా వుందని పించింది సుదర్శన్ కి.

"మీరుకూడా చాలాఏక్సిడెంటల్ గా కలిసారు ఇప్పుడు."

"అవును. ఏమిటి పరాకుగా వున్నారు?"

"ఏం లేదు. మీ సహాయం కావాలి."

"ఏమిటి? అడగండి."

గొంతు సర్దుకుని చెప్పాడు సుదర్శన్.

"ఆ పెట్టె తీసుకోవాలి నేను మళ్ళీ అర్జంట్ గా."

"తీసుకోండి, నా వెంటవస్తే ఇస్తాను. ఇంకో అరగంటలో నాకు డ్యూటీవుంది ఎలాగైనా."

"కాని నా దగ్గర అతనిచ్చిన రిసీట్ లేదు."

"ఆ లగేజ్ రిసీట్?"

"అవును పోయింది."

"అరె! ఎలా పోయింది? అది చాలా ముఖ్యమే?"

"పొరపాటున చూసుకోకుండా చాకలికి వేసిన బట్టల్లో పోయింది. తర్వాత చూస్తే లేదు."

అతను మౌనంగా వుండిపోయాడు.

"మీరు నాకు తెలిసినవాళ్ళు. నేను నేనేనని మీకు తెలును.ఇవ్వడానికి మీకు అభ్యంతరం వుండదనుకుంటాను."

"అలా ఇవ్వడం కష్టం."

"ఏం?"

"తర్వాత ఆడిటర్స్ అబ్జెక్ట్ చేస్తారు. నాకు మాట వస్తుంది."

"మరేం చెయ్యాలి?"

"మీరు వ్రాసివ్వండి ఓ అప్లికేషన్ మీ లగేజ్ రిసీట్ పోయినట్లుగా. కొంతకాలం ఆ పెట్టెవుంచిన తర్వాత, పెట్టె ఎవరూ క్లెయిమ్ చేయకపోతే, మీకిస్తారు, లోపలి వస్తువులు మీరు చెప్పినవి కరెక్ట్‌గావుంటే."

"అంటే ఎంతకాలం?"

"నెల రోజులు."

నెల రోజులు?!

నాలుగయిదు రోజులుపోతే వాసన బయటకి స్పష్టంగా వేస్తుంది.

"చూడండి సార్. మీరు ఎలాగైనా నాకు సాయపడాలి ఈ విషయంలో, లేకపోతే గొప్ప చిక్కులో ఇరుక్కుంటాను."

"ఏం చిక్కు."

"దాంట్లో ఆఫీస్ ఓల్డ్ రికార్డ్స్ వున్నాయి. వెంటనే రేపు ఆఫీస్‌లో ఇచ్చేయాలి వాటిని. ఇంటికి తీసుకురావడం బద్దకం వేసి క్లోక్‌రూంలో వుంచాను."

మౌనంగా ఆలోచిస్తూండి పోయాడు అతను.

"కావాలంటే మీకు ఇండెమ్నిటీ బాండ్ కూడా రాసిస్తాను."

"రూల్స్ ఒప్పుకోవు."

"ప్లీజ్. ఎలాగైనా మీరీ సహాయం చేయాలి నాకు. లేక పోతే డిస్మిస్ కూడా అవచ్చు నేను."

సుదర్శన్ అతని చేతులు పట్టుకున్నాడు ప్రాధేయ పూర్వకంగా.

"ఆల్ రైట్. పదండి" అన్నాడు అతను.

దీర్ఘంగా నిట్టూర్చాడు సుదర్శన్. భుజంమీద నుంచి సహం బరువు తీరినట్లయింది. ఇద్దరూ బయటకి వచ్చారు.

రిక్షా పిలిచాడు సుదర్శన్, అతను వద్దంటున్నా. బలవంతంగా మధ్యలో కోకోకోలా తాగించాడు అతనికి. ఇరవై నిముషాల తర్వాత చేరుకున్నారు స్టేషన్‌కు.

క్లోక్ రూమ్ రేక్స్‌నిండా పేర్చివున్న సామాను వంక ఓసారి చూసి, మూలగా నేలమీదవున్న తన ఎర్రపెట్టె వంక చూసాడు సుదర్శన్.

సుదర్శన్ స్నేహితుడి కొలీగ్ వెళ్ళిపోయాడు, అతనికి డ్యూటీ అప్పచెప్పి.

అతను చెప్పిన విధంగా కాగితంమీద వ్రాసి, సంతకం పెట్టి, తన ఎర్రపెట్టెని పోర్టర్ చేత బయటకి మోయించుకు వచ్చాడు సుదర్శన్.

రిక్షా వచ్చి రామనాథ్ పోర్షన్ ముందు ఆగింది.

"ఓ చెయ్యి వెయ్యండి మీరు కూడా" అన్నాడు రిక్షా

వాడు రిక్షాలోంచి పెట్టెని దింపుతూ.

"ఉండు. తలుపు తెరచి వస్తాను."

సుదర్శన్ రామనాథ్ పోర్షన్ తలుపు తాళం తెరచి లోపల లైటు వెలిగించి వచ్చాడు. ఇద్దరూ కలిసి లోపలికి తీసుకువెళ్ళారు పెట్టెని.

"ఏముంది దొరా ఆ పెట్టెలో? చచ్చిన వాడంత బరువుంది" అడిగాడు రిక్షావాడు చేతులు విదిలించుకుంటూ.

"లోపల చచ్చినవాడే వున్నాడు. నీకెందుకు పో. పో" కసురుకున్నాడు సుదర్శన్.

"వెధవలు. ప్రతీ వక్కడూ అడిగే వాళ్ళే" గొణుక్కున్నాడు ఆ ఎర్రపెట్టె వంక చూస్తూ.

## 6

దాదాపు ఇరవై గంటలవుతోంది రామనాథ్‌ని తను చంపి. మరో ఇరవై నాలుగు గంటలు దాటితే, వాసన వేస్తుంది శవం.

నలభై ఎనిమిది గంటల తర్వాత వేసే వాసన బయటకి రాదు ఆ బలిష్టమయిన టేకు పెట్టెలోంచి.

కాని మూడు రోజులు దాటితే మాత్రం బయటకి స్పష్టంగా వేస్తుంది అందరినీ ఆకర్షిస్తూ.

సిగరెట్ వెలిగించాడు సుదర్శన్.

చప్పుడయింది సుదర్శన్ అగ్గిపుల్ల పారేస్తూంటే.

ఉలిక్కిపడ్డాడు సుదర్శన్. చక్కమీద ఎవరో కొడుతున్న చప్పుడుగా గ్రహించాడు. రామనాథ్ లోపలనుంచి కొడుతున్నాడన్న భావన నిలువెల్లా కంపించేలా చేసింది సుదర్శన్‌ని. అనుమానంగా పెట్టెవంక చూసాడు.

మళ్ళీ వినపడింది చప్పుడు.

శ్రద్ధగా విని వూపిరి వదిలాడు. తలుపు చప్పుడు. ఎవరో తలుపు కొడుతున్నారు బయటనుంచి_ పెట్టెలోంచి కాదు.

ఎవరై వుండచ్చు? ఎవరు వస్తారు ఈ సమయంలో రామ నాథ్ కోసం? కొంపతీసి పోలీసులు కాదు కదా?

తలుపు దగ్గరికివెళ్ళి గడియ తెరిచాడు.

పోలీసులు కాదు.

ఎవరో నలభైఏళ్ళతను నిలబడివున్నాడు లుంగీ, బని యన్లలో, నోట్లో చుట్టతో.

"ఎవరు కావాలి?" అడిగాడు సుదర్శన్ అతని ఆకారం వంక చూసి. అతన్ని ఎప్పుడూ చూడలేదు అంతకు మునుపు.

మీ రెవరన్నట్లుగా చూస్తూ అడిగాడు ఆ కొత్త వ్యక్తి.

"రామనాథ్ లేడా!"

"లేడు. మీరు...?"

"ఎక్కడికి వెళ్ళాడు? మీకేమవుతాడు?"

"స్నేహితుడు. వూరు వెళ్ళాడు. మరో వారం దాకా రానని చెప్పివెళ్ళాడు."

"మేం ఈ పక్క పోర్షన్లో ఉంటున్నాం. ఈ దయమే వూరినుంచి తిరిగి వచ్చాం. అలికిడయితే రామనాథ్ వచ్చి వుంటాడనుకున్నాం."

"లేదు. రాలేదు."

సుదర్శన్ భుజాలమీదగా చూసాడు అతను గుప్పుగుప్పు మని పొగ వదులుతూ ఆ ఎర్రపెట్టె వంక.

దాంట్లో ఏం వుంది అని అడుగుతా డనుకున్నాడు కాని, అడగకుండా తన పోర్షన్లోకి వెళ్ళిపోయాడు అతను. తలుపు మూసాడు సుదర్శన్ అసంతృప్తితో. ఆ ఎర్రపెట్టెని తొందరగా వదిలించుకోవాలి. ఆలస్యం అవుతున్న కొద్దీ తనకు ఆపద చేరువవుతున్నట్లుగా వూహించాడు సుదర్శన్.

# 7

శబ్దం గాకుండా తలుపు తెరచి రోడ్డుమీదకి చూసాడు సుదర్శన్.

అర్ధరాత్రి దాటింది కాబట్టి నిర్మానుష్యంగా వుంది రోడ్డు పూర్తిగా.

రెండు చేతులతో అతి ప్రయత్నంమీద ఎర్రపెట్టెని భుజాలమీదకి ఎత్తుకున్నాడు సుదర్శన్. రోడ్డుమీద ఎవరూ కనపడకూడదని భగవంతుణ్ణి ప్రార్థిస్తూ, రెండిళ్ళ అవతల, సందు చివరవున్న ఖాళీస్థలంలో వేగంగా నడిచాడు సుదర్శన్, ఆ చిమ్మచీకటిలో.

ఇల్లు కట్టలేదు ఆ ఖాళీ స్థలంలో. చుట్టూ ప్రహారీ గోడ మాత్రం పెట్టారు. ఓ మూల ఇసుక దిబ్బవుంది. గోడమీద నుంచి ఇసుక దిబ్బమీదకి పడేశాడు సుదర్శన్ ఆ ఎర్ర పెట్టెని. చప్పుడు చెయ్యలేదు పెట్టె కొంచెం కూడా, ఇసుక దిబ్బమీద పడడంవల్ల.

ఓసారి వూపిరి పీల్చుకుని గబగబా పరిగెత్తాడు రామనాథ్ పోర్షన్ వైపు. సిద్ధంగా వుంచిన పార, పలుగు అందుకుని, లైటార్పి, తలుపు శబ్దం కాకుండా మూసి, బయట గొళ్ళెం పెట్టి తాళం వేసాడు.

మళ్ళీ ఓసారి జాగ్రత్త కోసం రోడ్డుమీదకి చూసి, ఎవరూ లేరని నిర్ణయించుకున్నాక ఆ ఖాళీ స్థలం వైపుకు పరిగెత్తాడు. రెండంగల్లో చేరుకున్నాడు. గోడమీద నుంచి ఎక్కి అవతలకి దూకాడు. ఇసుక దిబ్బమీద పడ్డాడు.

కటిక చీకటిగా ఉంది లోపలంతా. పగలు చాలాసార్లు చూడటంవల్ల, లోపల ఎలా వుంటుందో తెలుసు సుదర్శన్‌కి. నాలుగు వైపులా పునాది తీసారు. మధ్యలో తవ్వాలి, నాలుగు పునాది స్థంభాల మధ్య. గది పడబోయే చోటంతా మట్టే.

ఆ మట్టిలో కప్పెడితే పైన త్వరలో గది పడిపోతుంది. ఇల్లు తయారయ్యాక ఇక ఎవరికీ తెలియదు, తెలిసే అవకాశం కూడా వుండదు.

రామనాథ్ 'మిస్సింగ్'గా మిగులుతాడు.

కాశీలో సన్యాసుల్లో కలిసి పోయాడని, ప్రచారం చేయచ్చు.

ఇనుప గునపంతో తవ్వసాగాడు మధ్య, సుదర్శన్ గబ గబా. తనవెంట తెచ్చిన టార్చి లైట్ చూట్టూ గుడ్డచుట్టి వెలిగించి, తను తవ్వే చోట మాత్రం మందంగా వెలుగు పడేలా ఏర్పాటు చేసాడు సుదర్శన్.

తవ్వి చేతులతో, పారతో గుబగబా మట్టి తీస్తున్నాడు. ఆరున్నరడుగుల లోతయినా వుండాలి కనీసం. నాలుగడుగులు పెట్టెపోతే, పైన రెండున్నరడుగులు మట్టి. వర్షం వచ్చినా చేసినా బయటపడదు పెట్టె.

ఖర్మకాలి ఒకవేళ బయటపడ్డా లోపల రామనాథ్ గుర్తు పట్టలేని స్థితిలో వుంటాడు. భయం వుండదు తనకి.

ఆగిపోయాడు త్రవ్వడం ఆపి.

ఎవరో ఇద్దరు రోడ్డుమీద మాట్లాడుకుంటూ నడిచి వెళ్తున్నారు. వాళ్ళు దూరం అయాక మళ్ళీ త్రవ్వసాగాడు సుదర్శన్ గబగబా. మట్టంతా కుప్పగా ప్రక్కగా పోస్తున్నాడు.

టకటకా చప్పుడయింది దూరంగా అరగంట తర్వాత.

గూర్ఖా.

గుండెలు టకటక కొట్టుకుంటున్నాయి సుదర్శన్‌కి. ఈ ఖాళీ స్థలంలో కూడా బ్యాటరీ లైట్ వేసి చూస్తాడా!

ఇళ్ళ తలుపులమీద కర్రతో కొట్టుకుంటూ వస్తున్నాడు గూర్ఖా. వూపిరి బిగపట్టి అలాగే కూర్చున్నాడు సుదర్శన్ గబగబా తవ్వుతూ, ఏమయితే అదే అవుతుందని.

గూర్ఖా మరీ దగ్గరవగానే త్రవ్వడం ఆపాడు సుదర్శన్.

అదృష్టం. గూర్ఖా ఆగి చూడలేదు ఆ ఖాళీ స్థలంలో లైటు వేసి.

కూరా వెళ్ళాక, బేటరీ లైట్ వేసి చూసాడు సుదర్శన్ నాలుగడుగులు త్రవ్వానని తెలుసుకున్నాడు కాళ్ళు లోపలికి పెట్టి కొలిచి. చాలదు.

అరగంట వూపిరి తిప్పుకోకుండా గబగబా త్రవ్వాడు, ఎంత త్వరగా తన పని తెములుతే అంత మంచిదని.

మూడు ముప్పావుకి చాలా భాగం తయారయింది. నాలుగుంపావుకి పని పూర్తిచేసాడు సుదర్శన్.

రెండు నిముషాలు విశ్రాంతి తీసుకున్నాడు ఆయాసం, అలుపు తీర్చుకుంటూ. తర్వాత ఇసక దిబ్బమీద వున్న ఆ పెట్టెని, ఇసకమీదే దొర్లించుకుంటూ గోతి దగ్గరకి తీసుకు వచ్చాడు.

గోతిలోకి తోసాడు పెట్టెని.

పెట్టె గోతిలోకి పడ్డాక తన తప్పు తెలుసుకున్నాడు సుదర్శన్. పెట్టెకున్న ఓ అంచు పైకి కనిపిస్తోంది గోతి లోంచి. పెట్టె కొలత ప్రకారం, అరడుగు ఎక్కువ వెడల్పుగా త్రవ్వాడు. కాని పెట్టెని గోతిలోకి సరిగ్గా దింపలేదు.

మరో పది నిముషాలు తంటాలు పడ్డాక పెట్టెని గోతిలో సర్దాడు సుదర్శన్. చివరి నిముషంలో కూడా తనకి ట్రబుల్ ఇస్తున్నాడు రాస్కెల్, అనుకున్నాడు సుదర్శన్.

తర్వాత గబగబా పారతో త్రవ్వి బయటకి తీసిన మట్టిని గోతిలో పోసి పూడ్చసాగాడు. అరగంట అవకుండానే గోతిని పూడ్చేసాడు; రెండు కాళ్ళతో ఆ ప్రాంతమంతా తొక్కి, సమిసా చేసీ, మట్టి పూడ్చాడు.

కాని ఇంకా చాలా మట్టి మిగిలిపోయింది కుప్పగా బయట. ఓ పక్కగా పారతో ఆ మట్టిని కొంచెం కొంచెం అక్కడక్కడా చల్లి అంతా సమానంగా వుండేలా చూసాడు సుదర్శన్.

ఆ చీకటిలో అక్కడ ఎలావుందీ కనపడటం లేదు స్పష్టంగా. మర్నాడు ఉదయం చూడాలి, అనుమానాస్పదంగా వుందీ, లేనిదీ. ఒక వానపడితే అంతా మళ్ళీ మామూలుగా అయిపోతుంది.

ఇసక దిబ్బమీద కాసేపు పడుకుని, ఆకాశంలోని నక్షత్రాల వంక చూస్తూ, రిలాక్స్ అయాడు సుదర్శన్. కొండంత బరువు తీరినట్లుగా అయింది ఆ ఎర్రపెట్టెని వదిలించుకునే సరికి.

గునపం, పారలతో కదిలాడు. గోడమీదకి ఎక్కి బయటకి చూసాడు. దూరంగా ఏదో వేన్ వస్తోంది. చటుక్కున లోపలికి దూకి ఆ వేన్ వెళ్ళేదాకా పొంచి వుండిపోయాడు గోడకి ఆనుకుని.

పోలీస్ వేన్ అది!

నైట్ పెట్రోల్ వేన్!

రోడ్డుమీదకి దూకి రామనాథ్ పోర్షన్ చేరుకున్నాడు సుదర్శన్. తలుపు తాళం తెరచి, లోపలికి వెళ్ళి తలుపు గడియ పెట్టుకున్నాక 'అమ్మయ్య' అనిపించింది సుదర్శన్ కి.

లోపల దొడ్లోకి వున్న తలుపు తెరచి గునపాన్ని, పారనీ యథాస్థానంలో వుంచేసాడు.

శుభ్రంగా కాళ్ళూ చేతులూ మొహం కడుక్కున్నాడు. లోపలికి వచ్చి, టవల్ ని తీసుకుని పొడిగా తుడుచుకున్నాడు వళ్ళు.

మనస్సంతా ప్రశాంతంగా, తేలికగా వుంది సుదర్శన్ కి తను చేసిన పనికి, ఆ ఎర్రపెట్టెని వదుల్చుకోగలిగినందుకు.

వేడివేడి కాఫీ తాగితే ఇంకా ప్రాణానికి హాయిగా వుంటుందనిపించింది. వంటగదిలోని ఎలక్ట్రిక్ స్టవ్ మీద వేడినీళ్ళకి గిన్నె పడేసాడు నీళ్ళుపోసి.

అయిదు నిముషాలలో కాఫీ చేసుకున్నాడు, పాలు లేకుండానే.

వేడివేడి బ్లాక్ కాఫీ తాగాక త్రవ్వడంవల్ల ఏర్పడ్డ భుజాల, చేతుల నొప్పులు తగ్గినట్లనిపించింది. తను తాగిన గ్లాసు శుభ్రంగా కడిగి, అన్నీ ఎక్కడివక్కడ సద్ది బయటికి వచ్చాడు.

అంతలో, గుర్తుకు వచ్చింది తను చేసిన చిన్నతప్పు.

టార్చ్‌లైట్. ఇసుకదిబ్బమీద తనకి వెలుగుపడేలా వుంచిన ఆ టార్చ్‌లైట్ అలాగే వదిలేసివచ్చాడు తీసుకు రాకుండా, తిరిగివచ్చే హడావిడిలో.

టార్చ్‌నుండి పడే వెలుగు తను ఆ ఎర్రపెట్టెని పాతి పెట్టిన స్థలం చూపుతూవుంటుంది. ఎవరికయినా అనుమానం కలుగుతుంది ఆ ఇసుకదిబ్బమీద, తను తెల్లబట్ట చుట్టివుంచిన టార్చ్ చూస్తే; రాత్రి ఏదో కుంభకోణం జరిగివుంటుందని వూహిస్తారు కొంచెం తెలివైన వాళ్ళయితే.

తన ఖర్మకాలితే చాలాదూరం వెళుతుంది.

రామనాథ్ ఇంటికి తాళంవేసి, గబగబా నడవసాగాడు. పాలకోసం సీసాలుతీసుకుని ఒకళ్ళిద్దరు తిరుగుతూకనిపించారు గబగబా ఆ ఖాళీస్థలం ప్రహరీగోడ దగ్గరికి వెళ్ళాడు సుద ర్శన్.

కొద్దికొద్దిగా వెలుగురేఖలు వస్తున్నాయి తూర్పున. చీకటి పోలేదు ఇంకా. ఇంకో అరగంటాగితే కొద్దిగా తెల్లవారు తుంది.

సుదర్శన్ గోడఎక్కి లోపలకి దిగబోయాడు టార్చ్ లైట్ తీసుకోవడానికి. ఇసకమీద అలాగే చెక్కుచెదర కుండావుంది టార్చ్‌లైట్ కాంతి వెదజల్లుతూ.

లోపలకి దిగలేదు సుదర్శన్. అలాగే గోడకి అంటిపెట్టు కుని, ఎదురుగా చూస్తూండిపోయాడు.

గుండె ఘల్లుమంది సుదర్శన్‌కి.

# 8

సుదర్శన్‌కి దయ్యాలంటే నమ్మకంలేదు. చచ్చినవాళ్ల శవం బ్రతికి బయటకి రావటం, తిరగడం అంటే ఎంత మాత్రం నమ్మకంలేదు. కాని ఎదురుగా కనపడే దృశ్యాన్ని చూసి నిశ్చేష్టుడైపోయాడు.

ఎదురుగా...

సరిగ్గా ఆ టార్చి వెలుగుపడేచోట...

అరగంటక్రితం తను స్వయంగా పూడ్చినచోట...

గోతిలో వుండాల్సిన పెట్టె బయటవుంది, ఆ ఎర్రపెట్టె!

ఎవరో నిలబడివున్నారు ఆ గోతిలో చలనం లేకుండా!!

క్షణంలో ఒళ్ళంతా చెమటలు పోసాయి సుదర్శన్‌కు.

కళ్లు నులుముకుని మళ్ళీ పరీక్షగా చూసాడు సుదర్శన్. ఎదురుగా కనబడుతున్న దృశ్యం.

సందేహంలేదు. ఆ ఎర్రపెట్టె బయటకి వచ్చింది. ఎవడో గోతిలో నిలబడివున్నారు. పరీక్షగా చూసాడు సుదర్శన్.

రామనాథ్!

రామనాథ్ అంత వడ్డు, పొడవు, ఎత్తు వున్నాయి గోతిలో నిలబడ్డతనికి. వంగి దేనికోసమో చూస్తున్నాడు.

సుదర్శన్ చూస్తుండగానే గోతిలోంచి బయటకి వచ్చాడు అతను. చేత్తో దేనితోనో ఆ యెర్రపెట్టె తాళం బ్రద్దలు కొడుతున్నాడు గబగబా!

సుదర్శన్‌కి మొదటినుంచీ దయ్యాలమీద యెంతమాత్రం నమ్మకంలేదు. ఒక్క యెగురు యెగిరి లోపలికి దూకాడు. ఇసుకదిబ్బమీద పడటంవల్ల ఏమాత్రం చప్పుడుకాలేదు. వంగి, పెట్టెతాళం పగలకొడుతున్న అతన్ని చాచితన్నాడు శక్తికొద్దీ తన కాలితో.

దెబ్బతిన్న అతను వెనక్కి తిరిగిచూసాడు అదురుగా.

రామనాథ్ కాడు. మరొకడు.

సుదర్శన్‌ని గుర్తుపట్టిన ఛాయలు కనిపించాయి అతని

మొహంలో. లేచాడు మీదకి. రెండు చేతులు బిగించి, ఒకే గుప్పిటగాచేసి సుదర్శన్ గడ్డంకింద బాదాడు గట్టిగా, బలమంతా వుపయోగించి.

సుదర్శన్ తల తిరిగినట్లయింది. కళ్ళు బైర్లుకమ్మాయి. వెచ్చగా కారింది నోట్లోంచి ఏదో గడ్డంమీదుగా కిందకి.

రక్తం.

మళ్ళీ అదే గుప్పిటతో మరోసారి కొట్టబోయాడు అతను. సుదర్శన్‌లో ప్రెజెన్స్ ఆఫ్ మైండ్ పనిచేసింది. తప్పుకున్నాడు పక్కకి.

వెంటనే వంగొని రెండు చేతులతో ఇసుక అందుకుని అతని మొహంమీద చల్లాడు విసురుగా. అతని మొహానికి ములుకుల్లా గుచ్చుకుని ఇసక రాలిపోయింది కిందకి. కాని రెండు కళ్ళలోపడ్డ ఇసక మాత్రం రాలలేదు కిందకి.

కళ్ళు తెరవలేక పోయాడు అతను. కళ్ళలోని ఇసక మంట పెడుతోంది విపరీతంగా.

"ఎవరు నువ్వు! ఎందుకు ఈ పెట్టె బయటకి తీసావు?"

సుదర్శన్ అతన్ని రెండు చేతులతో బాదుతూ అడిగాడు.

"కొట్టకు. చెప్తాను" అన్నాడు అతను రొప్పుతూ.

"ఎలా తెలుసు నీకు ఇక్కడ పెట్టెవున్నట్లు? చెప్పు?"

"చూసాను నువు ఇందాక గొయ్యితీసి కప్పెడితే."

తృళ్ళిపడి అడిగాడు సుదర్శన్.

"ఇందాక నేను గొయ్యితీసి ఇక్కడ చేసినదంతా చూశావా?"

"అవును."

సుదర్శన్ పరీక్ష చెయ్యలేదు అక్కడెవరన్నా వున్నారా, లేదానని. ఆ చీకట్లో, అంత అర్ధరాత్రి ఎవరు వుంటారని అనుమాన పడలేదు ఎంతమాత్రం.

"ఎందుకున్నావు ఇక్కడ?" అడిగాడు.

"దాక్కున్నాను."

"దేనికి దాక్కున్నావు?"

"పోలీసులకు భయపడి."

"ఏం చేశావు పోలీసులకు భయపడటానికి?"

"దొంగతనం."

"దొంగవా!"

"అవును."

దొంగ!

"హత్యలుకూడా చేస్తావా?"

"ఎప్పుడూ చెయ్యలేదు."

హంతకుడు కాకపోయినా దొంగ. వీడిని ఉపయోగించుకోవాలి. దొంగలు, హంతకులు తనకి సహాయపడతారని ఇంతదాకా తట్టనేలేదు.

"ఏం దొంగిలించావు?"

"డబ్బు నాలుగొందలు. ఒకళ్ళింట్లో ఓ రాత్రి దొంగిలించాను" తనకి ఏ మాత్రం ఇష్టంలేకపోయినా అతను చెప్పాడు.

"ఓ రాత్రంటే ఏ రాత్రి?"

"నెల క్రితం. ఖైదునుంచి పారిపోయి వస్తున్నాను."

"ఓహో."

జైల్లోంచి తప్పించుకున్న ఖైదీ అన్నమాట.

"ఏంవుందా పెట్టెలో?" అడిగాడు ఆ దొంగ.

"శవం?"

మొట్టమొదటిసారిగా నిజంచెప్పాడు సుదర్శన్ ఆ పెట్టెలో ఏంవుందో.

"శవం! నేను నమ్మను," అన్నాడు దొంగనవ్వి.

"ఎందుకు నమ్మవు?"

"హత్యలు చేసేవాళ్ళని చాలామందిని చూసాను నేను

జైళ్ళలో. నీలాగా వుండరు హత్య చేసేవాళ్ళు."

సుదర్శన్ ఆ పెట్టెలో తను చంపిన రామనాథ్ శవం వుందని నమ్మించే ప్రయత్నం చేయడం వృథా అనుకుని వూరుకున్నాడు.

"ఘరానా దొంగలావున్నావు. ఎంత వుందేమిటి లోపల" అడిగాడు అతను.

"చాలావుంది. కావాలంటే నువు తీసుకువెళ్లు ఆ పెట్టెని."

"నిజంగా తీసుకెళ్ళనా?"

"నిజంగానే."

క్షణంసేపు ఆశ్చర్యపోయాడు ఆ దొంగ. తర్వాత ఆలోచించాడు.

లోపల నిజంగా డబ్బు వుండివుండదు తను భ్రమపడినట్లుగా. నిజంగానే శవం వుందేమో? శవమే తప్పకుండా వుండివుంటుంది. లేకపోతే అంత నిర్భయంగా చెప్పడు ఆ పెట్టెని తీసుకువెళ్ళమని. అంతపెద్ద పెట్టెలో శవాన్ని పెట్టచ్చు నిజంగానే.

"శవం వుందని తెలియదు నాకు. డబ్బుందనుకుని ఆశ పడ్డాను. ఈ రాత్రి ఇక్కడికి రావడం నా అదృష్టమనుకున్నాను," అన్నాడు అతను.

"ఆ పెట్టెను తీసుకువెళ్లు. నీ అదృష్టం ఇంకా కొనసాగితే నిజంగా డబ్బు దొరకచ్చు లోపల. తీసుకుపో పెట్టెని."

"వద్దు. నే వెళతాను."

జేబులోంచి చిన్న రుమాలతీసి కళ్ళు తుడుచుకోసాగాడు అతను నెమ్మదిగా.

సుదర్శన్ కి అతనువో ఆశాకిరణంలా కనపడ్డాడు. వదులుకో దలచుకోలేదు అతన్ని. ఉపయోగించుకోవా లనుకున్నాడు.

"ఈ పెట్టెని తీసుకువెళ్ళి ఎక్కడయినా మాయంచెయ్యి. త్రవ్వి పాతిపెట్టు. మరేదైనా చేయి. నాకీ ఉపకారం చేస్తే

నిన్ను వదులుతాను. లేకపోతే పోలీసులకి పట్టిస్తాను తెలుసా?"

పకపకా నవ్వాడు అతను.

"బావుంది. నన్ను పట్టిస్తే నువ్వు దొరుకుతావు ఈ శవంతో. బెదిరించి ఏపని చేయించుకోలేవు ఈ లోకంలో. డబ్బిచ్చి ఏ పనయినా చేయించుకోవచ్చు."

"పోనీ డబ్బు కావాలంటే అలాగే తీసుకో. ఎంత కావాలి?"

కొంచెంసేపు ఆలోచించి అన్నాడు.

"నిజంగా తీసుకెళ్ళనా?"

"నిజంగానే."

"వంద రూపాయలవుతుంది."

"వంద రూపాయలే?"

"అవును. అంతకు తక్కువ కుదరదు."

"ఏంచేస్తావ్ వంద రూపాయలు?"

"ముందు ఈ పెట్టెని బుక్ చేస్తాను ట్రాన్స్‌పోర్ట్ కంపెనీలో దేంట్లోనైనా ప్రక్క వూరికి. రైల్లో వెళ్ళి అక్కడ విడిపించి ఓ స్నేహితుడికిస్తాను."

"అతనేం చేస్తాడు?"

"కాలవల్లో శవాల్ని ముంచటంలో ప్రసిద్ధుడు" నవ్వాడు.

"ఇంత డబ్బు ఖర్చు పెట్టుకుని ఇలా చేసేబదులు నేను మరో ఉపాయం చెప్తాను..."

"మీ ఇష్టం వుంటే ఇవ్వండి. లేకపోతే లేదు."

అతను వెళ్ళడానికి కదిలాడు.

"ఆగు. అలాగే. నీ ఇష్టం."

"వెంటనే ఇవ్వండి. దీన్ని తీసుకుని వెళ్ళిపోతాను."

సుదర్శన్ జేబులోంచి డబ్బుతీసి లెక్కపెట్టి ఇచ్చాడు అతనికి, కొద్దిగా అయిష్టంగానే. అతని కోరికమీద సాయం

పట్టాడు పెట్టెని బయటికి. అతను జాగ్రత్తగా ఆ పెట్టెకి అంటిన మట్టి తుడిచాడు, ఏ మాత్రం కనపడకుండా, తను విడిచిన జైలు దుస్తులతో.

"రిక్షాలో వెళతాను," అన్నాడు.

"వెళ్ళు."

సుదర్శన్ అయిదు నిముషాలలో ఓ రిక్షాతో వచ్చాడు. అతను రిక్షా బేరం ఆడకుండానే ఆ పెట్టెని రిక్షాలోకి ఎక్కించి అడిగాడు, రహస్యంగా.

"ఎవరున్నారు లోపల ఆడా, మగా?"

"మొగ."

"కత్తా, గొంతునులుమా?"

"విషం."

"వుంటా మరి."

రిక్షా కదిలి వెళ్ళిపోయింది. రిక్షా సందు మలుపు తిరగగానే తృప్తిగా నిట్టూర్చాడు సుదర్శన్.

పీడ విరగడయింది.

ఇక జన్మలో ఆ ఎర్రపెట్టె గురించి తను విచారించక్కర లేదు. అసలు ఏమైంది కూడా తనకే తెలీదు. ఏమయినా అయినా వాడినే పట్టుకుంటారు. వాడి పేరు కూడా అడగటం మర్చిపోయాడు తను హడావిడిలో.

వంద ఖర్చయిందని బాధపడ్డా తనకి పెద్ద తలనొప్పి వదిలిందని తృప్తిగా నిట్టూర్చాడు సుదర్శన్.

తనెవరో వాడికి తెలియదు. తనెక్కడుంటాడో కూడా తెలియదు. కాబట్టి వాడు తనని భయపెట్టి డబ్బు గుంజే అవకాశం కూడా లేదు.

నెమ్మదిగా నడవసాగాడు ఇంటివైపు. ఎంత మంచిదైంది తను టార్చి లైటుకోసం తిరిగి రావడం!

లేకపోతే వాడు ఆ పెట్టె తెరచి చూసి, ఆ శవాన్ని

అలాగే పడేసి వెళ్ళిపోయేవాడు. ఎవరో వకరు చూసి పోలీస్‌లకి రిపోర్ట్ ఇస్తారు. పూర్తిగా తెల్లవారగానే ఆ ఎర్ర పెట్టెతో తనని చూసిన అనేకమంది సాక్ష్యం ఇస్తారు.

ఉరితాడు తప్పింది తనకి తను చేసిన పొరపాటువల్ల. పొరపాట్లు చేయడం కూడా ఒక్కొక్కసారి మంచిదే. తెల్లారాక ఆ గోతిని చూసి ఆ ప్లాట్ వాళ్ళు మట్టి దొంగతనంగా త్రవ్వుకునిపోయి వుంటారని భావిస్తారు.

చేతిలోని టార్చి లైట్‌తో నడుస్తున్నాడు గబగబా. సూర్యకిరణాలు స్పష్టంగా కనిపిస్తున్నాయి ఇప్పుడు. వెలుగు లోకమంతా పాకుతోంది.

# 9

హోటల్‌కెళ్ళి భోజనం టిక్కెట్ కొనుక్కుని పేపర్ తిరగేద్దామని సోఫాలో కూర్చున్నాడు సుదర్శన్. హోటల్ వాళ్ళ పేపరు తిరగేస్తూండగా—

"హలో," వినిపించింది సుదర్శన్‌కి.

తల ఎత్తి చూసాడు సుదర్శన్.

సేమన్‌లోని క్లోక్ రూంలో వుండే అతను.

"హలో."

మొహమాటానికి నవ్వాడు.

"ఇవాళ కూడా ఆఫీస్‌కి వెళ్ళలేదా మీరు?" అడిగాడు.

"లేదు. మీరు?"

"ఇప్పుడే వస్తున్నాను."

"అయిపోయిందా మీ డ్యూటీ?"

"అయిపోయింది. భోజనం చేసి ఇంటికి వెళదామని వచ్చాను."

"మీ ఆవిడ..."

"పుట్టింటి కెళ్ళింది నాలుగో కానుపుకి."

"నేను కూడా మీలాగే."

అతను లోపలికి వెళ్ళిపొయ్యాక పేపర్ పడేసి, సిగరెట్ అంటించి, ఓ సినిమా పత్రిక కనిపిస్తే అందుకున్నాడు. పేజీలు తిరగేయసాగాడు.

పది నిముషాల తర్వాత లేచాడు భోజనం చేద్దామని.

అతను మళ్ళీ కనిపించాడు, చేతులు తుడుచుకుంటూ, బయటకి వస్తూ. అతన్ని గమనించనట్లుగానే లోపలికి నడిచాడు సుదర్శన్. కాని అతను వదిలి పెట్టలేదు.

"ఏం చేసారు మీ పెట్టె? ఆఫీస్‌లో ఇచ్చేసారా?"

"ఇచ్చేసాను."

సమాధానం చెప్పాడు సుదర్శన్.

"ఇవాళ క్లోక్ రూమ్‌కు ఇంకో ఎర్రపెట్టె వచ్చింది."

"మీకు ఎర్రపెట్టెలు వస్తూంటాయనుకుంటాను రోజూ."

"కాని ఇలాంటివి నెలకోసారి కూడా రావు. ఆ పెట్టె చూడగానే మీరే గుర్తొచ్చారు."

"ఏం?"

"అచ్చు మీరు తెచ్చిన పెట్టెలాంటిదే అదికూడా."

కొద్దిగా ఇంట్రెస్ట్‌గా చూసాడు సుదర్శన్, అతని వంక.

"అలాగా."

"అవును. అదసలు మీ పెట్టేనేమో నన్న అనుమానం కలిగింది నాకు. మీ పెట్టెకి ఓ చోట రంగుపోయింది కొద్దిగా. దీనికీ అక్కడే రంగుపోయింది."

సుదర్శన్ మెదడులో ఏదో అనుమానం మొలకెత్తింది.

"తాళంకూడా అచ్చం నిన్నటి మీ పెట్టె మాదిరేవుంది."

"ఎన్ని గంటలకి వచ్చిందా పెట్టె?"

"తెల్లారాక. ఏడుకనుకుంటాను. నేను డ్యూటీకి ఎక్కిన గంట తర్వాత వచ్చింది ఆ ఎర్రపెట్టె."

"ఓ మొగతను తెచ్చాడు కదూ? కోలమొహం. కాఫీ కలర్ షర్ట్."

"అవును. అతనే. మీ పెట్టె అయితే అది."

"ఆ భగవంతుడా! ఎంత పని చేసాడు," అన్నాడు సుదర్శన్ అప్రయత్నంగా.

"ఏమిటి? ఎవరతను!?" అడిగాడతను.

"మా ఆఫీస్ బాయ్. పెట్టె ఆఫీస్‌లో ఇవ్వరా అని పంపితే తీసుకొచ్చి మీ క్లోక్ రూంలో పడేసి వుంటాడు," ఆలోచించి చెప్పాడు సుదర్శన్ అబద్ధం.

"ఆశ్చర్యంగా వుందే?"

"పదింటికి ఆఫీస్ తెరిచినప్పుడు తీసుకు వెళ్ళ లేదన్న మాట" అన్నాడు సుదర్శన్. ఆలోచిస్తున్నాడు గబగబా ఏం చెయ్యాలా, ఎలా ఆ పెట్టెని మళ్ళీ వెనక్కి తీసుకోవాలా అని.

"మీరు ఫోం చెయ్యండి."

వెళ్ళబోయాడు అతను. సుదర్శన్ అతని చెయ్యి పట్టుకుని ఆపి అన్నాడు భయంగా.

"చూడండి సార్. ఆ పెట్టెలో కొన్ని ముఖ్యమయిన రికార్డ్స్ వున్నాయని చెప్పాకదా. ఇవాళ రెండు గంటలకి మీటింగ్ సమయానికి ఆ పెట్టె అక్కడ ఉండకపోతే నా కొంప మునుగుతుంది. మేనేజర్ నన్ను డిస్మిస్ చేస్తాడు వెంటనే."

"ఇంకా టైం వుందిగా. మీ ఆఫీస్ బాయ్ వచ్చి తీసుకెళ్తాడేమో?"

"నాకు నమ్మకం లేదు. శెలవడిగాడు ఈ రోజు ఉపవాసం వున్నానని. ఇవ్వనన్నాను. అందుకని ఈ పని చేసి వుంటాడు."

"అయినా అది మీ పెట్టె అవునో, కాదో."

"తప్పకుండా మాదే. ఆ పెట్టె తెచ్చిన మనిషి గుర్తులు కూడా చెప్పాగా. అయినా వుండండి ఒక్క క్షణం," అని సుదర్శన్ టెలిఫోన్ వైపు నడిచాడు.

టెలిఫోన్ రిసీవర్ అందుకుని అయిదుసార్లు సున్నాలు తిప్పాడు, ఏదో నంబర్ డయల్ చేస్తున్నట్లుగా. రాంగ్ నంబర్ డయల్ చేస్తే వినిపించే శబ్దం వినిపిస్తోంది రిసీవర్ లోంచి.

అతను వింటూండగా మాట్లాడాడు సుదర్శన్.

"నేనుసార్. సుదర్శన్ ని."

"......"

"ఆ పెట్టె పంపాసార్ మన ఆఫీస్ బాయ్ వెంట..."

"......"

"అనుకున్నాను సార్ చేరివుండదని. పొద్దున సెలవడిగాడు. ఇవ్వనన్నాను. తీరా ఆ పెట్టె..."

"......"

"ఇలా చేస్తాడనుకోలేదు. రైలుస్టేషన్ లో క్లోక్ రూంలో వుంచాడుట. చాలా కాకతాళీయంగా అక్కడ పనిచేసే అతను కనపడితే..."

"......"

"యస్ సార్. తెస్తానుసార్..."

రిసీవర్ మూసి అడిగాడు సుదర్శన్ అతన్ని.

"నేను లగేజ్ రిసీట్ లేకుండా మళ్ళీ దాన్ని అడగడం అన్యాయం. అయినా అడగక తప్పటంలేదు. ఇస్తారా?"

"నాదేంలేదు. ఇప్పుడు డ్యూటీలో వుండి నేనుకాదు. మరొకతను. ఇస్తానంటే ఇప్పిస్తాను."

"ఒన్ సెకండ్" అని రిసీవర్ లో మాట్లాడాడు సుదర్శన్ అమితంగా భయపడిపోతూ.

"చెప్పానుసార్. ప్రయత్నిస్తానన్నారు..."

చివాట్లు తింటున్నట్లుగా మొహంపెట్టాడు సుదర్శన్. కొంచెంసేపాగి అన్నాడు.

"ఐయామ్ ఆఫుల్లీ సారీసర్, డైరెక్టర్ మీటింగ్ కి వస్తు

న్నారని తెలియదు. ఎలాగయినా అది తెస్తాను. ఇలాచేస్తా
డనుకోలేదు వాడు."

రిసీవర్ పెట్టేసి, జేబులోంచి రూమాలతీసి, నుదుటమీద పట్టిన చెమట తుడుచుకున్నాడు సుదర్శన్.

జేబురుమాలు జేబులోపడేసి అన్నాడు అతని రెండు చేతులూ పట్టుకుని. "మీ రెలాగయినా నామీద దయవుంచి ఇప్పించాలి ఆ పెట్టెని. ఇంకా చేరలేదు."

"ఫోన్ చేసి చెప్తాను మా కొలీగ్ కి..."

"అలాకాదు. మీరు నావెంట రావాలి. అంతగా అయితే ఆయనకి చెప్పగలరు మీరయితే. ప్లీజ్. మిమ్మల్ని ఇలా ఇబ్బంది పెట్టడం నాకు బాగాలేదు. అయినా ఈ ఒక్క సారికి మాత్రం దయవుంచాలి మీరు."

నిజంగా ఇబ్బందిగానే చూసాడు అతను.

"లేకపోతే నా వుద్యోగం పోతుంది. డైరెక్టర్ మంచి వాడుకాడు. చాలా బిజీమేన్. టైం వేస్ట్ చేసానని, అశ్రద్ధ వహించాననీ నన్ను సస్పెండ్ చేస్తాడు వెంటనే."

కొద్దిగా జాలివేసింది అతనికి సుదర్శన్ భయంచూస్తే.

"అలాగే. భోజనం చెయ్యండి. ప్రయత్నిద్దాం" అన్నాడు అతను.

"భోజనమా, వల్లకాడా ఇంకా. ముందు ఆ పని చూస్తే కాని నాకు ఇక భోజనం పుట్టదు" అన్నాడు సుదర్శన్ అతన్ని తొందరచేస్తూ.

వీళ్ళ సంభాషణ వింటున్న హోటల్ కాషియర్ అన్నాడు ఇద్దరూ రెండడుగులు వేయగానే.

"టెలిఫోన్ కాల్ చార్జ్ ఇవ్వలేదు మీరు?"

సుదర్శన్ జేబులోంచి మీల్స్ టిక్కెట్ తీసి కాషియర్ కి అందించి, సమాధానంకోసం ఎదురుచూడకుండా బయటికి నడిచాడు.

రిక్షాలో వెళ్ళారు ఇద్దరూ. దారిపొడుగునా సుదర్శన్ తన భయాన్ని వ్యక్తపరుస్తూనే వున్నాడు అతనికి.

వెధవ. వెధవన్నర వెధవ. మోసంచేసాడు తనని. ఊరు తీసుకువెళ్తానని చెప్పి, మాయమాటలుచెప్పి, వంద రూపాయలు గుంజుకుని, క్లోక్ రూంలో పావలాతో వదిలించుకున్నాడు ఆ ఎర్రపెట్టెని. మళ్ళీవచ్చి దాన్ని తీసుకోడు. తనకి ఖచ్చితంగా తెలుసు తనని మోసంచేసాడు. అబద్ధం చెప్పాడు తనకి.

అదృష్టం తన పక్షాన వుంది కాబట్టి ఇతను కనపడి చెప్పాడు. లేకపోతే? ఉరితాడు ఆహ్వానించేది తనని.

ఏమిటది? ఎందుకిలా అదృష్టం తన పక్షాన వుంటోంది ఇన్నిసార్లు? చివరికి ఏమవుతుంది? ముందర దీన్ని ఎలా వదిలించుకోవాలి? అసలు ఇస్తాడో, ఇవ్వడో?

రిక్షా ఆగింది స్టేషన్ ముందు.

సుదర్శన్ రిక్షావాలాకి రూపాయనోటు ఇచ్చి, చిల్లరకు ఆగకుండా అతన్ని లాక్కెళ్ళాడు క్లోక్ రూమ్ వైపు.

"దయచేసి మీరేదైనా ఏర్పాటు చెయ్యాలి," అన్నాడు బ్రతిమాలుతున్నట్లుగా.

అతనివెంట లోపలికి వెళ్ళాడు సుదర్శన్.

పెట్టెలదగ్గరికి వెళ్ళిచూసాడు. ఆ ఎర్రపెట్టెకి అంటించి వుంది తుమ్మజిగురుతో లగేజ్ రిసీట్ డూప్లికేట్ కార్బన్ కాపీ. మట్టివాసన వస్తోంది కొద్దిగా.

"ఇదే" అన్నాడు సుదర్శన్ అతనితో.

సుదర్శన్ పరిస్థితి వివరించాడు తనకొలీగ్ కి అతను.

"ఆ ఎర్రపెట్టె తీసుకోడానికి రసీదులేదు. తర్వాత ఇస్తాడు వాళ్ళ ఆఫీస్ బాయ్ దగ్గర తీసుకుని."

క్లోక్ రూం ఇన్ చార్జ్ మౌనంగా వుండిపోయాడు.

"చాలా అర్జెంట్ సార్. ప్లీజ్" ప్రాధేయపూర్వకంగా

అన్నాడు సుదర్శన్ ఇన్‌చార్జ్‌తో.

"అవుట్ ఆఫ్ వే అవుతుంది అలా చేయడం," అన్నాడు క్లోక్‌రూం ఇన్‌చార్జ్.

"అవుతుంది. అలా కాకపోతే నా ఉద్యోగం వూడు తుంది."

"సడన్‌గా ఎవరైనా మామీద చెకింగ్‌కివస్తే ఇబ్బంది పడటమేకాదు. మా ఉద్యోగంకూడా వూడుతుంది," అన్నాడు ఇన్‌చార్జ్ నవ్వుతూ.

"ప్లీజ్. ఈ సహాయం జన్మలో మర్చిపోలేను."

సుదర్శన్ స్నేహితుడు బయటకి పిలిచాడు సుదర్శన్‌ని. రహస్యంగా చెప్పాడు.

"నిన్న నేనుకాబట్టి సరిపోయింది. ఇతనిది మరీ 'వర్క్ టు రూల్' స్వభావం."

నిస్సహాయంగా చూసాడు సుదర్శన్.

"నన్ను తప్పుగా అర్థంచేసుకోకండి. ఓ యాభైవుంటే ఇవ్వండి. తంటాలుపడతాను అతనితో. అలాంటి రకమే."

మాట్లాడకుండా ఏభైరూపాయలు తీసిచ్చాడు సుదర్శన్ అతనికి. బయటే వుండిపోయాడు సుదర్శన్. ఉత్సాహం లేదు సుదర్శన్‌కి అతను నిజంగా క్లోక్‌రూం ఇన్‌చార్జ్‌కి ఆ డబ్బు ఇస్తున్నాడా లేక తనే స్వాహా చేసుకున్నాడా అన్న విషయం తెలుసుకోడానికి. ఎలాగైనా ఆ పెట్టె రావాలని ప్రార్థిస్తున్నాడు దేముడిని.

రెండునిముషాల తర్వాత వచ్చాడు అతను.

"మీరు పెట్టె తీసుకోవచ్చు," చెప్పాడు.

అమృతంలా అనిపించాయి సుదర్శన్‌కి ఆ మాటలు.

వెంటనే రిక్షా పిలిపించి ఆ ఎర్రపెట్టెని పోర్టర్ ద్వారా రిక్షామీదకి ఎక్కించాడు. క్లోక్‌రూం ఇన్‌చార్జ్ అందించిన కాగితంమీద, అతను చెప్పినట్లుగా రానీ, సంతకం పెట్టాడు.

కింద తన ఎడ్రస్ రాసాడు.

"వెరీ మెనీ థాంక్స్. మీ మేలు మర్చిపోలేను. ఓ రోజు మా యింటికిరండి," అన్నాడు అతనితో.

తలవూపాడు అతను చిరునవ్వుతో

"సారీ. నా మూలంగా మీకు లేటయిపోయింది. రిక్షా మీద వెళ్ళండి."

అతనికి ఓ రిక్షామాట్లాడి, తనే రిక్షావాడికి డబ్బు చెల్లించి పంపాడు సుదర్శన్.

నెమ్మదిగా రామనాథ్ ఇంటికి బయలుదేరాడు రిక్షాలో సుదర్శన్ ఆ ఎర్ర పెట్టెతో మళ్ళీ నీరసంగా.

మనసు కసిగా, కోపంగా, విసుగ్గా, చిరాగ్గా వుంది రామనాథ్ శవాన్ని వదిలించుకోలేనందుకు. తను ఎంత ప్రయత్నించేసినా అంతా ఎదురు తిరుగుతోంది చివరి క్షణంలో, తన ప్రమేయం లేకుండానే.

శక్తి, కాలం, డబ్బు అంతా దీనికోసం వృధా అయిపోతోంది. ఇరవై నాలుగ్గంటలు దీన్ని గురించే ఆలోచన. ఆఫీస్ ఇల్లు ఏమీ గుర్తురావటంలేదు.

రిక్షా ఆగింది రామనాథ్ ఇంటిముందు.

తలుపు తెరిచాడు సుదర్శన్, తాళం తెరిచి. రిక్షావాడికి సాయంచేశాడు ఆ పెట్టెని ఇంట్లో పెట్టడానికి.

డబ్బులిస్తూ అడిగాడు సుదర్శన్, రిక్షావాడిని.

"ఇంత పెట్టెలో ఏంవుందని ఇంకా అడగలేదే!"

"నిన్న నేకదాబాబు కొప్పడ్డారు ఏంవుంటే నాకేమని?" చెప్పాడు రిక్షావాడు వినయంగా.

"నిన్న నువ్వేనా తెచ్చింది ఈ పెట్టెని?"

"అవును బాబు. నా రిక్షాలోనే వచ్చింది."

వెళ్ళిపోయాడు రిక్షావాడు.

తనకి తెలియలేదు కాని గుర్తుపట్టాడు రిక్షావాడు ఆ ఎర్ర పెట్టెని. ఇలా ఎంతమందో గుర్తుంచుకుని వుంటారు ఆ ఎర్ర పెట్టెని తనని కలిపి.

# 10

కుర్చీలో కూర్చుని, సిగరెట్ వెలిగించి తాగుతూ ఆలోచించసాగాడు సుదర్శన్ ఇకముందు ఏం చేయాలా అని.

ఎర్రపెట్టె వంక చూస్తూ కూర్చున్నాడు.

ఆ ఎర్రపెట్టె తనను వదిలేలా లేదు. దానిని వదిలించుకోవటంలో తను ఇంత ఇబ్బంది పడివల్సి వస్తుందనుకోలేదు.

తనని చాలామంది చూసారు ఆ ఎర్రపెట్టెతో. పోలీసులకి ఆ ఎర్రపెట్టె దొరికితే వాళ్ళలో ఏ ఒక్కరయినా చెప్పచ్చు ఆ ఎర్రపెట్టెతో తనని చూసామని. లేదా వర్ణించి చెప్పచ్చు, తన పేరు మొదలయిన వివరాలు చెప్పలేక పోయినా.

అలా జరగచ్చు. జరగక పోవచ్చు. తను మాత్రం జాగ్రత్త పడటం మంచిది.

ముందర ఆ ఎర్రరంగుని మాయం చేయాలి ఆ వెధవ పెట్టె మీదనుంచి. తర్వాతే ఏం చేసినా.

చెప్పులు తొడుక్కుని బయటకి వచ్చి తాళంవేసి హార్డ్వేర్ షాప్స్ వుండే బజారువైపు నడిచాడు సుదర్శన్.

ఆ షాప్‌లో సేండ్ పేపర్ పెద్ద షీట్ కొని, ప్రక్క షాప్‌లో బ్రష్, ఆకుపచ్చ రంగు డబ్బా కొన్నాడు సుదర్శన్.

ఆ డబ్బాతో మళ్ళీ ఇంటివైపు నడిచాడు సుదర్శన్, కొద్దిగా తేలికపడ్డ హృదయంతో.

"అబ్బాయ్. నిన్నే అబ్బాయ్."

ఎవరో పిలుస్తున్నారు సుదర్శన్‌ని.

ఆగి పక్కకి తిరిగిచూసాడు సుదర్శన్.

రామనాథ్ బాబాయ్!

ముఖాన నవ్వు పులుముకున్నాడు సుదర్శన్.

"రామనాథ్ వచ్చాడా?" అడిగాడు ఆయన.

"రాలేదు. వారందాకా రాడని చెప్పానుగా."

"పొద్దున పదిగంటలకు వచ్చాను. తాళంవేసి వుంది. ఇంకా రాలేదనుకున్నాను. రామనాథ్ రాగానే నన్నోసారి కలవమని చెప్తావు?"

"అలాగే."

"రేపు రాత్రి వెళ్ళిపోతున్నాను వూరు."

మౌనంగా వుండిపోయాడు సుధర్శన్.

"చేతిలో ఆ రంగు డబ్బా ఏమిటి? ఎంతకొన్నావ్."

చెప్పాడు సుదర్శన్ ధర.

"మా ఇంటి కిటికీలకి వేద్దామని తీసుకు వెళ్తున్నాను."

ఇక ఆగకుండా, రామనాథ్ బాబాయి దగ్గర శెలవ తీసుకోకుండా, గబగబా నడిచాడు సుదర్శన్, ఆయన ఎక్కడ వుందీ కూడా అడక్కుండా.

తలుపు తాళంతీసి, తను తెచ్చిన సామగ్రినంతా అమర్చాడు.

సేండ్ పేపర్ అందుకుని గబగబా ఆ పేక పెట్టెకున్న ఎర్రరంగుని రుద్దసాగాడు. రెండు నిముషాలు రుద్దాక రెక్కలు నొప్పి పుట్టసాగాయి. ఆపేసాడు సుదర్శన్. రాత్రంతా గొయ్యి తవ్వటంవల్లనే ఇంకా చేతులు రెండు నొప్పిగా వున్నాయి.

రామనాథ్ మరణించి అప్పుడే రెండు రోజులుపైగా దాటుతోంది.

అంటే లోపల డికామ్పోసిషన్ మొదలయి వుంటుంది. ఇప్పుడు పెట్టె మూత తెరిస్తే భరించలేని వాసన వేస్తుంది. మరో పది గంటలు దాటితే ఆ వాసన బయటికి కూడా

వ్యాపిస్తుంది.

అందరికీ ఆ వాసనతో అనుమానం కలిగే లోపలే ఏదో ఒకటి చెయ్యాలి.

రంగు మారుస్తే ఆరడానికి అరరోజయినా పడుతుంది. ఆరేదాకా దాన్ని బయటికి తీసుకువెళ్ళటం కుదరదు.

సుదర్శన్ ఆ దొంగని తిట్టుకున్నాడు చాలాసేపు.

సరిత మీదకి మళ్ళింది ఆలోచన.

కృతఘ్నురాలు. డిబాచురర్. సంస్కారం, శీలంలేని భార్య. సరితవల్లే కదా తనకి ఇన్ని చిక్కులు. ఏంచేసినా పాపంలేదు అనుకున్నాడు.

సుదర్శన్‌లో ఒక్కసారిగా నిస్సహాయత, దైన్యం, కోపం, బాధ తన్నుకు వచ్చాయి. తనున్న సుడిగుండాన్ని తలచుకుంటే మొదటిసారిగా కళ్ళల్లో నీళ్లు తిరిగాయి, తనున్న స్థితి, పట్టుబడితే పర్యవసానం తలచుకుంటే.

మాటిమాటికీ వురితాడు గుర్తుకొస్తోంది.

తలుపు చప్పుడైంది.

తలుపు చప్పుడు వినిన ఇక నెర్వస్‌నెస్, భయంపోయాయి సుదర్శన్‌లో. నీరసంగా లేచి వెళ్ళి తలుపు తెరిచాడు.

ఇద్దరు నించునున్నారు బయట. ఎవరో సుదర్శన్‌కి తెలియదు. ఎప్పుడూ చూడలేదు వాళ్ళని.

"యస్. ఎవరు కావాలి?" అడిగాడు.

"రామనాథ్ లేడా?"

"లేడు. వూరెళ్ళాడు. రాంగానే ఏమైనా చెప్పాలా?"

"ఇవాళ రాత్రి అంతా కలిసి చిన్న ప్రోగ్రాం ఏర్పాటు చేసుకున్నాం. ఉదయం నుంచీ ఫోన్ చేయకపోతే ఏమైందో కనుక్కు వెళ్దామని వచ్చాం."

"ఏం ప్రోగ్రాం? నాతో ఏం చెప్పలేదేం?"

"పేకాట. తర్వాత డ్రింక్స్, ఇవాళ డిసెంబర్ ముప్పై

ఒకటి. ప్రతీ న్యూయిర్ రోజు రాత్రి మాకిది రివాజే.''

సుదర్శన్‌కి గుర్తొచ్చింది ఆ రోజు డిసెంబర్ 31 అని. మర్చిపోతున్నాడు వారాలు, తేదీలుకూడా ఈ హడావిడిలో పడి.

''సారీ. లేదు.''

''రాత్రిలోపల తిరిగి వస్తాడా?''

''వారందాకా రాడు.''

''సినిమాకి టిక్కెట్ బుక్ చేసానన్నాడు. మాకు రిజర్వేషన్ చేసిన టిక్కెట్స్ ఇవ్వలేదు. ఎక్కడ పెట్టాడో చూస్తారా?''

''అలాగే.''

రామనాథ్ డ్రాయర్‌మీద, అలమారులో, పేంట్ జేబులో వెదికాడు కాని కనపడలేదు సుదర్శన్‌కి. ఆ ఎర్ర పెట్టెవంక, రంగు డబ్బావంకా, సేండ్ పేపర్‌వంక చూస్తూ నిలబడ్డారు ఇద్దరూ.

''సారీ. దొరకలేదు'' చెప్పాడు సుదర్శన్.

''టేబిల్ మీద పర్స్‌వుంది చూడండి. దాంట్లో ఉండి వుండచ్చు.''

పర్స్ తెరచి లోపలవున్న టిక్కెట్స్ అందించాడు సుదర్శన్ వాళ్ళకి.

వాళ్ళు వెళ్ళిపోయాక లెక్కపెట్టాడు పర్స్‌లో డబ్బు. రూపాయిన్నర చిల్లర మాత్రమేవుంది. ప్చ్! ఏదైనా దొరకచ్చని ఆశపడ్డాడు ఈ కష్టకాలంలో.

ఆ ఎర్రపెట్టెని ఎలా వదిలించుకోవాలో మళ్ళీ ఆలోచించడం మొదలు పెట్టాడు. తటుక్కున ఓ ఆలోచన తట్టింది సుదర్శన్‌కి.

ఆ దొంగ చెప్పినట్లుగా తనేచేస్తే?

పక్క వూరుకెళ్ళి, ఏ హోటల్‌లో నయినా గది తీసుకుని,

ఈ పెట్టెని అందులో వదిలేస్తే? తనెవరో తెలియదుగా.

కాని, పక్క వూరుకి వెళ్ళేలోపల వాసన మొదలు పెడితే?

టాక్సీలో తీసుకు వెళ్ళాలి.

సుదర్శన్ శరీరంలో కొత్త ఉత్సాహం వచ్చింది, ఆ పద్ధతి మంచిదనుకోగానే.

ఓసారి అద్దం ముందుకు వెళ్ళి, జుట్టు చెరిపేసుకుని, పాపిడి మార్చాడు.

బయటికి వెళ్ళి టాక్సీ బేరం చేసాడు సుదర్శన్ ఏభై రూపాయలకి. డబ్బు నీళ్ళలా ఖర్చయి పోతూండడంవల్ల బాధగా వుంది సుదర్శన్‌కి.

టాక్సీలో, డిక్కీలో ఆ ఎర్రపెట్టెని పెట్టి బయలుదేరాడు. టాక్సీలో మరో ఇద్దరు మాత్రమే వున్నారు. తక్కువ ప్రయాణీకులు వున్నారని ఎక్కువ వసూలు చేస్తున్నాడు డ్రైవర్.

సిగరెట్ వెలిగించి ఆలోచనలో మునిగిపోయాడు సుదర్శన్. వద్దనుకున్నా ఈ ఆలోచనలు వదలడంలేదు. వెన్నాడుతూనే వున్నాయి. ముందు సీట్లో కూర్చుని ఎదురుగా వున్న రోడ్డువంక చూస్తూ ఆలోచిస్తున్నాడు.

తలచుకుంటే ఎంతో ఆశ్చర్యంగా వుంది సుదర్శన్‌కి. ఎందుకిలా అవుతోంది? తన కాయశక్తులా ప్రయత్నిస్తూంటే ఎందుకిలా అవుతోంది? ఆ ఎర్రపెట్టె తనని వెదుక్కుంటూ ఎందుకలా తిరిగి తనవద్దకే వస్తోంది? ఏదయినా మాయవుందా దాంట్లో?

మాయలు, మంత్రాలంటే తనకి నమ్మకంలేదు. ఎవరు-మాయ పెడతారు? రామనాథేమీ మాంత్రికుడుకాడు, తన శవం తననిలా ఏడిపించేలా చేయడానికి. తలచుకుంటే అంతా అద్భుతంలా వుంది.

ఏన్ ఏక్ట్ ఆఫ్ ప్యూర్ మిరకిల్. అంతే అయుండాలి.

ఆ టాక్సీలో ప్రయాణంచేసే ఇద్దరి వంకా పరీక్షగా చూసాడు సుదర్శన్. గంభీరంగా, సీరియస్‌గా కూర్చున్నారు ఇద్దరూ. వాళ్ళ మొహాలు కూడా నేరస్థుల మొహాల్లా అనిపించాయి సుదర్శన్‌కి.

నవ్వొచ్చింది తన ఆలోచనకి. నేరస్థుడి కళ్ళకి అందరూ నేరస్థుల లాగానే కనబడతారు. కళ్ళు మూసుకున్నాడు. కాదు; రెప్పలు వాటంతట అవే వాలిపోయాయి మీద ఏదో బరువు వుంచినట్లుగా. చిన్న కునుకు పట్టింది సుదర్శన్‌కి.

టాక్సీ ఒక్క కుదుపుతో ఆగేసరికి మెలకువ వచ్చింది సుదర్శన్‌కి. కళ్ళు తెరవగానే, ఎదురుగా గ్లాస్‌లోంచి కనపడిన దృశ్యం...

రోడ్ బ్లాక్!

రోడ్డుకి అడ్డంగా రెండు జీప్స్ ఆగివున్నాయి. నలుగురు రోడ్డు ప్రక్కన నిలబడి వున్నారు.

నిద్రమత్తంతా ఎగిరిపోయింది ఒక్కసారిగా.

గుండె కొట్టుకునే వేగం పెరిగింది అప్రయత్నంగా. మళ్ళీ అపాయం. ఈసారి బహుశ తను తప్పించుకోలేడు.

"ఏమిటి?" అడిగాడు ఖంగారుగా డ్రైవర్‌ని.

"ఏమో! అడగాలి" అని డ్రైవర్ అంటూండగానే ఇద్దరు టాక్సీ దగ్గరకి నడిచివచ్చారు. వాళ్ళు ఖాకీ యూనిఫాంలో వున్నారు పోలీసులు కారు. కొంచెం కుదుటపడ్డాడు సుదర్శన్.

"ఎక్కడిదాకా? ఎవరు మీరు?" అడిగాడు ఒకతను లోపలికి చూస్తూ అందరినీ ఉద్దేశించి.

తనతోటి ప్రయాణీకు లిద్దరూ దిగారు టాక్సీ తలుపు తెరచుకుని.

"ఎవరు మీరు?" అడిగాడు సుదర్శన్ కూడా దిగుతూ.

"సెంట్రల్ ఎక్సైజ్ శాఖ. ఈ దారిలో ఎక్సైజ్

సుంకం కట్టని ఎలక్ట్రికల్ గూడ్స్ వెళ్తాయని సమాచారం అందింది మాకు. మీ సామాను తణిఖీ చెయ్యాలి.''

డ్రైవర్ కూడా దిగాడు టాక్సీలోంచి తలుపు తెరచుకుని.

సుదర్శన్ కి అర్థం అయింది ఆ ఎర్ర పెట్టె తెరవకుండా వాళ్లు తనని వదలరని. తను పట్టుపడతాడు తప్పకుండా. తన పని ఖాళీ. ఈ ఆట పూర్తయింది. వురితాడు కనిపించింది సుదర్శన్ కి ఆ అధికారి కళ్ళలో.

''త్వరగా తెముల్చండి. వెనకాల మళ్ళీ బళ్లు వస్తాయి'' అన్నాడు.

తన కన్నా మిన్నగా భయపడుతున్నారు మిగతా ఇద్దరు ప్రయాణీకులు.

సుదర్శన్ ఎండిపోయిన నోరుతో అన్నాడు.

''నా పేరు సుదర్శన్. నా పెట్టెలో ఆఫీస్ ఓల్డ్ రికార్డ్స్ వున్నాయి. నేను వ్యాపారస్థుణ్ణి కాదు.''

సుదర్శన్ ఔదురు గమనించి అన్నాడు వాళ్లలో ఒకడు.

''చూపించండి. మీరు చెప్పేదాంట్లో నిజముంటే వెంటనే వెళ్ళొచ్చు. మీకు ఆలస్యం వుండదు'' డిక్కీ తెరిచాడు అతను.

ఆ ఇద్దరి ప్రయాణీకులలో ఒకడు అన్నాడు ఆ అధికారితో.

''ఓసారి ఇలా వస్తారా?''

''దేనికి!''

''ప్లీజ్.''

ఆ అధికారిని పక్కకి తీసుకెళ్ళాడు విడిగా.

సుదర్శన్ వాళ్ళవంకే చూస్తున్నాడు. అతను ఆ అధికారితో ఏదో మాట్లాడుతున్నాడు రహస్యంగా గొంతు తగ్గించి గబగబా. ఆ అధికారి ఆసక్తిగా వింటున్నాడు చిరునవ్వుతో.

నిజంగా నేరస్థుడి లక్షణం కనిపించింది అతనిలో సుద ర్శన్‌కి.

ఆ అధికారి ఏదో చెప్పాడు ఆ ప్రయాణికుడితో. రెండు నిముషాలు మాట్లాడుతూండి పోయారు ఇద్దరూ ఏదో.

సుదర్శన్ చూస్తూండగానే పది రూపాయల కట్ట చేతులు మారింది! ఆ ప్రయాణీకుడు ఆ అధికారికి డబ్బు ఇచ్చాడు!!

ఆ అధికారి దాన్ని జేబులో వేసుకుని జీప్ వైపు నడి చాడు. తన మనుషులతో ఏదో చెప్పాడు అతను.

"టాక్సీ వెనక్కి తిప్పి పోనియ్యి" అన్నాడు ఆ ప్రయా ణీకుడు డ్రైవర్ దగ్గరికి వచ్చి.

"వెనక్కా?" ఆశ్చర్యంగా అడిగాడు డ్రైవర్. అతనికి పూర్తిగా అర్థంకాలేదు జరిగినదేమీ. విచిత్రంగా వుంది. అంతవరకు ఎప్పుడూ ఇలాంటి సంఘటన జరగలేదు అతని సర్వీస్‌లో.

"అవును వెనక్కే."

"అదేం?"

"ఇక్కడ వదిలించుకోడానికే వచ్చాను. ఇంకా పైన మరో జేచ్ వుందిట. ఇక్కడ చెక్ చేసి కూడా పట్టుకోలేక పోతే ఆ జేచ్ దగ్గర పట్టుబడచ్చని ఇలా రెండు బేచెస్ ఏర్పాటు చేశారుట."

సుదర్శన్ వింటుండిపోయాడు అవాక్కయి.

"అక్కడ పట్టుకుంటే శ్రీకృష్ణ జన్మస్థానానికే వెళ్లాలి సరాసరి. వాళ్ళకీకూడా మాట వస్తుంది పైగా."

"మీ ఇష్టం. డబ్బు మాత్రం వాపసివ్వను."

"వెయ్యి వదిలింది. నీ కిచ్చిన వందో లెఖా? పద. పద."

అంతా టాక్సీలో కూర్చున్నారు. డ్రయివర్ టాక్సీ వెనక్కి తిప్పాడు కొంచెం హుషారుగా. డబ్బు మిగులుతుంది పెట్రోల్, శ్రమ వృథా కాకుండా.

ఆ ఇద్దరు ప్రయాణీకులు మౌనంగా కూర్చునున్నారు ఏం జరగనట్లుగానే.

టాక్సీ శరవేగంగా పోతోంది వెనక్కి మళ్ళీ.

సుదర్శన్ బుర్రలో అప్పుడే ఆలోచన మొలకెత్తింది తర్వాత ఏం చెయ్యాలా అని, అప్రయత్నంగానే.

# 11

సుదర్శన్‌కి మతిపోయినట్లుగా అయింది. రోడ్డుమీద పిచ్చిగా తిరుగుతూ ఆలోచిస్తున్నాడు. మనసులో ఒకటే ఆలోచన. ఒకటే ప్రశ్న.

ఎలా ఆ ఎర్రపెట్టెని వదిలించుకోవటం.

రామనాథ్ శవం ఇలా బూమరాంగ్ (విసిరిన ఆయుధం తిరిగి విసిరిన వాడి మీదకే రావడం)లా తన దగ్గరకే వచ్చేస్తుందే? ఎందుకిలా అవుతోంది? తన ప్రయత్నాలు ఎందుకు ఫలించడం లేదు?

చేత్తో ఓసారి గడ్డం నిమురుకున్నాడు. నిజంగా పిచ్చాడిలాగే వున్నాడు. ఇందాక తన స్నేహితుడు కనపడి పలకరించి అడిగాడు జ్వరం వచ్చిందానని. ముఖంలో కళ, కాంతి లేవు. పెరిగిన గడ్డం, తలకి నూనెరాసి మూడురోజులవుతోంది.

సుదర్శన్ కళ్ళు ఒకచోట 'టు-లెట్' అని రాసివున్న బోర్డుమీద పడ్డాయి. తళుక్కున ఓ ఆలోచన మెరసింది మెదడులో.

తన ఆలోచన ఎంతదాక సబబయినదో ఆలోచించాడు కాస్సేపు. తర్వాత గబగబా నడిచాడు ఆ ఇంట్లోకి.

ఇంటాయన ఇంటిముందున్న ఖాళీస్థలంలో మొక్కలకి నీళ్ళు పోస్తున్నాడు రబ్బరుగొట్టంద్వారా. పూల మొక్కల దగ్గిర ఆగి వాటి కుదుళ్ళలోకి నీళ్ళు పోయేలా ఏర్పాటు

చేస్తున్నాడు శ్రద్ధగా.

ఏం కావాలన్నట్లుగా చూసాడు సుదర్శన్ వంక.

"ఇళ్ళేమన్నా అద్దెకున్నాయా? టు-లెట్ బోర్డ్ చూసి వచ్చాను," చెప్పాడు సుదర్శన్.

"వుంది. డెభ్భైరూపాయలు. మీకేనా!" అడిగాడు అతను పంపుదగ్గిరకి నడుస్తూ.

తలవూపాడు సుదర్శన్.

పంపు తిప్పి అన్నాడు అతను సుదర్శన్‌తో.

"రండి. చూపిస్తాను."

సుదర్శన్ అతన్ని అనుసరించాడు. ఇంటి వెనకాల మరో చిన్నఇల్లు వుంది, అవుట్ హౌస్ లాగా. తాళం లేదు. గొళ్ళెం పెట్టివుంది బయట. గొళ్ళెం తీసి లోపలకి వెళ్లాడు అతను. సుదర్శన్ వెనకే నడిచాడు.

రెండు గదులు. ఓ చిన్న వంట గది. వంటగదిలో పంపు. పెంకుటిల్లే అయినా నీట్‌గా వుంది. కింద నాపరాళ్ళు పరిచి వున్నాయి.

"నాకు నచ్చింది" అన్నాడు సుదర్శన్ వెంటనే.

"నచ్చితే రెండు నెలల ఎడ్వాన్స్ ఇవ్వండి. వీలయినంత త్వరలో ప్రవేశించండి" అన్నాడు అతను బయటకి వచ్చాక, గొళ్ళెం పెడుతూ.

"రెండు నెలలది ఇవ్వలేనుకాని ఒక్క నెలది మాత్రం ఇస్తాను," చెప్పాడు సుదర్శన్.

"ఆల్ రైట్. కాని వచ్చే నెలమాత్రం రెండు నెలలది కలిపి ఇవ్వాలి."

"తప్పకుండా. పోతే మరో చిన్న సంగతి."

"ఏమిటి?"

" నా సామాను అట్టే లేదు. అంతాకలిపి ఓ పెట్టెలో తెచ్చుకుంటాను. మా ఆవిడ ప్రస్తుతం పుట్టింట్లో వుంది.

ఒ నెల రోజుల్లో వస్తుంది. అంతదాకా నేను ఇల్లు తాళం వేసి వుంచుతాను. నెల తర్వాత ప్రవేశిస్తాము."

"మీ ఇష్టం. అలాగే కానివ్వండి."

సుదర్శన్ జేబులోంచి డైభైరూపాయలు లెక్కపెట్టి తీసి అందించాడు ఇంటాయనకి.

"పూల మొక్కలంటే నాకు ప్రాణం. ఎంతో శ్రద్ధగా పెంచుతున్నాను. వాటినుంచి పూలు కోసినా, ఏం కోసినా మాత్రం, మీరు ఖాళీ చేయాల్సి వస్తుంది."

"అలాగే." అన్నాడు సుదర్శన్ చిరునవ్వు నవ్వి.

"రాత్రి పదిన్నరకి మెయిన్ ఆపేస్తాను."

"చిత్తం. ఇబ్బంది లేదు లెండి, కొత్తగా పెళ్ళయింది మాకు. మరీ మంచిది అలా అయితే."

సుదర్శన్ హుషారుగా బయటకి నడిచాడు.

అరగంటలో చేరుకున్నాడు రామనాథ్ ఇల్లు. ప్రక్క పోర్షన్‌లో వాళ్ళు పలకరించారు సుదర్శన్‌ని.

ముభావంగా లోపలకి వెళ్ళిపోయాడు సుదర్శన్ తలుపు తాళం తెరచి. తలుపు మూసాక సుదర్శన్‌కి ఆ గదిలో ఏదో కొత్తగా అనిపించింది.

ఆ ఎర్ర పెట్టెవంక చూసాడు. ఇందాక టాక్సీలోంచి దింపిన తర్వాత ఎలా పెట్టినది అలాగే వున్నది కదలకుండా.

వాసన పీల్చాడు గట్టిగా.

చెడువాసన దుర్వాసన.

చటుక్కున బయటకి వచ్చి తలుపు లేసాడు సుదర్శన్. బయటకి ఆ వాసన వేస్తోందేమో చూసాడు గాలి పీల్చి.

బయటకి వేయడం లేదు. లోపల మాత్రమే వేస్తోంది. అంటే ప్రారంభమయిందన్న మాట. గంటలు గడిచినకొద్దీ ఆ దుర్వాసన అధికం అయి, అందరినీ ఆకర్షిస్తుంది. తను భయపడుతున్నంతా జరిగింది.

సుదర్శన్ మళ్ళీ లోపలకి వెళ్ళి తలుపు వేసాడు. తలుపు దగ్గరే నిలబడి చూసాడు గదంతా పరీక్షగా.

ఆ వాసన పెట్టెనుంచి వస్తున్నట్లుగా అనిపించలేదు. ఆ ఎర్ర పెట్టె దగ్గరకి వెళ్ళి పరీక్షగా చూసాడు. ఒంగోని పెట్టె మీద ముక్కు వుంచి వాసన చూసాడు. ఏ సంగతీ కను క్కోలేక పోయాడు సుదర్శన్.

ఆ గదంతా తిరిగి చూసాడు. వాసన ఓ చోటినుంచి వస్తోందని గుర్తించాడు. బీరువా కిందనుంచి వస్తోంది.

చీపురుతో బీరువా కింద వూడిచాడు శుభ్రంగా.

బయటకి వచ్చింది ఆ వాసన వేసేది.

ఎలుక.

చచ్చిపోయింది ఓ ఎలుక. ఆ ఎలుకనుంచే ఆ వాసన.

సుదర్శన్ వంటగదిలోంచి దొడ్లోకి వెళ్ళి పార, గునపం తీసుకుని లోపలకి వచ్చాడు: మరో పెట్టె తీసుకుని అందు లోని బట్టలన్నీ కుమ్మరించి, ఆ పెట్టెలో పార, గునపం వుంచాడు పాత గుడ్డలతో చుట్టి.

రిక్షా పిలుచుకు వచ్చాడు బయటకి వచ్చి.

కొన్ని క్షణాల్లో రెండు పెట్టెలు రిక్షాలో వున్నాయి.

"ఆ పెట్టె బరువుగా వుంది. అందులో పుస్తకా లున్నాయి!!"

రిక్షావాడు అడక్కుండానే చెప్పాడు సుదర్శన్.

రామనాధ్ పోర్షన్ తలుపు తాళం వేసి వచ్చి రిక్షాలో కూర్చున్నాడు. ప్రక్క పోర్షన్‌లోని వాళ్ళు చూడటం లేదు. చూస్తే ఆ రెండు పెట్టెలు, ఖాళీ ప్లాస్టిక్ బకెట్, మగ్ ఎక్కడికని అడిగేవాళ్ళే. దారిలో రిక్షా ఆపించి సిమెంట్, తాపీ, ఇసక సంపాదించి, పొట్లాలుగా కట్టి పెట్టెలో పెట్టాడు.

సుదర్శన్ పది నిముషాల్లో చేరుకున్నాడు ఆ ఇంటికి.

ఇంటాయన ఆ పూల మొక్కల పాదుల్లో ఏదో మందు చల్లుతున్నాడు. నవ్వాడు పలకరింపుగా సుదర్శన్ ని చూసి.

సుదర్శన్ నవ్వి, వెనకాల రిక్షా వాడు రాగా, నడిచాడు అవుట్ హౌస్ వైపు. లోపలికి సామానంతా చేరాక వాడికి రెండు రూపాయలిచ్చి పంపాడు సుదర్శన్.

రిక్షావాడు వెళ్ళగానే సుదర్శన్ ప్లాస్టిక్ బకెట్ నిండా నీళ్లు పట్టి తెచ్చుకున్నాడు.

చీకటి పడగానే చిన్న పెట్టె తెరచి అందులోంచి పార, గునపం తీసాడు, చుట్టిన పాత గుడ్డలు విప్పి.

తలుపులు రెండూ లోపల గడియ వేసాడు, కిటికీ తలుపులతో సహా. క్రింద పరచిన నాపరాళ్ళ వంక చూసాడు పరిశీలనగా. గది మూలగా వున్న ఓ నాప రాయికి చుట్టూ బార్డర్‌లా వున్న సిమెంట్ పెచ్చులు వూడింది కొద్దిగా.

గునపానికి పాత గుడ్డలు చుట్టి నెమ్మదిగా ఆ వూడిన సిమెంట్ పెళ్ళలమీద కొట్టసాగాడు చప్పుడు కాకుండా. అరగంట తర్వాత సుదర్శన్ ఆ నాపరాయి, ప్రక్కనే వున్న మరో మూడు నాపరాళ్ళు తీసాడు.

తవ్వసాగాడు వుత్సాహంగా.

గొయ్యితవ్వి, ఆ గోతిలో పెట్టెని కప్పెట్టి, పైన మళ్ళీ గచ్చు చేసి, నాపరాళ్ళు పరిచి సిమెంట్ చేస్తే, బ్రహ్మ రుద్రాదులు కూడా కనుక్కోలేరు లోపల శవం వుంటుందని.

ఆ కాస్తంత మేర కొత్తగా సిమెంట్ చేసినట్లు కనబడుతుంది కాని లోపల ఏదైనా వుంచి సిమెంట్ చేసారని ఎవరూ వూహించలేరు. గచ్చుపాడయితే మళ్ళీ బాగుచేసారనుకుంటారు.

నెల రోజుల తర్వాత ఎండి గట్టి పడిపోతుంది. నెల తర్వాత ఇంటాయన తనకోసం ఎదురు చూస్తాడు. రాక

పోతే మరో నెల చూస్తాడు. అప్పటికీ రాడుతను.

విసుగెత్తి తాళం బద్దలు కొట్టచ్చు. లోపల అంతా ఖాళీ. మరొకరికి ఇచ్చుకుంటాడు ఇల్లు. ఇక కాలం అలా గడిచిపోతుంది భూస్థాపితం అయిన రామనాథ్ శవంవున్న ఆ ఎర్రపెట్టెతో.

ఒకవేళ ఆ పెట్టె బయటపడ్డా, నెల తర్వాత రామనాథ్ గుర్తుపట్టే విధంగా వుండడు ఆ పెట్టెలో. అస్థిపంజరం మాత్రమే మిగులుతుంది. తను ఎలా వుంటాడో మర్చిపోతాడు ఇంటాయన అప్పటికి. ఆ ఎర్రపెట్టె గురించి మిగతా అంతా కూడా మర్చిపోతారు. దట్ జ్ ది ఎండాఫ్ ది బాస్టర్డ్.

పని పూర్తవగానే గడ్డపలుగు, పార రామనాథ్ ఇంటికి చేర్చాలి, ఆ బక్కెట్, పెట్టెలతో పాటుగా. ఒకసారి ఆ పెంకుటింటికి, ఎవరితోనూ సంబంధం లేకుండా వున్న ఆ అవుట్ హౌస్‌కి, తాళం పడితే ఇక తను క్షేమమే అన్ని విధాలా.

రాత్రి ఏ రెండు గంటలకో బయటపడాలి పని పూర్తి చేసుకుని ఆ మిగిలిన వస్తువులతో. అంతదాకా ఈ బాధలు తప్పవు.

గుడ్ బై టు దికార్ప్స్ ఆఫ్ రామనాథ్ ఎండ్ బై టు ది బ్లడీ రెడ్ ట్రంక్.

## 12

పెండింగ్ వర్క్ చాలా మిగిలిపోయింది. సుదర్శన్ తన బాస్‌కి అడగక పోయినా సంజాయిషీ చెప్పాలని, రామనాథ్ శవంకోసం తను తగిలేసిన డబ్బు మొత్తం ఎంతయిందో లెక్క చూసుకుని, పని ప్రారంభించాడు. ఎర్రపెట్టెని ఇప్పటి

కైనా వదిలించుకోగలిగినందుకు అతని మనస్సంతా తేలికగా వుంది.

ఫైల్లోని అర్జెంట్ లెటర్ చదువుతూంటే చెప్పాడు ప్యూన్ వచ్చి —

"మీకోసం ఓ పోలీస్ కానిస్టేబుల్ వచ్చాడు సార్."

"ఎవరు?" తత్తరపడుతూ అడిగాడు సుదర్శన్.

"పోలీస్ కానిస్టేబుల్ బయట వున్నాడు."

మరోసారి గుండెవేగం పెరిగింది సుదర్శన్కి. కుర్చీలోంచి లేచి బయటకి నడిచాడు.

"మీరేనా సుదర్శన్?" అడిగాడు యూనిఫాంలో వున్న పోలీస్ కానిస్టేబుల్.

"అవును. ఏం?"

అతను బయట ఆగివున్న పోలీస్ వేన్ వంక చూపించి అన్నాడు.

"మా సబ్ ఇన్స్పెక్టర్ పిల్చుకు రమ్మన్నారు మిమ్మల్ని."

"దేనికీ!"

"ఏమో? నాకు తెలియదు పదండి."

"చెప్పి వస్తాను."

రెండు నిమిషాల్లో పోలీస్ వేన్లో, పది నిముషాల్లో పోలీస్ స్టేషన్లో వున్నాడు సుదర్శన్. ఏమయివుంటుందో అంతుపట్టడం లేదు.

"మీరేనా సుదర్శన్?" అడిగాడు సబ్.

"అవును."

"అంటే సరిత భర్త."

"అవును. నన్ను దేనికి పిలిపించారు?"

"ఓ హత్య గురించి."

"హత్య గురించా?"

"అవును. మీ స్నేహితుడి హత్య గురించి."

"నా స్నేహితుడెవరూ హత్యచేయబడలేదే?"

"రామనాథ్."

"రామనాథ్ హత్య చేయబడ్డాడా?"

రెండు గుటకలు వేసి అన్నాడు సుదర్శన్. బహుశ సరిత రిపోర్టిచ్చి వుంటుందనుకున్నాడు. ఆ క్షణంలో సరిత మీద ఎక్కడలేని కోపం ముంచుకొచ్చింది సుదర్శన్ కు.

"అవును. మీకీ సంగతి తెలుసు మీరేచేసారు కాబట్టి."

"మై గుడ్ హెవెన్స్. ఏమిటి మీరు మాట్లాడేది? రామనాథేమిటి? హత్యచేయబడట మేమిటి? నేను హత్య చేయటం ఏమిటి? సరిత తప్పుగా మిమ్మల్ని పెడత్రోవ బట్టిస్తోంది నామీద కోపంతో."

"సరిత మాకు రిపోర్టిచ్చిందని మీ రెందు కనుకున్నారు?"

"...నామీద కోపంతో అలా చేసివుండచ్చని అనుకున్నాను. అంతే. సరిత కాదా రిపోర్టిచ్చింది?"

"కాదు."

"మరెవరు?"

"మూడో వ్యక్తి వకరు...మీ తప్పు వప్పుకుంటారా?"

"రామనాథ్ వాళ్ళ వూరు వెళ్తానని చెప్పాడు నాకు. వారందాకా తిరిగి రాడని కూడా చెప్పి వెళ్ళాడు."

"ఎప్పుడు?"

"మూడు రోజుల క్రితం."

"అబద్ధం."

"నిజం."

"మిస్టర్ సుదర్శన్ మూడు రోజుల క్రితం మీరు రామనాథ్ ఇంటికి వెళ్ళారు రాత్రి. అక్కడ సరితని చూసి ఆవేశంతో మీరు తెచ్చిన విషం కాఫీలో కలిపి రామనాథ్

చేత త్రాగించారు. రామ్‌నాథ్ మరణించాడు అక్కడి కక్కడే."

"ఇట్సెలై. ఇట్స్ డేమ్ లై."

"ఇటీజ్ ట్రూ. తర్వాత మీరు రామనాథ్ శవాన్ని ఎర్రపెట్టెలో పెట్టి, దాన్ని మాయం చేసారు."

"ఇన్‌స్పెక్టర్ ఆపండి."

"నేను సబ్ ఇన్‌స్పెక్టర్‌ని ఇన్‌స్పెక్టర్‌ని కాను. నేను చెప్పిందంతా నిజమని నిరూపించగలను."

"ఎలా?"

"అయితే పక్కగదిలోకి రండి."

సుదర్శన్ పక్కగదిలోకి నడిచాడు సబ్ వెనకే.

"గదిలోకి చూడండి."

సుదర్శన్ గదిలోకి చూసాడు.

గుండె జబ్బుంటే అక్కడి కక్కడే ఆగిపోయివుండేది. ఒంట్లోని రక్తనాళాలన్నీ తెగిపోయినట్లుగా, ఒంట్లోని రక్తమంతా వక్కసారిగా ఆవిరయిపోయినట్లుగా అనిపించింది సుదర్శన్‌కి. కళ్లు గిర్రున తిరగసాగాయి.

ఎదురుగా గది మధ్యలో —

ఎర్రపెట్టె!!?

తను స్వయంగా గొయ్యితీసి, తవ్వి, పాతిపెట్టిన ఎర్రపెట్టె వుంది ఎదురుగా, తనని వెక్కిరిస్తూ!

"ఎక్కడిదది?" గొణిగాడు సుదర్శన్.

"మీరు దాచిన చోటునుంచి తెచ్చాము."

"ఎక్కడ దాచాను?"

"ఆ పెట్టె మీదికాదని అనుమానమా? దగ్గరికి వెళ్ళి పరీక్ష చేసి చూడండి."

సుదర్శన్ ఆ పెట్టె దగ్గరికి నడిచి పరీక్షగా చూసాడు. అదే తాళం. అదే పెట్టె. తను సేండ్ పేపర్‌తో రంగు

పోగొట్టిన చోటు అలాగే వుంది. మట్టి వాసన కూడా వేస్తోంది.

"ఇంపాసిబుల్" గొణిగాడు.

"ఇప్పుడు చెప్పండి."

సుదర్శన్ నోట మాటరాలేదు.

"మార్చురీలో వుంది శవం. విషం ఏదో ఇంకా కనుక్కోలేదు. కాని ఆ విషం తాలూకు బాటిల్ దొరికింది మీ వేలి ముద్రలతో సహా."

జేబులోంచి ఓ చిన్న బాటిల్ తీసి చూపించాడు సుదర్శన్ కి సబ్ ఇన్ స్పెక్టర్. ఆ విషం బాటిల్, వేలిముద్రలు చెడకుండా మరో పెద్దబాటిల్ లో వుంచబడింది.

"అవును" గొణిగాడు సుదర్శన్.

"రండి."

ముందు గదిలోకి వచ్చారు ఇద్దరూ.

"కూర్చోండి."

జావలాకారిపొయ్యాడు సుదర్శన్. నీరసంగా కుర్చీలో కూర్చున్నాడు సుదర్శన్, ముళ్ళమీద కూర్చున్నట్లుగా.

"ఇప్పుడు చెప్పండి జరిగిందంతా జరిగినట్లుగా."

"ఏం చెప్పను?"

కాగితం పేడ్ సుదర్శన్ ముందుకి తోసాడు సబ్ ఇన్ స్పెక్టర్.

"అంతా. ఆ పెట్టెని మీరు ఆ ఇంట్లో ఔట్ హౌస్ లో పాతిపెట్టేదాకా జరిగిందంతా టూకీగా వ్రాయండి" చెప్పాడు.

సుదర్శన్ సంశయంగా చూసాడు.

"వ్రాయండి. తప్పదు" అన్నాడు సబ్ ఇన్ స్పెక్టర్.

టూకీగా వ్రాసాడు సుదర్శన్ అంతా పావుగంటదాకా, వోపికగా. పేడ్ తోసాడు సబ్ ఇన్ స్పెక్టర్ వైపు.

అంతా చదివి అన్నాడు ఇన్‌స్పెక్టర్.

“రిమార్కబుల్ ఎండ్ స్ట్రేంజ్. ఎన్నిరోజుల్నుంచి ఇన్సిడెన్స్?”

“అవును. ఆ ఐడ్రె వదిలించుకోలేక చచ్చాను.”

“మీకా విషం ఎక్కడిది?” అడిగాడు సబ్.

“ఓ మెడికల్ రిప్రజెంటెటివ్‌ని అడిగి తీసుకున్నాను.”

“ఎలా సంపాదించాగో వివరంగా చెప్పండి!”

“నాకు విషం కావాలని అడిగాను. దేనికని అడిగాడు. ఏదో కుంటిసాకు చెప్పాను. ఇవ్వలేదు. రహస్యంగా వాడి చెస్ట్ తెరచి దొంగిలించాను.”

సబ్ ఇన్‌స్పెక్టర్ జేబులోంచి ఆ విషం బాటిల్ తీసి దాని వంక చూసి అడిగాడు.

“దీన్నే! ఎందుకు తీసుకున్నారు?”

“సంవత్సరం క్రితం ఓ డాక్టర్ ఇది ఇన్‌జెక్షన్ ఇచ్చాడు—మా నాన్నకి. అక్కడికక్కడే మరణించాడు. విషమని తెలిసింది అంతా అయ్యాక. ఏదో పొరపాటు జరిగి ఆ మందు ఇచ్చానని చెప్పాడు డాక్టర్.”

“అప్పుడు ఆ సీసామీద వున్న పేరు గుర్తుంచుకున్నారా?”

“అవును, సల్ఫాడిమడైన్ దాని పేరు. అదే ఉపయోగించాను రామనాథ్‌కి.”

“సంతకం పెట్టండి ఆ సంగతికూడా వ్రాసి.”

సుదర్శన్ అలాగే చేసాడు.

“ఆవేశంలో చంపారా? లేక ముందర చంపాలనే వెళ్ళారా?” అడిగాడు సబ్.

“రెండూ.”

కొన్ని క్షణాలు ఆ విషం బాటిల్ వంక చూసి అన్నాడు సబ్ ఇన్‌స్పెక్టర్.

“బాడ్ లక్.”

"అవును. అసలు ఎవరు రిపోర్ట్ చేసారు?" అడిగాడు సుదర్శన్.

కళ్ళముందు పురితాడు కనిపిస్తోంది ఇదివరకటి కన్నా స్పష్టంగా. తను పడిన శ్రమ అంతా వృధా అయింది.

"అదుగో. అతను రిపోర్ట్ చేసాడు."

సుదర్శన్ తల వెనక్కి తిప్పి కొద్ది దూరంలో నిలబడి వున్న అతని వంక చూశాడు.

వెంటనే కెవ్వున అరిచాడు సుదర్శన్. కుర్చీలోంచి లేచాడుగాని నిలబడలేక కూలబడిపోయాడు కుర్చీలో మళ్ళీ. ఆ గదంతా గిర్రున తిరుగుతున్నట్లుగా అనిపించింది.

ఎదురుగా నవ్వుతూ నిలబడివున్నాడు నడుంమీద చేతు లుంచుకుని.

రామనాథ్!!!

"దె..దె...దెయ్యం" అన్నమాటలు వినపడ్డాయి సుదర్శన్ నోట్లోంచి వినబడనట్లుగా.

"దెయ్యంకాదు. నేనే" అన్నాడు రామనాథ్ దగ్గరికి నడిచివస్తూ.

"నువ్వు...నువ్వు చావలేదా?" కుర్చీలోంచి లేచి నుంచుని, పడిపోకుండా బల్ల పట్టుకుని అడిగాడు సుదర్శన్, రామనాథ్ ని.

"చావలేదు. భార్యని ఎలా సంతోషపెట్టాలో తెలియదను కున్నాను నీవు ఇంతకాలం. చంపడం కూడా తెలియదని ఇప్పుడు తెలిసింది."

సుదర్శన్ మొహం ఎర్రబడింది.

"ఎలా తప్పించుకున్నావ్?" అడిగాడు.

"మీరు కాఫీలో కలిపింది విషం అని భ్రమ పడ్డారు కాని, విషంకాదది" అన్నాడు సబ్ ఇన్ స్పెక్టర్ చిరు నవ్వుతో.

"విషమే. దానివల్ల సంభవించిన ఓ మరణం చూసాను

కళ్ళారా."

"కానేకాదు ముమ్మాటికి...బహుశ మీ నాన్నగారి మరణానికి కారణం లైఫ్ ఎక్స్‌పైర్డ్ సల్ఫాడిమడైన్ అయి వుండచ్చు."

"లైఫ్ ఎక్స్‌పైర్డ్ అంటే!"

"లైఫ్ ఎక్స్‌పైర్డ్ అంటే, మందు తయారు చేశాక కొంత కాలంలో దాన్ని వుపయోగిస్తేనే గుణమిస్తుంది. ఆ కాలపరిమితి దాటాక గుణం వుండదు. విషంగా పరిణమిస్తుంది చాలాసార్లు."

"కావచ్చు కాని ఇదే మందని" అన్నాడు సుదర్శన్.

"కాఫీతాగాక మీరు దెబ్బలాడారు రామనాథ్‌తో కొట్టారు. పడిపోయాక చచ్చిపోయాడని భయపడ్డారు. నిజానికి చచ్చిపోలేదు. స్పృహా తప్పింది అంతే."

"మరి నేను స్వయంగా పెట్టెలో పెట్టి తాళంవేసానే!!"

"అదే మీరు చేసిన మరో పెద్ద పొరబాటు. పెట్టెలో స్పృహలోలేని రామనాథ్‌నుంచి రిక్షాకోసం వెళ్లారు. మీరు వెళ్ళగానే మెలకువ వచ్చింది రామనాథ్‌కి."

"ఆ తర్వాత నే చెప్తాను. జరిగింది గ్రహించాను నేను. ఈ ఆట ఎంతదాకా ఆడతాడో ఆడనీ చూద్దామని, నా పుస్తకాల షెల్ఫ్ ఖాళీచేసి, అందులోని పుస్తకాలన్నీ మూటకట్టి పెట్టెలో వుంచాను బరువుకి. నేను దాక్కున్నాను. నేను చచ్చాననీ, నా శవం అందులోనే వుందని భ్రమపడ్డావు. ఆ భ్రమతోనే లోపల శవం—అంటే నేను వున్నానా, లేదానని చెక్ చేయకుండా, ఆ పెట్టె తెరచి చూడకుండా తాళం వేసేసి రిక్షాలో తీసుకెళ్ళావు."

ఆశ్చర్యంగా వింటూండి పోయాడు సుదర్శన్.

"ఆ తర్వాత నేను నా పర్స్‌లో డబ్బు తీసుకుని, ఓ హోటల్‌లో రూం తీసుకున్నాను. నా స్నేహితుడు ఒకడు

నిన్ను కనిపెడుతూనే వున్నాడు. ఇంతకాలం ఆ పెట్టెలో నువ్వు పడే అవస్థలన్నీ నా దగ్గరకి వచ్చి చెప్పి పగలబడి నవ్వేవాడు రోజూ."

సుదర్శన్‌కి ఏం మాట్లాడాలో పాలుబోక నిలుచున్నాడు.

"ఆఖరిసారిగా ఆ పెట్టెని వదిలించుకున్నావు 'బూమరాంగ్' అవకుండా. సబ్ ఇన్‌స్పెక్టర్ డిసౌజాకి చెప్పాను వచ్చి జరిగిందంతా. అతను ఆ పెట్టె తీసుకువచ్చాడు తవ్వి. తన బలగంతో వెళ్ళి. తర్వాత కథ నీకు తెలిసిందే."

"బిలీవిట్ ఆర్ నాట్ కథలాగా వుంది" అన్నాడు సుదర్శన్ పెగిల్చుకుని.

"మిస్టర్ సుదర్శన్. మీరు ఎన్నుకున్న విధానం చాలా తప్పు. వ్యక్తిగతంగా మీకు ఎవరైనా ద్రోహంచేసినా మీరు దానికి బదులుగా 'హత్య' చెయ్యటం వంటి పెద్ద నేరం చేయడం అమానుషం, అన్యాయం. మరో పద్ధతి ద్వారా మీ కోపాన్ని తీర్చుకోవాల్సింది. సంస్కారం చదువుకున్న మీరే ఇలాచేస్తే ఎలా చెప్పండి? ఆ?"

సుదర్శన్ వంచిన తల ఎత్తలేదు.

"మిష్టర్ రామనాథ్. పెళ్ళయిన ఆడదానితో సంపర్కం మీకు సిగ్గుగా లేదూ? ఇటీజ్ ఎ క్రైం, అడల్టరీ కూడా పెద్ద నేరం."

రామనాథ్ చిరునవ్వుతో అన్నాడు.

"సరిత, నేను చాలా సంవత్సరాలనుంచి ప్రేమించుకుంటున్నాం."

"అలాంటప్పుడు పెళ్ళిచేసుకుని వుండాల్సింది."

"పరిస్థితులు అనుకూలించలేదు."

"అప్పుడు ప్రేమని గొయ్యితీసి పాతాలి."

"అలా చేయలేను. చెయ్యలేదు. ఎందుకంటే నేను డిసౌజాని కాదు. రామనాథ్‌ని కనక."

"మీ మీద అడల్టరీ నేరం ఆరోపించచ్చు."

"దటీజ్ డిఫరెంట్. ఇంక సుదర్శన్ సరితని ఏలుకోడని తెలుసు నాకు. ఇంత దూరం వచ్చాక సరితని అన్యాయం చెయ్యలేను. ఐ విల్ మేరీహర్."

సుదర్శన్, రామనాథ్ కళ్ళలోకి చూసాడు.

"అవును. నేను సరితని పెళ్ళిచేసుకుంటాను."

సుదర్శన్ మారు మాట్లాడకుండా తలవంచుకున్నాడు.

—: అయిపోయింది :—

# చిక్కుల్లోపడ్డ చిన్నది

## వాసవదత్త

ట్యాంక్ బండ్ మీద చల్లనిగాలి వీస్తోంది. అది సాయంత్రం ఎనిమిది గంటల సమయం.

ఆకాశం చిక్కని ఊదా రంగు పులుముకుంది. తేమగాలి తీవ్ర తరమయింది. ఇక కొద్ది సేపటిలో వాన వచ్చే సూచనలు ఉన్నాయి.

టాంక్ బండ్ కి ఇరువైపులా ఉన్న మెర్క్యురీ లాంప్ లు జిగజిగ మెరుస్తూ, దూరం నుండి చూచేవారికి నల్లని ఆకాశంలో ముత్యాల వరస అనే భ్రాంతి కలుగచేస్తాయి.

రోడ్డంతా నిర్మానుష్యంగా ఉంది. అల్లంత దూరం నుండి ఒక యువతి ఒగరుస్తూ వస్తోంది. ఆమె సికింద్రాబాద్ వైపు అతి వేగంగా వెళదామని ప్రయత్నిస్తోంది.

ఇంతలో వేగంగా వస్తూన్న కారుని చూసి తప్పుకుందామని ప్రయత్నించి పేవ్ మెంట్ పైకి దూకింది. కాని కాలు అకస్మాత్తుగా జారడంచేత తూలి ముందుకి పడింది.

సరిగ్గా అదే సమయంలో కారు కీచుమంటూ ఆగింది.

కారులోనుండి ఒక ఆజానుబాహుడు క్రిందికి దిగాడు. అతని నోటిలో పైప్ ఉంది. బ్లూ కలర్ లాంగ్ కోట్, తల మీద ఈవెనింగ్ కాప్ ధరించే డతను. రిమ్ లెస్ కళ్ళద్దాలలోనుండి కాంతివంతమయిన కళ్లు మెరుస్తున్నాయి. వెండి రంగులో వున్న ముంగురులు కొద్దిగా నుదురుమీద పడుతున్నాయి.

అతను ప్రొఫెసర్ వామ్. స్పెషల్ బ్రాంచ్ లో ఉన్న అధికారంలో ఉన్న సైకాలజిస్ట్, క్రిమ్ డిటెక్షన్ లో స్పెషలిస్ట్.

"లోనికి రా అమ్మాయ్! ఎక్కడికి వెళ్ళాలి" అడిగారాయన.

"అర్జంట్ గా సికింద్రాబాద్ రైల్వే స్టేషన్ కి వెళ్ళాలి. ప్లీజ్, శ్రమ అని భావించకుంటే...?" అని ఆగిందా యువతి.

"నేను డ్రాప్ చేస్తాను. రా అమ్మాయ్," అన్నారు ప్రొఫెసర్ వామ్.

ఆమె కారు నధిరోహించింది.

కారు 'యు' టర్న్ తిరిగి సికింద్రాబాద్ వైపు తిరిగింది. కొద్దిదూరం ప్రయాణంచేసి, స్టేషన్ వైపు కాకుండా కంటోన్ మెంట్ వైపు మళ్ళింది కారు.

ఆ యువతి సీట్ కి చేరగిలి కిటికీలో నుంచి బయటికి చూస్తోంది.

"నీ పేరేమిటి అమ్మాయ్?" అడిగారు వామ్.

"మాలతి" జవా బిచ్చిందామె.

"నీది ఈ వూరు కాదమ్మాయ్," అన్నారు ప్రొఫెసర్.

ఆమె ఉలిక్కిపడింది. చక్కని ఆమె నేత్రాలు భయాన్ని సూచించేయి.

మాలతి మౌనాన్ని చూచి, ప్రొఫెసర్ మాట మార్చేరు.

"ఇంతకీ ఏ ఊరు వెళదామని?"

"బెంగుళూరు" అంది మాలతి.

"వాన్నగారేం చేస్తుంటారు?"

మాలతి మౌనంగా ఉండిపోయింది. వాన చినుకులు సన్నగా పడసాగేయి. కారు మరికొంత దూరం మానవాహినిలో ప్రయాణించింది.

"బెంగుళూరు వదిలి ఇక్కడికి ఎందుకు వచ్చేవో చెప్పలేదమ్మాయ్," అడిగేరు వామ్.

"కారు ఆపండి దిగిపోతాను," అంది మాలతి.

"చూడు మాలతీ. ఇంటివద్ద ఘర్షణపడి ఇక్కడికి హఠాత్తుగా వచ్చేవు. తిరిగి ఏదో బలమయిన కారణంవలన అంత హఠాత్తుగానే బెంగుళూరుకి పోవ నిశ్చయించేవు. కాని నీ చేతిలో పెట్టె, సామాను లేదు. కనీసం హేండ్ బాగ్ అయినా లేదు. డబ్బు లేకుండా ఎలా ప్రయాణం చేద్దామని నిశ్చయించేవు," అన్నారు వామ్.

"ఇంతకీ మీ రెవరు?" అడిగింది.

"నన్ను ప్రొఫెసర్ వామ్ అంటారు. స్పెషల్ బ్రాంచ్‌లో సైకాలజిస్టని."

"నాది ఈ ఊరుకాదని ఎలా గ్రహించేరు?"

"సింపుల్. కార్‌ని స్టేషన్ వైపుకి కాకుండా కంటోన్‌మెంట్‌కి మళ్ళించేను. అయినా నువ్వేమీ అనలేదు."

మాలతి మౌనంగా వాన చినుకుల్ని చూస్తూ ఊరుకుంది.

ప్రొఫెసర్ ఒక చేతితో స్టీరింగ్ వీల్‌ని కంట్రోల్ చేస్తూ రెండవ చేతితో పైప్ పీల్చసాగేరు.

"ప్రొఫెసర్! నేను ఒక పెద్ద చిక్కులో పడ్డాను.మీకు

నా గురించి అంతా తెలియజేస్తాను. నన్ను ఆ చిక్కులో నుండి కాపాడి క్షేమంగా బెంగుళూర్‌కి పంపే ఏర్పాట్లు చేస్తారా? మీసహాయం ఎన్నటికి మర్చిపోను,"అంది మాలతి బేలగా.

ప్రొఫెసర్ అలాగే అన్నట్లు చిరునవ్వు నవ్వేరు.

అందమయిన ఆమె ముఖంలో దిగులు, ఆందోళన ప్రస్ఫుటంగా కనిపిస్తున్నాయి.

మాలతిది సహజమైన అందం. ఆరంజ్ కలర్ చీర, అదే రంగు జాకెట్ ధరించిందామె. కాళ్ళకు ఆరంజ్ కలర్ స్లిప్పర్స్,వీటన్నిటితో మాచ్ అయేటట్లు తలలో కనకాంబరం పూలు ముడిచింది. పాలు, గులాబి రేకులు కలిపి మిశితం చేసి ఆ రంగుని దేహమంతటా అలదుకున్నట్లున్న ఆమె శరీర ఛాయ, చక్కని అంగసౌష్టవం ఆమె అందాన్ని ఇనుమడింప చేస్తున్నాయి.

"ఆరంజ్ కలర్‌ని లైక్ చేసేవారు ఆడుతూ, పాడుతూ ఉత్సాహంగా వుంటారు. దిగులు పనికిరాదు మాలతీ," అన్నారు వామ్.

"అవును ప్రొఫెసర్. సరిగ్గా ఇరవై రోజుల క్రితం నేను చాలా ఆనందంగా వుండేదాన్ని. కాని అనుకోని పరిస్థితులు నా జీవితాన్ని కొత్తమలుపుకి తెచ్చేయి," అంటూ మాలతి తన గురించి చెప్పసాగింది.

## 2

సాయంత్రం ఆరయింది. తోటి స్టూడెండ్స్ అందరూ వెంటనే ప్రాక్టికల్స్‌ముగించి ఇళ్ళకు వెళ్ళిపోయారు.అయినా మాలతి చేస్తున్న ఎక్స్‌పెరిమెంట్ పూర్తి కాలేదు.

"మాలా నీ ఎక్స్‌పెరిమెంట్ ఎంతవరకు వచ్చింది" అడిగింది లేడీ లెక్చరర్.

"అయిపోవచ్చింది మేడమ్," అంటూ బునెసెన్ బర్నర్ మీద వేడిచేస్తున్న గాజు బీకర్ని కిందికి దించింది మాలతి.

బీకర్లోని ద్రవమంతా ఇగిరిపోయి రసాయనిక పదార్థమంతా క్రిస్టల్స్ బదులు నల్లని పేస్ట్గా మిగిలింది. మాలతి ఇటూ అటూ చూచింది. లెక్చరర్ అల్లంత దూరంలో వెనుదిరిగి కూర్చుని వుంది. చటుక్కున తన బీకర్ని పక్క టేబుల్ మీద వుంచి, అక్కడ ఇంకొక స్టూడెంట్ తయారు చేసిన క్రిస్టల్స్ని తన వద్దకు లాక్కుంది.

"ఇదిగో మేడమ్. ఎంత పచ్చగా వచ్చాయో నా క్రిస్టల్స్" అంటూ చూపించింది.

"గుడ్. ఐడోఫామ్ క్రిస్టల్స్ అంటే అలా వుండాలి. లేట్ అయినా చక్కగా తయారుచేసేవు" అంది లెక్చరర్.

మాలతి నవ్వుకుంటూ కాలేజినుండి ఇంటికి బయలు దేరింది.

గేట్ వద్ద ఒక్క రిక్షాకూడా లేదు. హేండ్ బాగ్ ఊపుకుంటూ సన్నగా కూనిరాగం తీస్తూ నడవసాగింది మాలతి. సిటీబస్లుకూడా ఆ టైంకి వుండవు.

మాలతి రోడ్ మలుపు తిరిగింది.

ఎలక్ట్రిక్ స్తంభం క్రింద ఇద్దరు రౌడీలు కనిపించేరు. మాలతి తల వంచుకుని వారిని గమనించనట్లే పోసాగింది. ఒక రౌడీ ఈల వేసేడు. రెండవ రౌడీ మెడచుట్టూ వున్న రుమాలుని గిరగిరతిప్పుతూ మాలతి ముఖంమీద విసిరేడు.

"ఏయ్. ఎందుకా అమ్మాయి వెంటపడ్డారు" మాలతి తలెత్తి చూడగానే చకచక నడుస్తూ వస్తున్న యువకుడు కనిపించేడు.

"మిస్టర్ నీ దారిన నువ్వు పో. లేకపోతే" అంటూ బెదరించేడు రుమాలున్న రౌడీ.

అంతే. వాడి చెంప ఫెడీమంది. వాడు గింగిరాలు తిరు

గుతూ క్రిందపడ్డాడు. రెండవ రౌడీ చటాలున చాకు తీసి యువకుడిపైన దుమికేడు. యువకుడు అతని మణికట్టు పట్టు కుని వెనక్కి విరుస్తూ మోకాలిమీద తన్నేడు. వాడు చేతి లోని చాకుని విడిచి క్రింద కూలబడ్డాడు.

ఇంతలో మొదటి రౌడీ చేతికందిన రాయిని, రుమాల్లో చుట్టి రుమాలు రెండు కొసలు పట్టుకొని గిరగిర త్రిప్పి యువకుడి కణతమీద కొట్టబోయేడు. యువకుడు రౌడీ చేతిని అలాగే పుచ్చుకొని,బియ్యం బస్తాని ఎత్తినట్లు వాడిని వీపు మీదికి ఎతుకొని ముందుకి ఝాడించి క్రిందపడేశాడు.

ఆ జోడో ట్రిక్‌తో యుద్ధం పూర్తయింది. రౌడీలు దుమ్ము దులుపుకుంటూ దౌడు తీసేరు.

"సమయానికి వచ్చి హెల్ప్ చేసేరు. చాలా థాంక్స్," అంది మాలతి.

"దట్స్ నథింగ్. పదండి మిమ్మల్ని ఇంటివద్ద డ్రాప్ చేస్తాను," అన్నాడా యువకుడు.

తెల్లటి పాంట్ మీద, చారల షర్టుటక్ చేసేడతను. బ్లాక్ షూస్. సన్నగా చిరునవ్వు చిందించే ముఖం. నల్లని ఉంగరాల జుత్తుతో ఆకర్షవంతమయిన విగ్రహం.

మాలతి అతనితో ముందుకి నడిచింది. "పదండి. ఆ కనిపించే కార్ మనదే" అన్నాడతడు.

మాలతి తలెత్తి చూసింది.

అతడు నవ్వి, "ఊఁ. పదండి. అడ్రస్ చెప్పండి. మిమ్మల్ని దించుతాను," అన్నాడు.

మాలతి నవ్వి కార్‌లో కూర్చుంది.

"మీ పేరు" అడిగాడు అతను కారెక్కుతూ.

చెప్పింది మాలతి.

"వెరీ నైస్ నేమ్. నా పేరు శ్రీనివాస్" అన్నాడతను.

నైస్ నేమ్ అనుకుంది మాలతి.

ఇల్లుదగ్గరకు రాగానే ఆపమంది మాలతి. అతను ఆపేడు.

మాలతి కారుదిగి, "చాలా థాంక్స్. రేపొకసారి రండి. మా ఫాదర్‌ని పరిచయం చేస్తాను," అంది.

"అలాగే" అన్నాడు శ్రీనివాస్ కార్ స్టార్ట్ చేస్తూ.

"చూడండి మిస్టర్" అంది మాలతి.

శ్రీనివాస్ ఆగిపోయేడు.

"ఆ కార్‌ని వదిలి వెళ్ళండి."

"ఓ యస్. రేపు రానని అనుమానమైతే అలాగే వదిలి వెళ్తాను. రేపు వచ్చి తీసుకెళ్తాను. కావాలంటే రేపు మిమ్మల్ని కాలేజి దగ్గర డ్రాప్ చేస్తాను" అన్నాడు శ్రీనివాస్.

"అలాగే డ్రాప్ చేద్దురుగాని. ఎందుకంటే ఆ కారు మాదే. కార్‌ని ఎక్కడినుండి తెచ్చారో ఆ ఆఫీస్ మా నాన్నగారిది" అంది మాలతి నవ్వు కనపడకుండా పెదిమలు బిగించుతూ.

"ఓ. ఐసీ. అలాగా!" కార్‌లోంచి క్రిందకు దూకేడు శ్రీనివాస్.

"ఇలా ఇంట్లోకి రండి," నవ్వుతూ ఆహ్వానించింది మాలతి.

అతడు సందేహిస్తూ అడుగుపెట్టేడు.

"ఊం. రండి. కాఫీ తీసుకుని వెళుదురుగాని," అంది మాలతి.

అతడు సందేహంగా "చూడండి. మీ...మీ నాన్నగారు కొంపదీసి పోలీస్ డిపార్ట్‌మెంట్‌లో ఉన్నారా," అడిగేడు.

మాలతి ఫకాలున నవ్వేసింది.

"మీకా భయం అక్కరలేదు. మా నాన్నగారు ఎల్. ఐ. సి. ఆఫీసులో మానేజర్" అంది మాలతి.

కాఫీ తాగుతూ ఉండగా అడిగింది "మీరేం చేస్తు న్నారు" అని.

"నేనా? ప్రస్తుతం రోడ్లు సర్వే చేస్తున్నాను. అన్ని ఆఫీసులకి అప్లికేషన్‌లు పడేసేను. జాబ్ ఏదయినా దొరకు తూందేమోనని కాచుకుని ఉన్నాను," అన్నాడు శ్రీనివాస్.

మాలతి ఆలోచించింది.

"మీరు రేపు సర్టిఫికెట్స్ తీసుకుని మా ఇంటికి రండి. మా ఫాదర్‌కి చెప్పి మా ఆఫీస్‌లో ట్రై చేస్తాను. ఏం?" అంది.

శ్రీనివాస్ ముఖం విప్పారింది.

మర్నాడు ఉదయం తొమ్మిది గంటలయే సరికల్లా శ్రీని వాస్ డ్రాయింగ్ రూమ్‌లో వున్నాడు. మాలతి నాన్న గారు పార్వతీశంగారు సర్టిఫికేట్స్ పరిశీలించి సంతృప్తి కరంగా తలూపేరు. అంతే అదేరోజునుండి శ్రీనివాస్ అకౌంటెంట్‌గా జాయినయ్యేడు.

ఆ రోజు సాయంత్రం కాలేజ్ గేట్ వద్ద కార్‌తో సవా జరయ్యేడు. మాలతి అతన్ని చూసి నవ్వుతూ పల కరించింది.

"అన్నమాట ప్రకారం వచ్చారే" అంటూ.

"మరి మన మాటంటే ఏమిటనుకున్నారు. ముందు ఈ స్వీట్స్ తినండి" అన్నాడు శ్రీనివాస్ స్వీట్స్ పాకెట్ ఇస్తూ.

ఆ రోజు సాయంత్రం రూఫ్ గార్డెన్‌లో పార్టీ ఇచ్చేడు శ్రీనివాస్.

ఆ మర్నాడు మధ్యాహ్నం ఆఫీస్‌లో పార్వతీశంగారి ప్రమోషన్ సందర్భంగా పార్టీ జరిగింది. ఆఫీస్‌కి మాలతి, తల్లి, చిన్న చెల్లెలు లావణ్య వెళ్ళేరు. శ్రీనివాస్ వారికి ఆఫీసు అంతా చూపించేడు. ఏడు అంతస్తులూ దిగి వచ్చే

సరికి "ఇక నేను నడవలేను బాబూ" అంది మాలతి కూలబడుతూ.

"ఉండండి. డ్రింక్స్ తెస్తాను"

శ్రీనివాస్ బయటికి వెళ్ళేడు. ఆ రోజు ప్రోగ్రామ్స్‌లో వచ్చే వారిని రిసీవ్ చేసుకునే బాధ్యత అతనిమీద పడింది. కొత్తగా అపాయింట్ అయినందువలన అందరి మెప్పూ సంపాదించాలని అతను కూడా ప్రతిపనిలో ఇంటరెస్టు తీసుకుని చేసేడు.

డ్రింక్స్ తెచ్చి అందరికి ఇచ్చేడు.

మాలతి ఆరంజ్ జ్యూస్ సిప్ చేసి "లావణ్య ఇక్కడే ఉండాలి. ఏమయింది" అంది చుట్టూ చూస్తూ.

"నే నిందులో ఉన్నాను" అంటూ సన్నగా వినవచ్చింది లావణ్య కంఠధ్వని.

"ఏదీ కనిపించదే" అంది మాలతి తల్లి.

శ్రీనివాస్ చుట్టూరా చూసేడు. ఆ రోజే ఆఫీస్ కొత్త ఐరన్ సేఫ్ తెచ్చేరు. బహుశా...ఐరన్ సేఫ్ మూత లాగేడు. కాని అది ఊడిరాలేదు.

లావణ్య అందులో ఉండిపోయింది.

శ్రీనివాస్ ముఖాన్ని చెమటలు కమ్ముకున్నాయి.

ఆ సేఫ్ ఆటోమేటిక్ మెకానిజమ్ గలది.

కాంబినేషన్ తెలిస్తేనేగాని తియ్యడం ఎవరితరమూ కాదు.

పార్వతీశంగారు హడావిడిగా సేఫ్ తెచ్చిన కంపెనీకి ఫోన్ చేసేరు. కంపెనీ మెకానిక్ ఊళ్ళో లేడుట.

మెకానిక్ వచ్చేసరికి కనీసం పది పన్నెండు గంటలవుతుంది. మరి అంతవరకూ లావణ్యకు ఊపిరాడేందుకు గాలి ఉంటుందా?

సేఫ్‌లోనుండి లావణ్య గొంతు పెడుతోంది. మాలతి పెదవులు అదరసాగేయి. ఆమె దిక్కుతోచక శ్రీనివాస్ వైపు ప్రాధేయపూర్వకంగా చూసింది.

శ్రీనివాస్ నిబ్బరంగా ఆమె భుజం తట్టి ఫోన్ చేశాడు.

పది నిముషాల్లో ఎవరో వ్యక్తి ఒక బేగ్ తెచ్చి శ్రీనివాస్‌కి అందించేడు.

శ్రీనివాస్ కైవిప్పి, బేగ్‌లోని పనిముట్లతో సేఫ్‌తో కుస్తీ పట్టసాగేడు.

అయిదు నిముషాలయింది...శ్రీనివాస్ షర్టు చెమటతో నిండిపోయింది. కాని సేఫ్ హేండిల్ ఇసుమంతయినా కదలలేదు. లావణ్య కేకలు వినిపిస్తూనే వున్నాయి.

పది నిముషాలయింది....శ్రీనివాస్ ముఖంనుండి చెమట ధారలుగా కారసాగింది.

లావణ్యకి ఓపిక లేక ఉండి ఉండి శ్వాస తీసుకుంటూ బలహీనంగా అరుస్తోంది.

వాచ్‌లో ముళ్లు తిరుగుతున్నాయి...

పదిహేను నిముషాలయ్యేయి ... లావణ్య ఏడుపుమాని వెక్కుతోంది.

ఇరవై నిముషాలయ్యేయి...లావణ్య ఏడుపు వినిపించటం లేదు. శ్రీనివాస్ ఏకధ్యానంగా హేండిల్ అడుగున ఉన్న కన్నంలో పనిముట్లు త్రిప్పి కాంబినేషన్ నంబర్‌కై కుస్తీ పట్టుతున్నాడు...క్లిక్... సేఫ్ తెరుచుకొంది.

శ్రీనివాస్, లావణ్యని చేతుల్లోకి తీసుకుని ఆర్టిఫిషియల్ రెస్పిరేషన్ వచ్చేందుకు చికిత్స చేసేడు.

లావణ్య కళ్లు నెమ్మదిగా తెరుచుకున్నాయి.

తల్లి, తండ్రుల ఆనందం ఇంతా అంతాకాదు. మాలతి కళ్ళు శ్రీనివాస్ ముఖంపైన నిలిచేయి.

ఆ రోజు సాయంత్రం పార్వతీశంగారు శ్రీనివాస్‌ని

డిన్నర్‌కి పిలిచేరు.

డిన్నర్ అయిన తర్వాత మాలతి, శ్రీనివాస్‌లు గార్డెన్ వైపు నడిచేరు. లావణ్య వారి చేతులు పట్టుకుని నడుస్తోంది.

"శ్రీనివాస్! మీ నాన్నగారు ఎక్కడున్నారు?" అడిగింది మాలతి.

"వారెప్పుడో పోయేరు" అన్నాడు శ్రీనివాస్.

"మీ యింటికి ఒకసారి వెడదామా?"

శ్రీనివాస్ ముఖంలో ఆందోళన కనిపించింది.

"ఈ రోజు వద్దు మాలతీ, మరెప్పుడయినా తీసుకెళతాను."

మాలతి ఇంకేమీ అడగలేదు.

ఇద్దరూ చెట్టాపట్టాలేసుకుంటూ ఇంటిదోవపట్టారు.

గార్డెన్ గేట్ వద్ద చాకలబనీన్ వాడు వీరిని చూసి అదోలా నవ్వేడు.

"శ్రీనివాస్! వాడు...ఆ రోజు తన్నులుతిన్న రౌడీల్లో ఒకడు కదూ?" అడిగింది.

"అవును_ వాడికింకా బుద్ధిరాలేదు" శ్రీనివాస్ అన్నాడు పళ్లు కొరుకుతూ.

రాత్రి మాలతి ఊహాలోకాల్లో తేలుతూ కళ్ళు మూసుకొంది.

'చక్కని పేరు_ అందమైన రూపం' అనుకుంది.

మర్నాడు కాలేజీకి సెలవు. మధ్యాహ్నం ఒంటిగంటయింది. ఫోన్ ట్రింగ్...ట్రింగ్‌మంటూ మోగింది. మాలతి ఛెంగుమంటూ వెళ్ళి అందుకుంది, శ్రీనివాస్ ఫోన్ చేసి ఉంటాడు అనుకుంటూ.

కాని ఫోన్ చేసింది పార్వతీశంగారు.

"మాలతీ, శ్రీనివాస్ ఇంటికి వచ్చేడా?"

"లేదు డాడీ" చెప్పింది మాలతి.

"నాకు అతనిమీద అనుమానంగా ఉంది మాలా. ఆఫీస్ సేఫ్‌లోనుండి పదివేలరూపాయలు మాయమయ్యాయి. శ్రీనివాస్ కూడా లేడు. అతను నీ దగ్గరికి వస్తే మాటల్లోకి దింపి ఉంచు, నేను పోలీసుల్తో వస్తాను."

ఫోన్ దించేసింది మాలతి.

ఆమె గుండెలు బాధతో అదురుతున్నాయి.

శ్రీనివాస్ దొంగ అంటే తను నమ్మలేకపోతోంది.

ఆ రోజు తనను రౌడీలబారినుండి రక్షించేడు. అతని ముఖం చూస్తే గొప్పింటి బిడ్డలా ఉన్నాడు. ఆ రోజు లావణ్య సేఫ్‌లో ఇరుక్కుపోతే తీసేడు ... శ్రీనివాస్ సేఫ్‌ని తెరవగలిగేడు...ఇరవై నిముషాల్లో ఐరన్ సేఫ్‌ని తెరిచేడు. మాలతి గుండెలు బరువెక్కాయి. సేఫ్‌ని తెరిచేందుకు పనిముట్లు తెచ్చినవాడిన్ని ఎక్కడో చూసినట్లు జ్ఞాపకం రాసాగింది...అతడు మరెవడో కాడు. శ్రీనివాస్ చేత తన్నులు తిన్న మొదటిరౌడీ...కొద్దిగా రూపం మార్చుకుని రావటంవల్ల తను అప్పుడు గుర్తించలేదు. నిన్న గార్డెన్ వద్ద కనిపించిన రెండవరౌడీ శ్రీనివాస్‌ను చూసి నవ్వేడు... మాలతి నమ్మలేకపోతోంది.

శ్రీనివాస్ కూడా రౌడీల్లో ఒకడు.

# 3

తల ఆలోచనల్తో పగిలిపోతోంది. కళ్ళనిండా నీళ్ళు నిండి ఏదీ కనబడడంలేదు. పెదిమల్ని బిగించి చేతికందిన బట్టల్ని సూట్‌కేస్‌లో పడేసి టాక్సీని తెమ్మని నౌకరికి చెప్పింది.

తనకోసం శ్రీనివాస్ వస్తే పొమ్మని చెప్పమని నౌకర్‌కి పురమాయించింది. తన చేతుల్తో తాను శ్రీనివాస్‌ని పోలీసులకి అప్పగించలేదు.

ఆ రోజే మాలతి హైదరాబాదులో అడుగు పెట్టింది.

మర్నాటి సాయంత్రం బంజారాహిల్స్ వైపు అలా తిరుగుతూ వెళ్ళింది. ఎంతసేపు తలచినా శ్రీనివాస్ దొంగ అంటే తను నమ్మలేకపోతోంది.

కారు హారన్ చెవిపక్కనే వినిపించడంతో చటుక్కున తిరిగి చూచింది మాలతి.

కారులో ఉన్న యువతి మాలతిని చూసి నవ్వింది.

"వాంట్ లిఫ్ట్?" అడిగిందామె.

మాలతి కృతజ్ఞత చెప్పి కారెక్కింది.

"మీ పేరేమిటి?" అడిగిందామె. మాలతి చెప్పింది. తన పేరు భారతి అని చెప్పిందా యువతి.

కారు శర వేగంగా తోలుతోందా యువతి. మాలతి బాహ్యలోకాన్ని మరచి ఆలోచనలో మునిగిపోయింది.

ఆ యువతి పిచ్చిదానిలా స్టీరింగ్ వీల్‌ని ఇటూ, అటూ త్రిప్పుతూ స్పీడుగా తోలుతోంది. కారు కొండల్లో మెలికలు తిరుగుతోంది

"......ఎవర్నీ నమ్మకూడదు. అందులో డబ్బు ఉన్నవారిని అసలే నమ్మకూడదు- వింటున్నారా..." గొణుగుతున్నదా యువతి.

మాలతి ఆలోచనలన్నీ శ్రీనివాస్ చుట్టూ తిరుగుతున్నాయి.

"...ఆనంద్ పెళ్ళిచేసుకుంటాడని అనుకున్నాను... కాని మోసపోయింది నేనే."

మాలతి ఆలోచనలు ఆ యువతి మీదికి తిరిగేయి. ఆమె చెప్పేదంతా వినసాగింది.

"...ఆనంద్ తండ్రి తెగతెంపులు చేసుకోమన్నాడు. ఆనంద్‌ని మరచిపోమ్మని నాకు డబ్బాశ చూపించేడు. అన్నింటిని డబ్బుతో కొనగలమనుకునే ధనమదాంధుడు అతనితండ్రి.

నా ఉద్యోగాన్ని తీసివేయించేడు. గత్యంతరంలేక అత్త నిచ్చిన అయిదు వేలూ పుచ్చుకుని ఇలా లోకంమీద పడ్డాను."

మాలతి ఆశ్చర్యంగా చూసిందా యువతిని. సీట్ మీద ఉన్న హేండ్ బేగ్ లో వందరూపాయలనోట్ల కట్ట వుంది. సగం తెరిచిన జిప్ లోనుండి బయటికి కనిపిస్తోంది.

"మరి కారెవరిది?" అడిగింది మాలతి.

"ఇంకెవరిది ఆనంద్ ది_ పిచ్చివాడు ఆనంద్. లోకా న్నుండి దూరంగా పోయే నాకో కారు ఇచ్చి పంపేడు."

మాలతికి కంగారు ప్రారంభమయింది.

"ఏమిటి నువు మాట్లాడేది?"

"ఏంలేదు_ స్లీపింగ్ పిల్స్ ఓ ఇరవై తిన్నాను. ఇక ఈ డబ్బు, కారు ఏమయినా నాకో ఖాతరు లేదు" వెకిలిగా నవ్విందామె.

కారు లోయలో మెలికలు తిరుగుతోంది. మాలతి తలుపు తెరిచి దూకడానికి ప్రయత్నం చేసింది. ఆ యువతి కళ్లు భారంగా మూతలు పడుతున్నాయి.

ఉన్నట్టుండి స్టీరింగ్ వీల్ మీదనుండి ఆమె చేతులు జారేయి. మాలతి ఆమెని తప్పించి స్టీరింగ్ వీల్ ని అందు కుంది.

కాని అప్పటికే కారు 40 అడుగుల లోతున్న లోయ లోకి జారింది...ధన్...పెద్దగా కుదుపు...ప్రేలుడు... మాలతి తలుపు తెరుచుకుని బయటపడింది. నాలుగడుగులు వేసి నేలకి ఒరిగింది. ఇక ఆమెకి ఏమి జరిగింది తెలియదు...

అలా ఎన్ని గంటలసేపు స్పృహతప్పి ఉందో ఆమెకే తెలియదు. కళ్లు తెరిచేసరికి రాత్రి తొమ్మిదయింది. కారు చాలావరకు కాలిపోయింది. ఆ యువతి ముఖం గుర్తుతెలియ కుండా నల్లగా మాడిపోయింది. మాలతి కారు తలుపు తీసి

చూసింది. తన హేండ్ బాగ్ ఏమైందో తెలీదు. ఆ యువతి హేండ్ బాగ్ మాత్రం ఎగిరి అల్లంత దూరాన పడి ఉంది. మంటలు ఆ బాగ్ ని తాకలేదు.

మాలతి బాగ్ తెరిచి చూసింది. అయిదువేల రూపాయలు, ఒక ఉత్తరాల కట్టమాత్రం ఉన్నాయి. ఉత్తరాల కట్ట విప్పి చూసింది. ఉత్తరాల చివర ఆనంద్ సిన్హా అని సంతకం ఉంది.

మాలతికి ఒక ఆలోచన తట్టింది. చనిపోయిన యువతి పేర తను చలామణీ కాగలితే? పోలీసుల దృష్టిలో చనిపోయినది మాలతి అవుతుంది.

మాలతి ఆ రోజునుండి భారతిగా మారింది. తిరిగి ఇంటికి వెళ్ళదలచుకోలేదు. వారం రోజులవుతోంది ఇల్లువదలి.

భారతిగా రెండు రోజులు మాత్రం చీకూ, చింతా లేకుండా గడిపింది. నాంపల్లి వెనుక ఉన్న చిన్న ఇళ్ళలో ఒక గది అద్దెకు తీసుకుంది. దగ్గరలో ఉన్న బిస్కెట్ ఫాక్టరీలో టైపిస్టు ఉద్యోగం సంపాదించింది. సర్టిఫికేట్లు పోగొట్టుకుందనీ, కొద్ది రోజుల్లో డూప్లికేట్లు తెస్తానని కంపెనీ వారికి నచ్చచెప్పింది.

జీతం నూట ఇరవై.

ఆ హాయి అట్టే నిలువలేదు.

సాయంత్రం ఇంటికి వచ్చిబట్టలు మార్చుకుని మంచంమీద వాలింది. బయట కాకులు అరుస్తున్నాయి. రిక్షాలు, సైకిళ్ళు చేసే శబ్దం వినిపిస్తోంది.

ఎవరో తలుపు తట్టారు.

తన తలుపు కాదేమో అని ఊరుకుంది మాలతి. ఇందాక మెట్లుమీద శబ్దం అయినప్పుడే వింది. ఈసారి తీరా తలుపు తట్టిన శబ్దం అయింది. తలుపు తెరిచింది మాలతి.

గారపళ్లు ఇకిలించి నవ్వుతున్నాడు అతను.

"నేను ఇన్సూరెన్స్ ఏజన్సీ తరఫున ఇన్వెస్టిగేటర్ ని" అన్నాడతను.

"మీ కేమి కావాలి?" అడిగింది.

"భారతి కారు ఏక్సిడెంట్ లో చనిపోయింది. ఆమెతో ప్రయాణం చేసినవారు మీరని తెలిసి వచ్చాను."

"చనిపోయింది మాలతి. మీరు పొరబడ్డారు" మాలతి అంది.

అతడు నవ్వాడు. తల అడ్డంగా తాటించేడు_ "పొర బడింది మీరు. మీ హేండ్ బాగ్ నా కంటపడింది. భారతి హాండ్ బాగ్ మాయమయింది. చనిపోయిన సమయానికి భారతి బేగ్ లో అయిదు వేలరూపాయలు, కొన్ని ఉత్తరాలు ఉండాలి. అవి మాయమయ్యాయి" అన్నాడు.

"అయితే నా దగ్గరకు రావటంలో మీ ఉద్దేశ్యం?"

"నాకా ఉత్తరాలు కావాలి. అనుమానం మీ మీదకు రాకుండా వుండాలంటే అయిదు వేల రూపాయలిస్తే చాలు. నా దారిన నేను పోతాను."

"నన్నెవరు అనుమానిస్తారు?"

"చనిపోయిన భారతి రెండు మాసాల గర్భిణి. ఆమెను కారులోతోసి హత్యచేసి అయిదు వేలు కాజేసిన నేరం నీ మీద వస్తుంది. తర్వాత నీ ఇష్టం. రాత్రి పదిగంటలకు నేను వస్తాను. నేను చెప్పినవి రెడీగా ఉంచండి"

అతడు వెళ్ళిపోయేడు. వెళ్తూ తన కార్డు ఇచ్చి వెళ్ళేడు. పేరు నాగభూషణం.

మాలతి అడుగులు భారంగా వేసుకుంటూ బట్టలు కట్టుకుని భోజనం చెయ్యడానికి హోటల్ కి వెళ్ళింది. సరిగ్గా భోజనం చెయ్యలేకపోయింది.

తిరిగి అరగంట తర్వాత ఇంటికి చేరుకుంది. మెల్లెక్కుతూండగా ఎవరో తన పక్కగా తెల్ల దుస్తుల్లో వెళ్ళినట్లు

లీలగా కనిపించింది. మాలతి ఇదేమీ గమనించే స్థితిలో లేదు. మెల్లెక్కి తలుపు తెరిచింది. లోన అంతా అంధకారంగా ఉంది. క్రింద వీధిలో కారు హారన్ మ్రోగింది.

మాలతికి అనుమానం కలుగుతోంది. తాను లైటు ఆర్పి క్రిందికి పోలేదు. మరి తను లేని సమయంలో లైటు ఆర్పి వేసింది ఎవరు?

గదిలో ఎవరో కదిలిన అలికిడి అయింది. ఎవరో ఆమెని తాకుతూ గుమ్మం వైపుకి నడిచేరు.

మాలతి కెవ్వున అరిచి లైట్ వేసేందుకు గోడను వెదికింది. స్విచ్‌కి బదులు బాకుపిడి తగిలింది. గోడకి వేలాడు పిడిబాకుల్లో ఒకటి అది. మాలతి ఆలోచించకుండా బాకుని తీసి ఆగంతకుడివైపు విసిరింది. అతడు ఆహ్ అంటూ మూల్గి మాయమయ్యేడు.

మాలతి మెట్లు దిగి గబగబా వీధిలోకి అడుగుపెట్టింది. ఎవరూ లేరు. నల్లని అంబాసిడర్ కారు సందు మలుపు తిరుగుతోంది. నెంబరు MYR 97.. చివరి రెండు అంకెలు కనిపించలేదు.

మాలతి పోలీసులకు ఫోన్ చేసి గదికి తిరిగి వచ్చింది.

గది అంతటా చిందరవందరగా ఉంది. ఎవరో అప్పుడే హడావిడిగా వెదికేరు. గది గుమ్మంవద్ద రక్తపు చినుకులు ఉన్నాయి. మెట్లమీద రక్తం ధారగా కారింది. మాలతి రక్తధార ననుసరిస్తూ క్రిందికి వచ్చింది. మెట్ల అడుగున నల్లని మూట ఏదో ఉంది. దగ్గరికి వెళ్ళి పరిశీలించింది. అది మూట కాదు నాగభూషణం అతను. గుండెల్లో పిడిబాకు ఉంది. మాలతి వర్షాన్ని లెక్కచేయకుండా రోడ్డునబడి పరుగెత్తసాగింది. మారంగా పోలీస్ వాన్ వస్తున్న సైరన్ వినిపించింది.

# 4

కారు వెనక్కి మళ్ళించి నాంపల్లి వైపు పోనిచ్చేరు ప్రొఫెసర్ వామ్. మాలతి విండోగుండా బయటికి చూస్తోంది. వాన తీవ్రంగా పడుతోంది.

"నాగభూషణం మరణించేడా?"

"లేదు. మూలుగుతున్నాడు. ఇక ఆట్టేసేపు బ్రతకడని భావించి వచ్చేసేను," మాలతి అంది.

ప్రొఫెసర్ మౌనంగా కారు నడిపించసాగేరు.

"హత్య చేసింది నేనే నంటారా? అతన్ని గుండెల్లో పొడిచినట్లు జ్ఞాపకంలేదు. బాకు అతని చేతికి గుచ్చుకుందేమో అనుకున్నాను."

కారు నాంపల్లి చేరింది.

మాలతి ఇల్లుకి దారి చూపించింది. కారు మధ్యదారిలో ఆపి ప్రొఫెసర్ ఎవరికో ఫోన్ చేసేరు. తిరిగి కారు నడిరోహించి ఇంటికి పోనిచ్చేరు. కారు ఇంటిముంగిట ఆగింది.

మాలతి భావించిన విధంగా పోలీసులు లేరు. ఇల్లు నిర్మానుష్యంగా ఉంది. వాన తగ్గుముఖం పట్టింది. తుంపర మినహా మరేమీ లేదు.

మాలతి కారు దిగి మెట్లెక్కింది.

వామ్ కారుని ఒకపక్క నిలిపి ఇంటి ముంగిట వంగి పరిశీలించేరు. కారు టైర గుర్తులు ఉన్నాయి.

గుమ్మంలోకి అడుగుపెడుతూ తలెత్తి చూసేరు. మేడపైన పైప్‌లోనుండి వాన నీరు చుక్కలు చుక్కలుగా పడుతోంది. కర్చీఫ్‌తో ముఖంమీద పడిన నీటి చుక్కల్ని తుడుచుకుని మెట్లెక్కేడు.

మెట్లమీద రక్తపు బొట్లు ఉన్నాయి. మెట్ల దిగువ శవం లేదు.

వామ్ మెట్ల పక్కనే ఉన్న ఇనుప బద్దీ కంటుకుని

ఉన్న దారంపోగుని తీసి కాగితంలో చుట్టి జేబులో వేసు కున్నారు.

మాలతి గుమ్మంముందు కొన్ని అడుగుజాడలు ఉన్నాయి. వాష్ వంగి చూసేరు. గుమ్మం ముందున్న నుసిని రెండు వేర్వేరు కాగితాలలోకి ఎత్తి భద్రపరిచేరు.

"ఇక మనం గదిలోకి వెళ్ళి మాట్లాడుకోవచ్చు. ఇక బయట పరిశీలించేదేమీ లేదు" అన్నారు.

మాలతి స్విచ్ వేసింది. మాలతి చెప్పిన విధంగా గదం తటా సామానులు చెల్లా చెదరుగా ఉన్నాయి. స్విచ్ పక్కనే తోలుపటకా వేలాడుతోంది. తోలు పటకా చెరో పక్కన బాకులు పెట్టుకునే ఒరలు ఉన్నాయి.

"అందులో వుండే బాకునే నేను నాగభూషణంపైన విసి రేను," అంది మాలతి.

"అతను నాగభూషణమే అని నీకెలా తెలుసు?" అడి గాడు ప్రొఫెసర్.

"అతను... నాగభూషణమే అయిఉండాలి... ఉత్తరాల కోసం వస్తానని చెప్పేడు."

"ఆ ఉత్తరాలేవీ?"

మాలతి వంటింటిలోకి వెళ్ళి జాడీలమాటున దాచిన ఉత్త రాల్ని తెచ్చి ప్రొఫెసర్‌కి ఇచ్చింది.

ప్రొఫెసర్ ఉత్తరాలకట్టని జేబులో పెట్టుకుని "ఈ తోలు పటకానికి ఒకటే బాకు ఉండేదా? లేక రెండు ఉన్నాయా?" అన్నారు.

మాలతి ఆలోచించింది.

"ఒకటే ఉందని అనుకుంటున్నాను. ఆ ఒక్కటే నేను ఉపయోగించేను."

వాష్ పటకాని కొక్కెంనుండి తొలగించి చూసేరు.

"ఏ పక్క బాకుని ఉపయోగించావు?"

"కుడిచేతి పక్క ఉన్న ఒరలోనుండి బాకుని తీసేను" చెప్పింది.

"ఎడమచేతి వైపు కూడా బాకు ఉండాలి" అన్నారు వామ్.

"అవును ఉండి ఉండాలి. కాని నేను చూసేసరికి ఒకటే ఉంది."

"అంతకు ముందు ఎన్నడయినా బాకుల్ని చూసేవా?"

"లేదు."

"ఎన్ని రోజులనుండి గదిలో అద్దెకుంటున్నావు?"

"వారం రోజులయింది!"

"వారం రోజులకుముందు రెండవబాకు మాయమయింది అని భావిద్దాము. అయినచో ఎడమచేతి ఒరలో ధూళి ఉండాలి. కాని రెండు ఒరలలో ధూళిలేదు. అంటే అవి కొద్ది నిముషాల తేడాతో తియ్యబడ్డాయి" అన్నారు వామ్.

తిరిగి తోలు పటకాని కొక్కానికి తగిలించేరు.

గదిలో ఒక కుక్కిమంచం, రెండు టేబుల్స్, ఒక పాత బీరువా ఉన్నాయి. ఒక టేబుల్ కిటికీకి దిగువ ఉంది. రెండవ టేబుల్ గదిమధ్యలో ఉంది. రెండవ టేబుల్ మీద ఇస్త్రీ బట్టలు ఉన్నాయి. ఒక తెల్లచీర, ఓ నల్లచీర, నాలుగు జాకెట్లు మాత్రమే ఉన్నాయి.

టేబుల్ క్రింద ట్రంక్ పెట్టె ఖాళీగా పడి ఉంది. పెట్టెలో ఒకమూల అయిదువేల నోట్లకట్ట అలాగే ఉంది.

గదిలో వెచ్చగా ఉంది. ప్రొఫెసర్ కిటికీవద్ద నిలబడి చేతులు టేబుల్ మీద ఆన్చి బయటకు తొంగిచూసేరు. బయటవాన ధారలుగా పడుతోంది. లైట్ల కాంతిలో వాన ధారలు జలతారుతీగల్లా కనబడుతున్నాయి.

"మెట్లు ఎక్కుతుండగా కారు హారన్ వినిపించింది అన్నావు. కారునెంబరు MYR 97... అని చెప్పేవు.

ఆ కారులో వచ్చిన వ్యక్తి గదిలోకి వచ్చేడంటావా?”
అడిగారు వామ్.

మాలతి తలాడించింది.

“ఆకారు ఎవరిదో తెలిసికోనడం ఎలా?” అడిగారు వామ్.

“అవసరంలేదు ప్రొఫెసర్. బాకు విసిరింది నేను. అతను బాధతో అరిచేడు. మెట్లు దిగేసరికి ప్రాణం పోయింది. అంతకు ముందు ఎవరు వచ్చినా హత్య చేయలేదు” అంది.

“నువు పూర్తిగా బాధ్యురాలవి కావని అనడంలేదు. తోలుపటకాకి ఉన్న బాకులు రెండు. ఒకటి నువ్వు ఉపయోగించేవు. రెండవది మరొక వ్యక్తి ఉపయోగించేరు. అయితే ఆ వ్యక్తి ఆడా, మగా అనే విషయం మనకి తెలీదు. ఎవరి బాకు నాగభూషణం హత్యకి కారణం అయింది అనే విషయాన్ని తెలుసుకోవాలి,” అన్నారు వామ్.

“కారు ఎవరిదో తెలుసుకోవడం ఎలా?”

జవాబుగా వామ్ తలాడించి క్రిందికి వెళ్ళేరు. మాలతి కూడా వెళ్ళింది.

వాన పూర్తిగా తగ్గిపోయింది.

చూరు వెంబడి పడుతున్న ధారలు కూడా నిలిచిపోయేయి.

ఆకాశం నిర్మలంగా, నీలంగా ఉంది. చుక్కలు ధగ ధగ మెరుస్తున్నాయి.

ఫోన్ బూత్ లో ఆగి పోలీసులకి ఫోన్ చేసేరు వామ్.

“యస్... బ్లాక్ కలర్ అంబాసిడర్ MYR 97... అని మొదలవుతుంది.... చూడండి ఇన్స్పెక్టర్. MYRతో ఉన్న అంబాసిడర్ లెన్ని... ఇరవై ఉన్నయా... అందులో బ్లాక్ ఎన్ని... ఆరు గుడ్... మనం 97తో మొదలెడితే మొత్తం 99 కార్లు ఉంటాయి... ఇప్పుడు చూడండి. 97తో మొదలయే బ్లాక్ అంబాసిడర్లు ఎన్ని... నాలుగు.

వెరీగుడ్ ... ఇప్పుడు వాటిలో MYR లో ఉన్నవి ఎన్ని...ఒక టేనా...దట్స్ రైట్, దాని గురించి కను క్కోండి...ఓనర్ గురించిన వివరాల్తో నా దగ్గరికి రండి" ఫోన్ దించేరు వామ్.

తిరిగి ఇద్దరూ రూమ్‌కి నడిచేరు.

"మాలతీ. ఒక వేళ నువు తెల్లచీర ధరిస్తే ఏ రంగు జాకెట్ వేసుకునే దానివి."

"తెల్లది."

"కలర్ మాచింగ్ స్కీమ్ ప్రకారం, వాచ్ స్ట్రాప్ కూడా తెల్లదే పెట్టుకుని, చెప్పాలుకూడా వీలయితే తెల్లవే తొడు క్కుంటావు."

అవునన్నట్లు తలూపింది మాలతి.

"చివరికి తల్లో పూలుకూడా తెల్లవి, అంటే మల్లెలో లేక సన్నజాజులో ధరిస్తావు."

"అవును."

వామ్ తృప్తిగా తలూపేరు.

బయట జీపు ఆగింది.

సబ్ ఇన్‌స్పెక్టర్ రంజిత్, మరి యిద్దరు కానిస్టేబుల్స్ వచ్చేరు.

"గుడ్ ఈవెనింగ్ ప్రొఫెసర్. నాగభూషణం హాస్పి టల్లో మరణించేడు. చనిపోతూ తన్ను హత్య చేసినది మా...అన్నాడు."

అతని దృష్టి మాలతి మీదే ఉంది.

ప్రొఫెసర్ మౌనంగా ఉన్నారు.

"కార్ నెంబర్ ద్వారా ఆ కారెవరిదో తెలుసుకున్నాం. అది మాధవ సిన్హాది" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"జస్ట్ ఎ మినిట్. హంతకుడు మాధవసిన్హా ఎందుకు కాకూడదు?"

రంజిత్ నవ్వేడు.

"ఆ సంగతి మాకు తట్టింది. కాని అతనికి పటిష్ఠమయిన ఎలిబీ వుంది. పది నిముషాలు ఎవరిదో ఫోన్ వస్తే క్రిందికి వెళ్లేడు. తిరిగి తన రూమ్‌లోనే కూర్చుని సాయంత్రమంతా పేకాట ఆడేడు" అన్నాడు సబ్ ఇన్‌స్పెక్టర్ రంజిత్.

ప్రొఫెసర్ మౌనంగా కిటికీవద్ద నిలబడి టేబుల్ మీద చేతులాన్చి బయటకు చూడసాగేరు. అతని దృష్టి టేబుల్ మీద ఉన్న న్యూస్ పేపర్ మీద పడింది. యాథాలాపంగా తీసి పేజీలు మళ్ళించేరు. ఒక పేజిలో ఉన్న ఫొటోమీద ఆయన దృష్టి నిలిచింది.

ఆ ఫొటో మాధవ సిన్హాది. ఎయిర్ పోర్ట్‌లో తీసిన ఫొటోలో ప్లేన్ దిగుతుండగా ఉన్న చిత్రం అది.

ఎడమచేతిలో బాగ్. కుడిచేయి పైకిఎత్తి ఫ్రెండ్స్‌ని సమాశ్వాసిస్తుండగా తీయబడిన ఫొటో అది.

"ఇన్‌స్పెక్టర్ మీరు మాధవ సిన్హాకి ఫోన్ చెయ్యండి," అన్నారు ప్రొఫెసర్.

సబ్ ఇన్‌స్పెక్టర్ సందేహించేడు. మాధవసిన్హా ఈ కేస్‌లో ఏ విధంగా ఇరుక్కున్నాడో అతనికి తెలియలేదు.

"ప్రొఫెసర్ మీరు మరో విధంగా భావించకపోతే మీకు ఓ విషయం చెప్తాను. నాగభూషణాన్ని హత్యచేసి పారిపోయిన స్త్రీని ఎదురుగా ముష్టివాడు చూసేడు. తనని చంపినది మా...అన్నాడు హతుడు నాగభూషణం. ఇదిగో ఆ టేబుల్ పైన తెల్లచీర మడిచి వుంది. మాకు ఈ గది గుమ్మంవద్ద నలిగిన మల్లెపూవు కనబడింది. ఇదిగో" అన్నాడు రంజిత్.

"కాని ఆ చీర కాటన్‌ది" అన్నారు ప్రొఫెసర్.

"అయితే."

ప్రొఫెసర్ తన జేబులోని దారపు పోగుని తీసేరు.

సిగార్ లైటర్‌ని వెలిగించి దారపు పోగుని ముట్టించేరు. అది చురచురా కాలింది.

"ఈ పోగు నైలాన్‌ది" అన్నారు వామ్.

"కాని నాగభూషణం వాఙ్మూలం ప్రకారం తనని చంపినది మాలతి. మాధవస్వా చంపితే 'తనని చంపిన వాడు' అనేవాడు వాతుడు."

ప్రొఫెసర్ తలూపేరు.

"నాగభూషణం చెప్పే ధోరణి చూస్తే తన్ని చంపినది అంటే స్త్రీ అనే తోస్తున్నది" అన్నాడు రంజిత్.

"కాని ఆ స్త్రీ తెల్లచీర ధరించినది, అయిఉండాలి. పైగా ఆ చీర నైలాన్‌దే అయుండాలి" హెచ్చరించేరు వామ్.

"అదిగో తెల్లచీర."

"మరి మల్లెపూలు" అన్నారు వామ్.

రంజిత్ నవ్వేడు. "మాలతి ఆ పూలను పారవేసి కనకాంబరాలను పెట్టుకుంది," అన్నాడు.

"చూడు ఇన్‌స్పెక్టర్. ఆ చీర మడతల్ని చూస్తే పెట్టెలోనుండి తీసినట్లు కనిపిస్తోందా? లేక పెట్టెలో పెట్టబోతున్నట్లుందా?"

రంజిత్ ఆలోచించేడు.

"మాలతి ఆ చీరని విడిచి, పెట్టెలో పెట్టబోతున్నాది" అన్నాడు.

ప్రొఫెసర్ చిరునవ్వు చిందించేరు.

కొక్కానికి ఉన్న మరో చీరని రంజిత్‌కి అందించేరు.

"కమాన్ ఇన్‌స్పెక్టర్. ఈ చీరని సరిగ్గా పెట్టెలో ఇమిడే విధంగా మడిచిచూడు. అయితే ఒక షరతు. పెట్టెలో ఉంచి మడచకుండా, ముందు మడచి తర్వాత పెట్టు. చీరమడత పొడవు, వెడల్పు, సరిగ్గా పెట్టెలో ఇమి

దేటట్లు ఉండాలి.''

రంజిత్ చీరని మడిచి పెట్టెలో పెట్టేడు. కాని కొద్దిగా పొడుగయింది. తిరిగి చీరని బయటికి తీసి పెట్టెని పరీక్షించి, తిరిగి చీరని మడిచి పెట్టెలో ఉంచేడు. కాని ఈ సారి మడిచిన చీర పొడవు-వెడల్పులు పెట్టెకంటె చాలా చిన్నవిగా వున్నాయి.

తిరిగి రెండు, మూడు సార్లు ప్రయత్నించేడు కాని లాభంలేక పోయింది.

ఈసారి చీరని పెట్టెలో ఉంచి, అది ఇమిడే విధంగా మడిచి పెట్టెలో వుంచేడు.

''అంటే సరిగ్గామడిచిన చీరను పెట్టెలోనే వదిలేయాలి. అట్టి చీరను బయటికి తీస్తే పెట్టె కొలతలతో సరిపోతుంది'' అడిగేరు వామ్.

తలూపేడు ఇన్‌స్పెక్టర్.

''అంటే ఈ చీరని అప్పుడే పెట్టెలోనుండి తీసేవు. కాని పెట్టెలో వుంచబోతున్నట్లు లేదు. అవునా?''

తిరిగి తలూపేడు ఇన్‌స్పెక్టర్.

మెట్లమీద ఎవరో వస్తున్న శబ్దం అయింది. అందరిదృష్టి అటువైపు తిరిగింది.

''నేను మాధవస్వామిని. మీరు నన్ను పిలిచేరుట. ఎందుకో తెలుసుకుందామని వచ్చేను'' అన్నాడతను.

అతను చాలా పొడుగరి. దాదాపు ప్రొఫెసర్ వామ్ అంత పొడుగు వున్నాడు. నల్లని సూట్, ఈవెనింగ్ కావ్ ధరించేడు. నల్లని బూట్లు తళతళలాడుతున్నాయి.

అతను రూమ్‌లోకి వస్తూ చుట్టూ కలయజూచేడు. ప్రొఫెసర్ వద్దకి నడిచి షేక్‌హేండ్ చేసేడు. కాని ఎడమచేయిని ఉపయోగించి షేక్‌హేండ్ చేసేడు.

ప్రొఫెసర్ దృష్టి కుడిచేయిమీద పోయింది.

"సారీ. కుడిచేయి బెణికింది. నాలుగు రోజుల్నుండి సలుపుతోంది" అన్నాడు మాధవసిన్హా చిరునవ్వుతో.

ప్రొఫెసర్ తిరిగి టేబుల్ మీద చేతులాన్చి కిటికీలో నుండి తొంగి చూసేరు. చూరునుండి కారుతున్న నీటిధార ఆగిపోయింది.

చేతికి టేబుల్ చల్లగా తగిలింది. ఆయన టేబుల్ని చూసేరు. ఆయన దృష్టి టేబుల్ మీద పరుగుతీసింది.

టేబుల్ పైనవస్తువులన్నీ యథాప్రకారంగా నేవున్నాయి. న్యూస్ పేపర్ అలాగే వుంది. ఆయన చటుక్కున పేపర్ తిరగేసి చూచేరు. తిరిగి అందులోవున్న ఫొటోమీద దృష్టి కేంద్రీకరించిపోయింది.

"అవును ఆ ఫోటో నాదే" అన్నాడు మాధవసిన్హా.

"కాని అప్పుడు కుడిచేతికి జెణుకు లేదు" అన్నారు వాఘ్ చిరునవ్వుతో..

మాధవసిన్హా ముఖం వెలవెలపోయింది. కోటుజేబులో నుండి రుమాలుతీసి ముఖం తుడుచుకున్నాడు.

"ఎగ్జాక్ట్లీ. ఆ రుమాలుని టేబుల్ పైనుండి సంగ్రహించేరు. అందుకే రెండవసారి టేబుల్ మీద చేతులుంచిన నాకు టేబుల్ చల్లగా తగిలింది. అంతకుముందు ఉండవలసిన రుమాలు మాయమయింది."

మాధవసిన్హా రుమాలుని జేబులో వుంచుకున్నాడు.

"ఇంతకుముందు మీరు ఈ రూమ్కి వచ్చేరు. అప్పుడు ఈ రుమాలుని మరిచిపోయేరు కాబోలు."

మాధవసిన్హా తలాడించేడు.

తలపైన వున్న ఈవెనింగ్ కాప్ తీసి టేబుల్ పైన వుంచేడు.

ప్రొఫెసర్ తన కాప్తో దాన్ని పోల్చి చూచేరు.

రెండింటి పైన నల్లని మరకలు వున్నాయి.

"మీరు పైనుండి వానబొట్లు పడ్డాయి" అన్నారు వామ్ కాప్ని క్రేలితో రాస్తూ.

దీనితో మాధవసిన్హా ఆ రూమ్కి వచ్చేడన్న సంగతి ధ్రువ పడింది.

'కాని ఎందుకు వచ్చేడు?'

ప్రొఫెసర్ క్షణకాలం ఆలోచించేరు. కోట్ జేబులో వున్న వుత్తరాల కట్టని పైకితీసి, "బహుశా దీని కోసం కాబోలు" అన్నారు.

మాధవసిన్హా ఆత్రుతగా ఆ కట్టని అందుకున్నాడు.

"ఆనంద్ సిన్హా మీ కుమారుడా?" అడిగారు వామ్.

అతను తలూపేడు.

"నాగభూషణం మీకు ఈ వుత్తరాల విషయమై ఫోన్ చేసేడా?" అడిగారు ప్రొఫెసర్.

"ఫోన్ చేయడమే కాదు. ఆనంద్ వ్రాసిన ఉత్తరాలు తనవద్ద వున్నాయని, భారతి చనిపోయే సమయానికి గర్భవతి అని, లక్షరూపాయలివ్వని పక్షంలో ఆ ఉత్తరాలు పేపరుకి ఎక్కుతాయని బెదిరించేడు" అన్నాడు మాధవ సిన్హా.

"అయితే మీరు పేకాట ఆపి ఆ పదినిమిషాల్లో ఇక్కడికి వచ్చేరు."

తలూపేడు మాధవసిన్హా.

"మీతో వచ్చిన మరొకవ్యక్తి ఎవరు?"

"నేనొక్కడిన్నీ మాత్రమే వచ్చేను. నాగభూషణం గదిలో వున్నాడు."

ప్రొఫెసర్ తల అడ్డంగా ఆడించేరు.

"మీతోపాటు మరొకవ్యక్తి వచ్చేరు.ఆ వ్యక్తి ఎవరు?"

# 5

"అతని తర్వాత వచ్చినది నేను ప్రొఫెసర్."

అందరికళ్లూ అటువైపు తిరిగేయి.

గుమ్మం వద్ద ఒక అందమయిన యువకుడు వున్నాడు.

మాలతి ఆనందంగా "శ్రీనివాస్" అంటూ అరిచింది.

కాని మరుక్షణంలో ఆమె ముఖచంద్రమండలం మేఘావృతమయింది. కారణం శ్రీనివాస్ పచ్చిదొంగ. తనను మోసగించేడు.

"ప్రొఫెసర్ ముందు ఇతన్ని బంధించండి. ఇతనివల్లనే నేను ఇంత దూరం వచ్చి హత్యలో ఇరుక్కున్నాను" అంది మాలతి.

శ్రీనివాస్ మాట్లాడలేదు.

ప్రొఫెసర్ చిరునవ్వు నవ్వి, "ముందు హంతకులెవరో తేలిం తర్వాత అలాగే బంధిస్తాను," అన్నారు.

"మనం కేస్‌నంతటిని పరిశీలిద్దాం. నాగభూషణం ముందు మాలతిని కలిసేడు. ఆమెవద్ద ఉత్తరాల ద్వారా మాధవసిన్హాని బ్లాక్ మెయిల్ చేయజూచేడు. మాధవసిన్హా వచ్చే సమయానికి మాలతి హోటల్‌కి వెళ్ళింది.

"మాధవసిన్హా వచ్చేటప్పుడు వర్షం చూరునుంచి కారుతోంది. అతని హేట్ మీద పడి మరక అయింది. అతను టేబిల్ మీద రుమాలు మరిచి వెళ్ళిపోయేడు. అంతకు కొద్ది సేపటి తర్వాత నాగభూషణం హత్య జరిగింది. రెండు బాకులూ కొద్ది నిముషాల తేడాతో ఉపయోగింపబడ్డాయి. ఒక బాకు మాత్రమే దొరికింది. రెండవది ఏమయింది?

"అనుమానితులు ఇద్దరు. ఒకరు మాలతి. ఆమె బాకును ఉపయోగించింది. హతుడు చనిపోతూ తన్ను చంపినది మా... అన్నాడు. కాని మా... అంటే మాధవసిన్హా కూడా అవుతుంది."

అందరూ మౌనంగా ప్రొఫెసర్ లాజిక్‌ని వింటున్నారు.

"మాధవసిన్హా చేతికి బెణుకు లేదు. కాని అతను చేయి కదల్చలేక పోతున్నాడు," అన్నారు వామ్.

మాధవసిన్హా ముఖం చెమటలతో నిండింది.

"భయపడకండి. మీరే హంతకులని నే ననడం లేదు," అన్నారు వామ్.

మాధవసిన్హా నిట్టూర్పు విడిచేడు.

"హత్య చేసినది స్త్రీ, అని అనుమానం. కారణం తెల్ల చీర దొరికింది. మాలతి గదిలో తెల్ల చీర దొరికింది. పైగా బాకు విసిరింది మాలతి. హతుడు మరణిస్తూ తనని చంపినది మా... అని ఆగేడు."

ఈ సారి మాలతి ముఖంలో భయం ప్రస్ఫుటంగా కన బడింది.

ప్రొఫెసర్ ఇక కేస్‌ని వివరించడం ఆపి మాలతి, మాధవ సిన్హాల ముఖాల కేసి చూసేరు.

ఈ సారి ఇద్దరి ముఖాలు వెలవెలబోయేయి.

తిరిగి ప్రొఫెసర్ తన ధోరణి కొనసాగించేరు.

"మాలతి బాకు విసరడం ఖాయం. అయితే అది నాగ భూషణానికి తగిలిందా? లేక..." ప్రొఫెసర్ ఆగి మాధవ సిన్హా కుడిచేతిని నొక్కేరు.

మాధవసిన్హా బాధతో ఆహ్... అని మూలుగేడు.

మాలతి ముఖం విప్పారింది.

"అతడే... మూలిగేడు" అంది.

"కరెక్ట్. అంటే మాలతి విసిరిన బాకు మాధవసిన్హాకి తగిలింది. మరి నాగభూషణం ఎవరిచేతిలో చనిపోయేడు. అతన్ని చంపినవారు స్త్రీ అని, తెల్ల చీర ధరించినదని,

మల్లెపూలు పెట్టుకొన్నదని, పేరు మా...తో ప్రారంభ మవుతుందని తెలుస్తోంది?"

"ఇంతకీ మాధవసిన్హాగారు క్లబ్ లో ఉన్నట్లు నాగభూషణానికి ఎలా తెలిసింది. ఎవరు ఫోన్ చేసేరు? చేసినది ఆడా? లేక మగా? ఫోన్ చేసిన వ్యక్తి ఈ రూమ్ కి వచ్చి ఉండాలి. అయితే ఆ వ్యక్తికి నాగభూషణాన్ని హత్యచేసే ఆస్కారం ఉంది. ఎవరా తెల్ల చీర ధరించిన స్త్రీ?" అడిగేరు వామ్.

"నేను ప్రొఫెసర్, మాధవిని. అతనొక బ్లాక్ మెయిలర్. నా జీవితంతో చెలగాట మాడేడు. ఆ బ్లాక్ మెయిలర్ ని కత్తితో బెదిరించబోయేను. కాని మరణించేడు" అందా యువతి.

అందరి దృష్టి క్రొత్తగా అడుగుపెట్టిన యువతి పైకి తిరిగింది.

ఆమె తెల్లచీరలో ఉంది. ఆమె మాధవసిన్హా కుమార్తె మాధవి.

మాలతి హాయిగా నిట్టూర్పు విడిచింది. ఆమె దృష్టి శ్రీనివాస్ పైన పడింది.

"ప్రొఫెసర్ ఇతడ్ని అరెస్టు చెయ్యండి," అంది మాలతి.

ఈసారి ప్రొఫెసర్, శ్రీనివాస్ ఇరువురూ నవ్వేరు.

"అతను బెంగుళూరు క్రైం బ్రాంచ్ లో బెస్ట్ బోయ్. ఇన్ స్పెక్టర్ శ్రీనివాస్," అన్నారు వామ్.

మాలతి తన చెవుల్ని తానే నమ్మలేక పోయింది. అందరూ ఒకరి తర్వాత ఒకరు నిష్క్రమించేరు.

శ్రీనివాస్, మాలతులు ఇద్దరే మిగిలేరు. మాలతి సందేహంగా అడిగింది.

"ఆ పదివేలు..."

"ఆ కేడీని పట్టుకున్నాను. నెల రోజులుగా కేష్‌లో షార్టేజ్ వస్తోంటే నిఘా వేశాను. చివరకి దొరికేడు," అన్నాడు శ్రీనివాస్.

"మరి ఆ రోజు... గార్డెన్ దగ్గర కేడీ మిమ్మల్ని చూసి ఎందుకు నవ్వేడు?"

ఫకాలున నవ్వేడు శ్రీనివాస్.

"ఎందుకంటే వాడు నా జైల్లోంచి వచ్చేడు. ఆ రోజు నే నాడిన నాటకంలో సహాయం చేసేడు," అన్నాడు శ్రీనివాస్.

—: అయిపోయింది :—

# గాంబ్లింగ్!

మిస్. మధుబాల

"స్త్రీ వస్తువు ఒకటి కావాలి. ఇస్తావా?" 'భారత్' దిన పత్రిక రిపోర్టర్ విమల్, 'బ్లాస్ట్' దినపత్రిక రిపోర్టర్ నిర్మల్ కుమార్ని అడిగాడు.

"ఏమిటది?"

"ఇస్తావా?" విమల్ రెట్టించి అడిగాడు.

"నా మోటర్ సైకిల్ 'హోండా' తప్పించి ఏ దడిగినా ఇస్తాను."

"అయితే నీ వద్దనున్న మినీ కెమెరా ఒకసారి ఇవ్వు."

"ఏది...?"

"కోట్ కాలర్లో ఫిక్స్ చేసి చూపించావు ఒకసారి... అది..."

"ఓహ్! అదా...ఎందుకు?"

"అవసరం వుంది. వివరాలు తరువాత చెబుతాను."

"తీసుకెళ్లు. ఎప్పుడు కావాలి?"

"ఇప్పుడే యివ్వు."

"సరే!" అంటూ నిర్మల్ కుమార్ అల్మైరా తెరిచి చిన్న సైజు లైటర్‌లావుండే కెమెరా తీశాడు. దానికి ఒక పొడు గాటి, సన్నని దారం చుట్టివుంది. "దీనిని కోట్ కాలర్‌కి బిగించమంటావా?"

"అవును, అదే మంచిది" విమల్ నిర్మల్ కుమార్ కెదురుగా నిలబడుతూ అన్నాడు. నిర్మల్ కుమార్ దానిని ఒక క్లిప్ సహాయంతో విమల్ కోట్ కాలర్ వెనుక బిగించాడు. కాలర్ కున్న బటన్ హోల్ నుండి అతి చిన్నదయిన కెమెరా లెన్స్ తొంగిచూస్తోంది.

"ఈ దారం ఎందుకు?" విమల్ అడిగాడు.

"ఇది షటర్‌లా పనిచేస్తుంది" నిర్మల్ కుమార్ చెప్పసాగాడు. "దీనిని లాగావంటే కెమెరా లెన్స్ తెరుచుకుని ఫోటో దిగుతుంది. దీని ఒక కొసని నీవు కోటుజేబులో దాచుకోవచ్చు."

"వెరీగుడ్" విమల్ సంతృప్తిగా అన్నాడు.

"ఒక విషయం గుర్తుంచుకో! దీనితో రెండు మూడు స్నాప్స్‌కంటే ఎక్కువ తీయలేం. మళ్ళీ తీయాలంటే మరో కొత్త ప్లేట్ వేయాల్సివుంటుంది."

"రెండు ఫోటోలు తీస్తే చాలు నా అవసరం తీరిపోతుంది."

"విశేష మేమిటో చెప్పలేదు."

"ఇప్పుడేమీ అడగకగురూజీ! ప్రొఫెషనల్ సీక్రెట్."

"నీ పేపర్‌కి ఏదో పెద్ద మాటర్ సంపాదిస్తున్నట్లున్నావు...?"

"అవును; ఆ విషయం తలచుకుంటేనే నా గుండెలు వేగంగా కొట్టుకుంటున్నాయి. ఒక్కటి గుర్తుంచుకో డియర్ కప్పలుగా పోసివున్న మందుగుండు సామాగ్రిలో నిప్పురవ్వని విసురబోతున్నాను. దాంతో నగరంలోని మూల స్తంభాలు కొన్ని అలా అట్టముక్కల్లా గాల్లోకి లేచిపోతారు. ఎందరో శ్రీకృష్ణజన్మస్థానంలో అగుపిస్తారు."

"ఈజిట్!?" విస్మయంగా అడిగాడు నిర్మల్ కుమార్.

"యస్."

"నీవు చెబుతున్నది నిజమేనా?"

"నిజం."

"నా వుత్సుకత పెరిగిపోతూంది. ఆగలేకపోతున్నాను."

"ఇంకా కొద్దిరోజులు..అంతే" విమల్ అభినయిస్తున్నట్లుగా అన్నాడు. "నేను మన నగరంలో జరుగుతున్న ఒక స్కాండల్ విషయంలో ముసుగు తొలగించబోతున్నాను. దాంతో చూసేవాళ్ళకళ్ళు విస్ఫారితమయి వెళ్ళుకవస్తాయి. ఈ కెమెరా సహాయంతో చాలా పెద్ద సాక్ష్యాన్ని సంపాదించబోతున్నాను. ఆ తరువాత జరిగే విస్ఫోటంతో, ఆ శబ్దానికి చెవులు చిల్లులుపడటంతోపాటు, ఆ మెరపుకి కళ్లు చీకట్లు కమ్ముకుంటాయి."

"మై... మై... వ్వాట్ ఆర్ యూ గోయింగ్ టు డూ?"

"సారీ! ఇప్పుడేమీ చెప్పను. ఇంతవరకు మా ఎడిటర్ కి కూడా చెప్పలేదు. ఈ విషయమై ఒక నెలరోజులుగా శ్రమపడుతున్నాను. ఫలితందక్కే సూచనలుకూడా వున్నాయి."

"అబ్బ! సస్పెన్స్ తో చంపుతున్నావు" నిర్మల్ కుమార్ ఉండబట్టలేక అన్నాడు. "ఏ విషయం ప్రయత్నం చేస్తున్నావో కనీసం సంకేతమయినా ఇవ్వు."

"అయామ్ సారీ నిర్మల్! నేను సంపాదిస్తున్న మాటర్ ని మరో దినపత్రిక రిపోర్టర్ కి ఎలా ఇవ్వమంటావు చెప్పు?"

"ఓ.కే. చెప్పవద్దు. కాని ఒక విషయం అనుభవంపై చెబుతున్నాను విను."

"ఏమిటది?"

"నీ మాటలనుబట్టి చూస్తే నాకు శకునం అంతమంచిదిగా కనిపించడంలేదు. నువ్వు చెప్పేదే నిజమయి పాలకవర్గమూ, మూల స్తంభాలు అయినవాళ్ళు జైలుకీవెళ్ళే విధంగా నీవు రుజువులు సంపాదించివుంటే, ఆ రుజువులతోపాటే అపాయాలుకూడా నిన్ను తరుముకొస్తున్నాయని మరచిపోక. ఏదో ఒకరోజు నీ శవం ఏ మురికికాలువలోనో తేలియాడుతూ కనిపించవచ్చు."

"ఏమీ అవదు. నా గురించి ఏమీ తెలియదు. ఆ విస్ఫోటం తర్వాతే నన్ను గురించి అందరికి తెలుస్తుంది. అప్పుడు నేను చచ్చినా బ్రతికినా వాళ్ళ ముఖాలపై అలుముకున్న పుసి బొగ్గుని కడుక్కోలేరు."

"నీవు అనుకున్నదానికంటే ఎక్కువ ఆత్మవిశ్వాసాన్ని ప్రదర్శిస్తున్నావు" నిర్మల్‌కుమార్ విచారనిమగ్నుడయి అన్నాడు.

"అవును; అనుకున్నదానికంటే ఎక్కువ జాగ్రత్తగా కూడా వున్నాను."

"ఓ.కే..."నిర్మల్ అన్నాడు, "నీ మంచి చెడులునాకు బాగా తెలుసు. ఎప్పుడయినా నా అవసరముంటే చెప్పడం మరచిపోక..."

## 2

సరిగ్గా పది గంటలకంతా విమల్ 'కాస్మోపాలిటన్ నైట్‌క్లబ్'లోకి ప్రవేశించి, తన్ను గాంబ్లింగ్ హౌస్‌లోకి తీసుకెళ్తానన్న వినాయక్‌రావు రాక గురించి ఎదురుచూడ సాగాడు. మరో పది నిముషాల తరువాత వినాయకరావు

వచ్చి విమల్‌ని కలిశాడు.

"పోదామా?" వినాయకరావు అన్నాడు.

"తొందరేముంది. మొదట బార్‌లోకి వెళ్ళి ఒక్కో పెగ్గు వేసుకుని పోదాం," వినాయకరావుకున్న తాగుడు బలహీనతను కనిపెట్టి అన్నాడు విమల్.

విమల్ ఒక పెగ్గు పూర్తి చేసేలోపల వినాయకరావు నాలుగు లార్జ్ పెగులు పూర్తి చేశాడు. ఆ తరువాత ఇద్దరూ బయటకు వచ్చి క్లబ్ వెనుక వైపున్న కారిడార్ వైపు సాగారు. కారిడార్‌లో వున్న ఒక గదిలోకి తీసుకెళ్ళాడు వినాయకరావు.

"ఒకనిముషం ఆగు. నేను క్లాక్‌రూంలోకి వెళ్ళివస్తాను" అంటూ వినాయకరావు విమల్‌ని అక్కడ ఆపి ఆ గదిలో మరో మూలవున్న తలుపు తెరుచుకుని లోపలకు వెళ్ళి రెండు నిముషాల తరువాత తిరిగి వచ్చాడు. ఆ తరువాత ఇద్దరూ చెరో సిగరెట్ వెలిగించారు.

"ఇక్కడ నిలబడి మనమేంచేస్తున్నట్లు..క్లబ్‌కి పద..." వినాయకరావు ఎంతకీ కదలకపోవడంతో అడిగాడు విమల్.

"మనమిప్పుడు వెళుతున్నది క్లబ్‌కే!"

"ఇక్కడ నిలబడే వెళుతున్నామా?" ఆశ్చర్యంగా అడిగాడు విమల్.

"అవును" అని వినాయకరావు అంటుండగానే వారి ఎదురుగావున్న గోడ పూర్తిగా ఒకవైపుకి తొలగిపోయింది. ఎదురుగా నాల్గడుగుల వెడల్పున, పొడవుగా వున్న మరో కారిడార్ అగుపించింది.

"కమాన్!" వినాయకరావు అతని చేయి పట్టుకుని లాగుతూ అన్నాడు.

విమల్ మంత్రముగ్ధుడిలా అతని వెంట నడుస్తూ అడిగాడు "గురూజీ! ఏమిటీ గందరగోళం?" గురూజీ అనేది విమల్‌కి

ఊరకపదం...

"ఇదా! ఓపెన్ సెసెమ్ సారంగం" నవ్వుతూ అన్నాడు వినాయకరావు.

విమల్ మళ్ళీ మాట్లాడలేదు.

వినాయకరావు అతణ్ని కారిడార్‌కి రెండవ వైపు లాక్కెళ్ళాడు.

రెండవ వైపున్న ఒక తలుపు తెరవగానే ఒక లిఫ్ట్ అగుపించింది. వినాయకరావు లిఫ్ట్ తలుపు తెరిచాడు. ఇద్దరూ లోపలకు ప్రవేశించగానే అతను ఒక బటన్ నొక్కాడు. లిఫ్ట్ తలుపు తనంతట తాను మూసుకుంది.

ఆ వెంటనే లిఫ్ట్ పైకి లేస్తున్నట్లు అనుభూతి పొందాడు విమల్. కొన్ని క్షణాల తరువాత లిఫ్టు ఒక క్షణం ఆగింది. ఆ తరువాత లిఫ్టు పైకి లేవడానికి మారుగా పక్కలకి ముందుకి పోతున్నట్టనిపించింది. కొంచెం సేపటి తరువాత లిఫ్టు పైకి లేచింది మళ్ళీ.

విమల్ అంతా జాగ్రత్తగా గమనిస్తూ నిలబడ్డాడు. లిఫ్టు ఆగడంతోనే తలుపులు ఆటోమెటిక్‌గా తెరుచుకున్నాయి. ఇరువురూ అందులోంచి బయటకు వచ్చారు.

ఎదుట మళ్ళీ ఒక పొడుగాటి కారిడార్ వుంది. కారిడార్‌కి అవతలవున్న తలుపు తెరుచుకుని లోపలకు ప్రవేశించారు. గదిలో కుడి వైపుకి ఒక గది వుంది. తలుపులు మూసి వున్నాయి. తలుపులపై "అపాయం లోపలకు రాకూడదు" అని వుంది.

ఎదురుగా మరో ద్వారం వుంది. ద్వారం ఇవతల ఎత్తుగా, బలంగావున్న ఇద్దరు వ్యక్తులు సిగరెట్ పీలుస్తూ కాపలా కాస్తున్నారు. వాళ్ళు గుండాలని ముఖం చూస్తేనే తెలుస్తుంది.

వినాయకరావ్ విమల్‌తో సహా ఆ ద్వారం వద్దకు వెళ్ళి

హాండిల్ పై చేయి వేస్తుండగానే .. "ఏయ్ మిస్టర్...
ఆగు...!" అన్నాడొకడు.

వినాయకరావు, విమల్ లు తక్కున ఆగారు. వినాయక రావు వారివైపు తిరిగి "నన్నాగమన్నారా...?" తీక్షణంగా అడిగాడు.

"మిమ్మల్ని కాదు, మీ వెంటవున్న వ్యక్తిని..." ఆ ఇద్దరిలో ఒకతను అన్నాడు.

"ఇతను నా వెంట వున్నాడు" వినాయకరావు గద్దిస్తూ అన్నాడు. "నేను శక్తిసింగ్ కి ఇతని విషయం చెప్పాను."

"ఆయన మీకు అనుమతిచ్చారా?"

"యస్. అతని అనుమతి తర్వాతే నేనితణ్ని లోపలకు తీసికెళుతున్నాను... ఏం మీకు నా విషయం తెలియదా?"

వినాయకరావు అలా తీక్షణంగా గద్దించడం వారిపై మంచి ప్రభావాన్ని చూపింది. ఆ ఇద్దరిలో ఒకతను మృదువుగా... "కోప్పడకండి సార్... జాగ్రత్త పడటం మా డ్యూటీకదా! శక్తిసింగ్ గారికి అభ్యంతరం లేకుంటే మాకేం అభ్యంతరం..."

"పద!" అంటూ వినాయకరావు తలుపు తెరుచుకుని విమల్ తో సహా లోపలకు ప్రవేశించాడు. స్వింగ్ డోర్స్ వాటంతట అవే మూసుకున్నాయి.

విమల్ తృప్తిగా నిట్టూర్చాడు.

అదొక విశాలమయిన హాలు. హాలంతా ఫ్లోరాసెంట్ ట్యూబుల వెలుగుతో మిలమిల లాడుతోంది. మొసాయిక్ పరిచిన నేల.

హాలులో సుమారు అరవయి, డెభయిమంది వరకు స్త్రీ పురుషులు కలసివున్నారు. లోపలి వాతావరణంలో సిగరెట్, బ్రాందీ, విస్కీ వాసనలతో పాటు ఒక విధమయిన ఉద్రిక్తత కూడా అలుముకుని వుంది.

గోడల అంచుల వెంట హాలు చుట్టూరా చిన్న చిన్న బల్లలున్నాయి. ప్రతి బల్లచుట్టు అయిదారు మంది కూర్చుని వున్నారు. ప్రతి ఒక్కరి ముందు అయిగు, పది, వంద రూపాయల నోట్లు కుప్పలుగా పడివున్నాయి. కొందరు రమ్మీ ఆడుతుంటే కొందరు ఫ్లష్ ఆడుతున్నారు.

హాలుకి ఒకవైపు బార్ కౌంటర్ వుంది. పొడవయిన కౌంటర్ బల్లకెదురుగా రివాల్వింగ్ స్టూల్స్ వున్నాయి. కాని అక్కడ ఎవరూ లేరు. కొందరు యూనిఫాంలో వున్న వెయిటర్లు ఆడుతున్న వాళ్ళకి కావలసిన డ్రింక్స్ సర్వ్ చేస్తున్నారు."

హాలుకి మధ్యగా విశాలమయిన రౌలెట్ టేబుల్ వుంది. ఎందరో స్త్రీ పురుషులు ఆ టేబుల్ చుట్టు గుంపులుగా నిలబడి వున్నారు.

"ఇక్కడ చాలా పెద్ద ఎత్తున జూదం నడుస్తుంది..." వినాయకరావు, విమల్ చెవిలో గొణిగాడు. "ఒక రౌండ్‌లో ముప్ఫయి, నలభయివేల రూపాయలు వెనుక ముందు అయిపోతాయి."

"అబ్బా!" విచిత్రంగా అన్నాడు విమల్.

"ఏం కంగారు పడ్డావా?"

"అబ్బే లేదు..."

"నీ కెందులో ఇంటరెస్టుంది?"

"నేనిక్కడే రౌలెట్ టేబిల్ వద్ద ఆడతాను."

"ఓకే... నీవిక్కడే వుండు. ఫ్లష్ ఆడడానికి వెళ్తున్నాను."

"రైట్...!"

వినాయకరావు ముందుకు అడుగు వేయబోతుండగా విమల్ అడిగాడు. "ఒక విషయం చెప్పిపో గురూజీ!"

"ఏమిటి?"

"బయట నీవు ఎవరో శక్తిసింగ్ పేరెత్తావు. ఎవరతను?"

"ఈ నైట్ క్లబ్‌కి మేనేజర్ అతను."

"నిజంగా నీవతనికి నా గురించి చెప్పావా?

వినాయకరావు ఒకక్షణం సందేహించి లేదన్నట్లుగా తల వూపాడు.

"కొంపదీసి... ఏమయినా గందరగోళం కాదుకదా?" విమల్ భయపడుతున్నట్లుగా అన్నాడు.

"యూ డోంట్ వర్రీ మైడియర్ సన్ ... అంత భయంగా వుంటే ఒక పెగ్గు వేసుకో" అంటూ వినాయకరావు వెళ్ళిపోయాడు.

విమల్ రౌలెట్ టేబుల్ వద్దకు చేరుకుని, నెమ్మదిగా మనుష్యులని తోసుకుని అంచులకి ఆనుకుని నిలబడ్డాడు. రౌలెట్ టేబుల్ ... దాని చుట్టు వున్న వాళ్ళంతా విమల్ దృష్టిలో పడ్డారు. విమల్ మెల్లగా చేతిని పాంటు జేబులోకి పోనిచ్చాడు. అతను వూపిరి పీల్చకుండా స్థిరంగా నిలబడ్డాడు. నెమ్మదిగా పటర్‌లా పనిచేసే దారాన్ని లాగాడు.

అంతలోనే గందరగోళం జరిగిపోయింది. విమల్ అత్యంత జాగరూకుడయి వుండటం ఎవరికో అనుమానం కలిగించింది. ఎన్నడూ కనిపించని విమల్ కొత్తముఖం అక్కడి వారిలో అనుమానం కలిగించింది. అతను జేబులోంచి చేయితీయక ముందే రెండు ఇనుప హస్తాలు అతణ్ని దృఢంగా పట్టి బంధించాయి.

విమల్ వెనక్కి తిరిగి చూశాడు.అతని కిరుప్రక్కలా బలశాలులయిన ఇద్దరు వ్యక్తులు నిలబడి వున్నారు. వారి ముఖాల్లోంచి క్రూరత్వం తొంగి చూస్తోంది.

ఆ ఇరువురూ విమల్‌ని దూరంగా లాగేప్రయత్నం చేస్తున్నారు. విమల్ కదల్లేదు. అతని వ్యాకులదృష్టి హాలు నలువైపులా పరుగెత్తింది. కాని అతని కెక్కడా వినాయకరావు

కనిపించలేదు.

ఆ ఇరువురు మరింత దృఢంగా అతణ్ని బంధించి..."ఊ! అల్లరి చేయకుండా బయలేరు... లేకుంటే..." గద్దించారు.

ద్వారం వద్దకు వెళ్ళిన విమల్ ఒకసారి మళ్ళీ హాలంతా కలియ చూశాడు. దూరంగా ఒకమూల అతనికి వినాయక రావు కనిపించాడు. హాలులోవున్న కోలాహలంలో తను గొంతెత్తి అరిచినా తన అరుపు అతని వద్దకు చేరదు.

"ఊc! పద...!" ఒకతను గద్దించాడు.

ఆ ముగ్గురూ బయటకు వచ్చారు. బయట ద్వారంవద్ద ముందున్న కాపలా వాళ్లున్నారు. వాళ్లు విమల్‌ని చూసి గుసగుసలాడుకోసాగారు.విమల్ వెంటవున్న ఇద్దరూ అతణ్ని ఆ గది బయటకు తెచ్చారు.

"నన్నెక్కడికి తీసికెళుతున్నారు?" విమల్ అడిగాడు.

"మాట్లాడకుండా నడుస్తూండు. తరువాత అంతా తెలుస్తుంది..." ఒకతను కర్కశ స్వరంతో అన్నాడు.

అలా మూడునాలుగు కారిడార్‌లు నడిచిన తరువాత విమల్‌ని ఒకతలుపు ముందు ఆపారు. ఆ ఇరువురిలో ఒకతను తలుపు తట్టాడు. ఒకక్షణం తర్వాత వాళ్లు విమల్‌ని గదిలోకి తీసుకెళ్ళారు. గదిలో విశాలమయిన మెహాగనీ టేబుల్ వెనుక బుల్‌డాగ్‌లావున్న వ్యక్తి ఠీవిగా కూర్చుని వున్నాడు. అతని కళ్లు చింత నిప్పుల్లా వున్నాయి... "నా పేరు శక్తి సింగ్... ఈ క్లబ్‌కి మా నేజర్ని..." అతను కుప్కస్వరంతో అన్నాడు.

"హల్లో!" విమల్ అన్నాడు. "నా పేరు విమల్..."

"ఇక్కడికి నీవెలా వచ్చావు?"

"నాకు జూదం ఆడటం సరదా... ఆడాలని వచ్చాను."

"నీ సరదా అడగలేదు. నీ విక్కడికి ఎలా వచ్చావని అడుగుతున్నాను."

"నేను వినాయకరావు వెంట వచ్చాను."

"వినాయక్..." శక్తిసింగ్ నుదురు చిట్లించి అన్నాడు. "నీవు వినాయకరావుని ఎరుగుదువా?"

"బాగా తెలుసు. మేమిద్దరం చిన్నప్పటి నుండి స్నేహితులం..."

"క్రొత్తవాళ్ళు ఇక్కడికి రావడం మా కిష్టముండదు." అతనన్నాడు, "మేము ఎలాంటి రిస్క్ తీసుకోవడం ఇష్టముండదు..."

"రిస్క్... ఎలాంటి రిస్క్?"

"మిస్టర్ —"శక్తిసింగ్ అన్నాడు... "నీవు తెలివయినవాడివి. మేం చేస్తున్న ఈ గాంబ్లింగ్ బిజినెస్ విషయం... మా ప్రతికూలురకి తెలిసిందంటే... మేమెంతటి అపాయంలో ఇరుక్కుంటామో నీకు తెలుసు..."

విమల్ ఏమీ మాట్లాడలేదు.

"నీ వింతకుముందు ఎప్పుడయినా ఇక్కడికి వచ్చావా?"

"ఇక్కడి గాంబ్లింగ్ క్లబ్‌లోకి రాలేదు. కాని, బయట వున్న ఎంటర్‌టేన్‌మెంట్ క్లబ్‌లోకి చాలాసార్లు వచ్చాను. మీ డాన్సర్ ఎంజిలాని అడగండి..."

శక్తిసింగ్ కొద్దిసేపు మౌనంగా వుండి చెప్పసాగాడు... "మిస్టర్ విమల్! ఈ మా గాంబ్లింగ్ హౌస్‌లోకి వచ్చే వాళ్ళ విషయంలో మేము చాలా జాగరూకతతో వుంటాం. అయినా అప్పుడప్పుడు ఈ వినాయకరావులాంటి వాళ్ళు ఏదో ఒక ట్రబుల్ తెస్తూంటారు. నీవు జూద గృహంలోకి వచ్చినందుకి నాకు బాధలేదు. కాని వినాయకరావు ముందు నిన్ను నా వద్దకు తెచ్చివుంటే బాగుండేది. ఎవరయినా స్పెషల్ మెంబర్స్ లోపలకు వచ్చారంటే మాకు చాలా భయంగా వుంటుంది."

"స్పెషల్ మెంబర్స్ అంటే...?"

"వృత్తిరీత్యా అపరాధులయిన వాళ్ళు...చాలా తక్కువ డబ్బు సంపాదించేవాళ్ళు. పోలీసులు, రిపోర్టర్ లాంటి వాళ్లు లోపలకి రావడం మా కిష్టముండదు."

"కాని, నేను మీరు చెప్పినవాటిలో వేటికీ సంబంధించిన వాణ్ని కాను..."

"కాకపోవడం నీ వంటికి మంచిది...ఇంతకీ నీవు చేసే పనేమిటి?"

"వజ్రాల వ్యాపారం..." ఠక్కున జవాబిచ్చాడు విమల్.

"నీవు చెబుతున్నది నిజమేనని రుజువు చేయగలవా?"

"ఉన్నట్లుండి ఎలా చేయగలను. ఇలాంటి పరీక్ష ఎదురవుతుందని నేను అనుకోలేదు కదా..."విమల్ అన్నాడు.

"హూఁ!" శక్తిసింగ్ అన్నాడు..."జోగీ! ఒకసారి బాబుగారి జేబులు చెక్ చేయి" విమల్ వెనుక నిలబడి వున్న వాళ్ళతో అన్నాడు.

విమల్ బుర్ర వేగంగా పనిచేయటం మొదలు పెట్టింది. వాళ్లు తన్ను పరీక్ష చేసారంటే అయిపోయినట్లే. అతని జేబులో అతను భారత్ దినపత్రిక రిపోర్టర్ అని తెలిపే కాగితాలు వున్నాయి. కోట్ కాలర్‌లో దాచివున్న కెమెరా బయటపడుతుంది.

జోగీ అనే అతను అడుగు ముందుకు వేశాడు.

"ఒక్క నిముషం..." విమల్ వెంటనే అన్నాడు.

జోగీ ఠక్కున ఆగాడు.

"నా జేబులో ఒక వుత్తరం వుంది. దానివల్ల నేను నిజంగానే వజ్రాల వ్యాపారస్థుణ్నని రుజువవుతుంది."

"చూపించండి..." శక్తిసింగ్ సందిగ్ధంగా అన్నాడు.

విమల్ హిప్ పాకెట్‌లోకి చేయిపోనిచ్చి చురుగ్గా రివాల్వర్‌ని బయటకు తీస్తూ ఒకవైపుకి గెంతాడు. "ఖబడ్దార్!"

విమల్ హెచ్చరించాడు. "మిస్టర్ శక్తిసింగ్! నీ మనుష్యులని వెనక్కి తప్పుకోమని చెప్పు. లేదా! నీ బుర్ర పేలిపోతుంది."

శక్తిసింగ్ సైగ చేసాడు.

తన ప్యాంట్ బెల్ట్‌లో దోపిన పిస్టల్ వైపు పోనిస్తున్న చేతిని తక్కున ఆపాడు జోగీ.

"మీరిద్దరూ చేతులు పైకెత్తి గోడవారగా నిలబడండి" విమల్ తన దక్కడికి తెచ్చిన వారితో అన్నాడు.

ఆ ఇరువురూ గోడవద్దకు చేరుకున్నారు.

"గోడ్డవైపు తిరిగి నిలబడండి..." మళ్ళీ ఆదేశించాడతను. అతని దృష్టి ఏమాత్రం శక్తిసింగ్ వైపునుండి మరలడంలేదు. ఆ ఇరువురూ గోడవైపు ముఖంపెట్టి నిలబడ్డారు.

"ఊఁ! నీవు నీ స్థానంలోంచి నిలబడు..." రివాల్వర్‌తో శక్తిసింగ్‌ని కవర్ చేస్తూ అన్నాడు. శక్తిసింగ్ చేతులు పైకెత్తి లేచి నిలబడ్డాడు.

విమల్ టెలిఫోన్ వైర్లు సాకెట్‌లోంచి లాగాడు.

"ఇంతకీ నీ వెవరివి?" శక్తిసింగ్ అడిగాడు.

"అదంతా నీ కనవసరం. నీవు నన్ను బయటకు తీసుకుపోతున్నట్లు నీ అనుచరులకి చెప్పు. ఒకవేళ వాళ్ళేమయినా అతితెలివి చూపారంటే నీ ప్రాణాలు నీవిగావని గుర్తుంచుకో!"

"జోగీ!" శక్తిసింగ్ అన్నాడు. "విమల్ ఏమంటున్నాడో విన్నావా?"

వింటున్నానన్నట్లుగా జోగీ తలవూపాడు.

విమల్ సైగ చేయటంతో శక్తిసింగ్ బయటకు నడిచాడు. బయటకు రాగానే తాళంవేయమని ఆదేశించాడు విమల్. శక్తిసింగ్ ఆ గదికి తాళంవేశాడు.

విమల్ తన రివాల్వర్ బారెల్‌ని అతని ప్రక్క టెముక

లకు ఆనించి అన్నాడు—"ఊఁ! ముందుకిపద. బయటకు తీసుకెళ్ళు. దారిలో ఎవరికయినా ఏదయినా సైగ చేశావంటే నా మాట ఎలావున్న ముందు నీవు చస్తావు. తెలిసిందా...?"

"యస్;" అన్నాడతను. అతని ముఖం భయంవల్ల పాలి పోయింది.

శక్తిసింగ్ ముందుకి సాగాడు. అతణ్ననుసరించాడు విమల్. మూడు నాలుగు కారిడార్స్ దాటిం తర్వాత వాళ్ళిద్దరూ క్లబ్ డోర్ ముందున్నారు. అక్కడ కాపలావున్న సెంట్రీలు విమల్ ని ఆశ్చర్యంగా చూశారు. విమల్ వారిని చూసి మందహాసం చేశాడు. శక్తిసింగ్ 'అపాయం! లోపలకు రాకూడదు' అని వున్న తలుపువైపు సాగాడు.

"ఇటెక్కడకి?" విమల్ అడిగాడు.

"ఇది కంట్రోల్ రూం..." శక్తిసింగ్ అన్నాడు. "క్రింద డ్రాయింగ్ రూంలోని తలుపుని యిక్కడినుండి తెరవాల్సి వుంటుంది."

ఇద్దరూ లోపలకు ప్రవేశించారు.

అదో చిన్న కాబిన్. అందులో ఒకే ఒక వ్యక్తి కూర్చుని వున్నాడు. అతని ఎదురుగా కంట్రోలింగ్ పానెల్ లా వున్న యంత్రముంది. దానిపై ఎర్రగా, పచ్చగా బల్బులు వెలుగుతున్నాయి. ఎదురుగా గోడపై అయిదు టెలివిజన్ స్క్రీన్ లున్నాయి. అందులో ఒక దానిలో గాంబ్లింగ్ హాలులోని దృశ్యం కనిపిస్తుంది. రెండవ స్క్రీన్ పై క్రిందవున్న బార్ కౌంటర్ అగుపించసాగింది. మరో స్క్రీన్ లో కేబ్రె డాన్సర్ కనిపిస్తూంది. మిగిలిన రెండు స్క్రీన్ లు ఖాళీగా వున్నాయి.

ఆపరేటర్ శక్తిసింగ్ ని చూడగానే విష్ చేశాడు.

"క్రిందికి వెళ్ళాలి...లిఫ్టు ఇక్కడే వుందా?"

"యస్" ఆపరేటర్ అన్నాడు.

ఆ ఇరువురూ తిరిగి బయటకు వచ్చారు.

వాళ్ళిద్దరూ కంట్రోల్ రూంలోంచి బయటకు వెళ్ళ గాన్ ఆపరేటర్ పానెల్ పైవున్న రిసీవర్ అందుకుని చురుగ్గా డయల్ చేయసాగాడు. అవతలినుండి జవాబురాగానే గబ గబా చెప్పసాగాడు.

"సర్! నేను కంట్రోల్ రూం ఆపరేటర్ని...నాకిక్క డేదో సందేహంగా వుంది. ఇక్కడ ఒకతను శక్తిసింగ్ గారిని బలవంతంగా తన వెంట తీసుకెళుతున్నట్లుంది. ఆ మనిషి చేతుల్లో రివాల్వర్ వున్నట్లు నా అనుమానం..."

విమల్, శక్తిసింగ్ లు లిఫ్టులోకి చేరుకున్నారు. బటన్ నొక్కగానే లిఫ్టు కదిలింది. కొద్దిసేపటి తరువాత లిఫ్టు ఆగింది. ఇరువురూ కారిడార్ లోకి వచ్చారు.

శక్తిసింగ్ పెద్ద పెద్ద అంగలతో ఆ గోడవద్దకు చేరు కున్నాడు. వాళ్ళక్కడకు చేరుకునే సరికి గోడ పక్కకు తొలగి ఆగిపోయింది. గోడలో ఒక్క వ్యక్తి దూరి వెళ్ళగలిగే త్రోవ ఏర్పడింది.

"వాటీజ్ దిస్? ఈ గోడ ఇంకా ఎందుకు జరగటం లేదు?"

"అంటే..."

"నేను వచ్చినప్పుడు ఇది ఇంకా విశాలంగా తెరుచు కుంది కదా?"

"ఓహ్! బహుశా మిషిన్ లో ఏదో పొరపాటు జరిగి నట్లుంది."

"సరే! నీవు ముందుపద..." విమల్ తన రివాల్వర్ ని అతని వీపుకానించి అన్నాడు. "నన్ను మోసం చేయాలని మాత్రం ప్రయత్నం చేయక..."

శక్తిసింగ్ ముందుకి నడిచాడు. అతని వీపు నానుకునే విమల్ రివాల్వర్ చేయికూడా సాగింది. అప్పుడే అనుకోని

ఆకస్మిక సంఘటన జరిగింది. విమల్ రివాల్వర్ చేతిపై బలంగా ఒక దెబ్బపడింది. అతను బాధతో విలవిల్లాడాడు. రివాల్వర్ అతని చేతిలోంచి జారిపోయింది.

గోడ చాటునుండి ఒక వ్యక్తి చేతిలోవున్న ఇనుప చువ్వతో ఎదుటికి వచ్చాడు. శక్తిసింగ్ రివాల్వర్ అందుకున్నాడు.

అప్పుడే బయటహాలుకి, కారిడార్‌కి మధ్యవున్న తలుపు తెరుచుకుంది. ఆ వెంటనే 'ధనేల్' మన్న శబ్దంతోపాటు ఆ గదిలో చీకటి అలుముకుంది. "విమల్! పరుగెత్తు" ఎవరో గట్టిగా అరవడం వినిపించింది విమల్‌కి.

ప్రాణాలపై ఆశవదిలి పరుగెత్తాడు విమల్. ఆ చీకట్లో అతను ఎవరినో గుద్దుకున్నాడు. కాని అతను ఆ వ్యక్తి చేతికి దొరక్కుండా తప్పించుకున్నాడు.

ఎవరో ఆ చీకట్లో రివాల్వర్ పేల్చారు. బుల్లెట్ అతని ప్రక్కనుండి దూసుకుపోయింది. అతను తలుపు వద్దకు రాగానే "రన్! క్విక్" అతనికి మళ్ళీ వినిపించింది.

విమల్ క్లబ్ హాలువైపు పరుగెత్తసాగాడు. వెనుక తనను హెచ్చరించిన వ్యక్తికూడా వున్నాడు. తలుపు తెరుచుకుని హాలులోకి వచ్చారు.

వెలుగులో తనను హెచ్చరించిన వ్యక్తిని చూడగానే విమల్ ఆశ్చర్యంతో "అరే! నువ్వా!" అన్నాడు.

నిర్మల్ కుమార్ చిన్నగా మందహాసం చేశాడు.

"చేయి ఎలా వుంది?"

"పెకె తనీయటం లేదు. బొమిక విరగలేదు. అంతవరకు సంతోషం."

"థాంక్ గాడ్!" నిర్మల్ కుమార్ అన్నాడు.

"ఇక్కడి నుండి బయటపడదాం గురూజీ!" విమల్ అన్నాడు. అతని కంఠంలో కంపన స్పష్టంగా కనిపించింది.

"పద."

ఇద్దరూ ముఖద్వారం వైపుకి సాగారు. ముఖద్వారంవద్ద ఇద్దరు వ్యక్తులు నిలబడివున్నారు. నిర్మల్ కుమార్ తీక్షణంగా ఒకసారి చుట్టూ పరికించాడు. ద్వారంవద్ద నిలబడివున్న వ్యక్తుల్లాంటివాళ్ళు మరో అయిదారుమంది బయట ప్రహరీలో కార్ల వెనుక, చెట్ల వెనుక నక్కి వుండటం గమనించాడతను.

"పొజిషన్ బాగుండలేదు డియర్; లోపలకు పద" నిర్మల్ కుమార్ అన్నాడు.

ఆ ఇరువురూ తిరిగి గబగబా క్లబ్ హాలులోకి నడిచి ఒక టేబుల్ ముందు కూర్చున్నారు.

"నీ విక్కడికి ఎలా వచ్చావు?" విమల్ అడిగాడు.

"నేను నిన్ను వెంబడిస్తూ ఇక్కడికి వచ్చాను. నీవా మీసాలరాయుడితో లోపలకు వెళ్ళగానే నేనూ లోపలకు వచ్చాను. అప్పటికి మీరు మాయమయ్యారు. ఆ తరువాత నేనెంత గాలించినా మీరెలా మాయమయ్యారో తెలియ లేదు."

"ఆ గదిలో ఒక గోడ జరిగిపోతుంది. దాని కంట్రోల్ పానెల్ లోపలనుండి వుంది."

నిర్మల్ కుమార్ ఏమీ మాట్లాడలేదు.

"నీవు సమయానికి వచ్చావు గురూజీ! లేకుంటే నేను చచ్చుండేవాణ్ని," విమల్ కుమార్ కృతజ్ఞతతో అన్నాడు.

"అక్కడ లైట్లు ఎలా ఆరిపోయాయి?" విమల్ మళ్ళీ తానే అన్నాడు.

"కారిడార్ లో లైట్లు నేనే ఆర్పాను. ఆ గదిలో వున్న ట్యూబ్ లైట్ పై ఒక స్టూల్ విసిరాను. ఇంతకీ విషయమేమిటి విమల్?" నిర్మల్ కుమార్ అడిగాడు.

చెప్పాలా, వద్దా అన్న సందిగ్ధంలో పడ్డాడు.

"నాన్సెన్స్;" నిర్మల్ కుమార్ చిరాగ్గా అన్నాడు.

"ఇంకా సందేహిస్తున్నావా?"

"గురూజీ!" విమల్ అన్నాడు. "నిజం చెప్పాలంటే నాకు చెప్పాలని లేదు. కాని నీ వల్ల నేను ప్రాణాలతో బయటపడ్డాను. ఆ కృతజ్ఞతతో చెబుతున్నాను."

"చెప్పు."

"పైన ఒక గాంబ్లింగ్ హౌస్ వుంది. అక్కడ పెద్ద ఎత్తున జూదం నడుస్తూంది. వేలకొద్ది రూపాయలు క్షణాలపై చేతులు మారుతుంటాయి. లోపల డ్రాయింగ్ రూంలోవున్న రహస్య ద్వారం జూదగృహంలోకి దారి తీస్తుంది."

"వండర్! కాస్మాపాలిటన్ నైట్ క్లబ్ పేరు ప్రఖ్యాతులు గల క్లబ్. కేవలం మనోరంజనార్థం... మానసికోల్లాసంకోసం ఏర్పాటు చేయబడింది. పెద్దమనుష్యులెందరో వస్తారిక్కడికి..."

"అవును..." విమల్ మధ్యలోనే అన్నాడు. "ఆ పెద్ద మనుష్యులే పెద్ద ఎత్తున జూదం ఆడతారు. నేను లోపల నగరంలోని మూల స్తంభాల నెందరినో చూశాను. రుజువు కావాలంటే నీ మినియేచర్‌తో తీసిన ఫోటోని చూపించ గలను..." వుత్తేజంతో అన్నాడు విమల్.

"ఇక్కడ జూదం జరుగుతుందని నీకు ముందునుండే తెలుసా?"

"నమ్మకంగా తెలియదు. కేవలం అనుమానంపై ఇక్కడికి వచ్చాను. ఇక్కడ వినాయకరావు అనే మీసాలరాయుడు కనిపించాడు. అతనికి రెండు పెగ్గులు విస్కీ తాగించేసరికి అసలు బయట పెట్టడమేకాకుండా నన్ను లోపలకు తీసికెళ్ళాడు కూడా! అంతేకాదు. ఇక్కడ పెద్ద ఎత్తున బ్రోతల్స్ కూడా లభిస్తారు."

"ఇంత పెద్ద ఎత్తున అనాచారం జరుగుతుంటే ఎవరూ పట్టించుకోవడం లేదా?"

"అంతేకాదు గురూజీ! మన నగరంలో ఇలాంటివి అర డజన్ కి పైగా వున్నాయి. నేను మరో స్థావరాన్ని చూడ లేదు కాని ప్రమాణాలు సేకరించాను. ఏదో ఒక గాంగ్ నగరంలో ఇలాంటి అనాచారాలని విస్తరింప చేయాలని ప్రయత్నం చేస్తోంది. ఆ గాంగ్ కి కొందరు ప్రభుత్వోద్యోగుల సహాయంకూడా వుంది."

"వ్వాట్ నాన్సెన్స్ యూ ఆర్ టాకింగ్ ...?"

"నేను నిజం చెబుతున్నాను గురూజీ!" విమల్ కుడిచేతి పిడికిలిని ఎడమచేతిపై గుద్దుకుంటూ అన్నాడు, "ఒక్కసారి నన్నిక్కడినుండిబయటకు వెళ్ళనీ! ఆ తరువాత జరిగే కోలా హాలాన్ని చూడు. ఎందరో పెద్దమనుష్యులు ముఖాలపై నుండి ముసుగులు తొలగి పోయినంత మాత్రానే గుండెలదరి చస్తారు."

"నిన్ను గురించి ఆ గాంగ్ కి తెలుసా?"

"తెలియదు; నేనేమి చేస్తున్నానో ఎవరికీ తెలియదు. మా సంపాదకునికి కూడా తెలియదు. ఇవాళే మొదటగా వీళ్ళదృష్టిలో పడ్డాను. అయినా నేను వాళ్ళకు ఎంత అపాయకారినో వీరికి తెలియదు. నా కోట్ కాలర్ లో వున్న కెమరా విషయం వీరికి తెలియదు."

"అయినా వీళ్ళు నిన్ను బయటకు వెళ్ళనీయ దలచుకో లేదు. క్లబ్ కాంపౌండ్ చుట్టూ వీళ్ళ గాంగ్ మనుష్యు లున్నారు. నీవు బయటకు వెళ్ళడం ఆలస్యం నీపని పూర్తి చేస్తారు. నీవు వీళ్ళకి కలిగిస్తున్న నష్టమేమిటో వారికి తెలి యదు. తెలిసిందంటే... ఇంతమందిలో కూడా నిన్ను చంప డానికి వెనకాడరు..." నిర్మల్ కుమార్ ఆలోచిస్తూ అన్నాడు.

"అయితే ఏం చేద్దాం?" విమల్ నెమ్మదిగా అన్నాడు. "నన్నెలాగయినా బయటకు చేర్చు గురూజీ!"

ఇద్దరూ మళ్ళీ బయటకు వచ్చారు. బార్ ద్వారంవద్ద

శక్తి కిసింగ్ నిలబడి వున్నాడు.

బార్ ద్వారానికి పదడుగుల దూరంలో మరో ద్వారం వుంది. దానిపై 'బిలియర్డ్స్ రూం' అని రాసివుంది. నిర్మల్ కుమార్, విమల్ చేయి పట్టుకుని బిలియర్డ్స్ రూంలోకి ప్రవేశించాడు.

బిలియర్డ్స్ టేబుల్ చుట్టూ ఆటగాళ్ళు 'క్యూ' చేతుల్లో పట్టుకుని నిలబడివున్నారు. గోడవారగా వున్న సోఫాల్లో కొందరు కూర్చుని వున్నారు.

బిలియర్డ్స్ టేబుల్ చుట్టూ నిలబడివున్న ఆటగాళ్ళలో వున్న ఒక వ్యక్తిని చూడగానే నిర్మల్ కుమార్ కళ్ళలో మెరుపులు మెరిసాయి.

"విమల్!" నిర్మల్ కుమార్ విమల్ చేయి నొక్కుతూ అన్నాడు. "మనం నిరపాయంగా బయట పడవచ్చనుకుంటాను..."

"ఎలా?" విమల్ ఆశగా అడిగాడు.

"టేబుల్ పై వంగి ఆడుతున్నాడు చూడు... అతను పోలీస్ సూపర్నెంట్... ఆయన నాకు బాగా తెలుసు..."

"ఎవరు? మజుందార్...?" విమల్ అడిగాడు. నిర్మల్ కుమార్, సూపర్నెంట్ మజుందార్లు మంచి మిత్రులని విమల్ కి తెలుసు.

"కాదు; ఇతను సూపర్నెంట్ శంభూప్రసాద్. వెస్ట్ జోన్ సూపర్నెంట్..."

"అయితే మన పని మరింత సులువవుతుంది గురూ! ఈ క్లబ్ కూడా వెస్ట్ జోన్ లోనే వుంది. శంభూప్రసాద్ గారు మనలను బయటకు పంపడంతోపాటు వెంటనే ఈ క్లబ్ పై రైడ్ కూడా చేయించవచ్చు."

"సరే! మాట్లాడుదాం...!"

బిలియర్డ్స్ టేబుల్ వద్దనుండి ఆయన పక్కకి తప్పుకోగానే

నిర్మల్ కుమార్ ఆయన దగ్గరకు వెళ్ళాడు. "నమస్తే; శంభూ ప్రసాద్ జీ!" అన్నాడు నిర్మల్.

"హల్లో యంగ్ మాన్; హౌ ఆర్ యూ...?" శంభూ ప్రసాద్ నవ్వుతూ అన్నాడు.

"ఫైన్ థాంక్యూ! ఇతన్ని కలవండి. నా స్నేహితుడు విమల్... 'భారత్' దినపత్రిక రిపోర్టర్" విమల్ ని పరిచయం చేశాడు.

శంభూప్రసాద్, విమల్ తో చేయి కలిపాడు.

"ఇక్కడికి రెగ్యులర్ గా వస్తూంటావా?" అడిగాడు శంభూప్రసాద్ నిర్మల్ ని.

"లేదు; ఇవాళే మొదటిసారి అనుకోకుండా వచ్చాను. మీరిక్కడ వున్నారు. చాలా మంచిదయింది..."

"ఏం...? ఏమయింది??"

"ఒక భయంకరమయిన సంఘటన జరిగింది."

"ఏమిటి?"

"ఒక నిముషం నాతో రండి."

నిర్మల్ కుమార్, విమల్ లు శంభూప్రసాద్ ని ఒక మూలకి తీసుకెళ్ళారు. వీలయినంత సంక్షిప్తంగా విమల్ విషయాలని సూపరెన్టెంటుకి వినిపించసాగాడు. వింటున్నకొద్దీ అతని ముఖం గంభీర మవసాగింది.

"దిస్ యీజ్ ఫెంటాస్టిక్... రాదర్ అన్ బిలీవెబుల్!" చివరకు అన్నాడతను.

"నేను నిజం చెబుతున్నాను సర్;" విమల్ ఒత్తి పలికాడు.

"సూపరెన్టెంట్ జీ!" నిర్మల్ కుమార్ అన్నాడు. కనీసం "ఏడెనిమిదిమంది బయట విమల్ గురించి కాచుకుని వుండటం నేను గమనించాను."

"నాతో రండి..." శంభూప్రసాద్ నిర్ణయాత్మకంగా

అన్నాడు.

ఆ ఇరువురిని వెంటబెట్టుకుని శంభూప్రసాద్ బయటకు వచ్చాడు. కాని అతనికి అనుమానాస్పదమయిన వ్యక్తివరూ కనిపించలేదు.

శంభూప్రసాద్ వారిద్దరితో ప్రహరీ అంతా ఒకసారి తిరిగివచ్చాడు. ఆయన ప్రశ్నార్థకంగా నిర్మల్ కుమార్ ని చూశాడు.

"మిమ్మలని చూసి వాళ్లు ఎక్కడో దాక్కున్నట్లుంది..."

"కావచ్చు; పదండి లోపలికి..." శంభూప్రసాద్ అన్నాడు.

ముగ్గురూ లోపలికి ప్రవేశించారు.

"నిర్మల్! నీవూ చూశానన్న ఆ డ్రాయింగ్ రూం... టెలివిజన్ కెమెరాలు చూద్దాం పద..." సూపర్నెంట్ అన్నాడు.

ఆ ఇరువురూ అతణ్ని కారిడార్ లో వెంబడించారు. "శంభూప్రసాద్ జీ! ఇదిగో ఇక్కడే టెలివిజన్ కెమెరా వుంది..." అంటూ తల ఎత్తిన నిర్మల్ కుమార్ నోరెళ్ళబెట్టాడు. అక్కడ టెలివిజన్ కెమరాకు బదులుగా ఒక బల్బ్ వేళ్ళాడుతోంది...

"యస్;" శంభూప్రసాద్ అన్నాడు.

"అరే! కొద్దిసేపటి క్రితం ఇక్కడ కెమరా చూశాను," దీర్ఘంగా ఆలోచిస్తూ అన్నాడు నిర్మల్ కుమార్.

"ఐసీ!" శంభూప్రసాద్ అవిశ్వాసంగా అన్నాడు.

"ఇంతకీ సీక్రెట్ వాల్ వున్న ఆ డ్రాయింగ్ రూం ఏది?"

"ఇదే..." విమల్ అన్నాడు.

ముగ్గురూ ఆ గదివద్దకు వెళ్ళారు. గది తలుపులకి తాళం కప్ప వేళ్ళాడుతోంది. శంభూప్రసాద్ తాళాన్ని చూసి... "దీనిపైనున్న దుమ్ముని చూస్తుంటే ఈ మధ్య ఈ తలుపులని

తెరిచినట్లులేదు" అన్నాడు.

"డుమ్మని స్పెర్రిచేసి వుండవచ్చు."

"ఇందులోని గోడ జరుగుతుందని నీవు పూర్తిగా నమ్మక ముందా?"

"అవును" విమల్ అన్నాడు.

"నీకూ_డానా?" నిర్మల్‌ని అడిగాడు శంభూప్రసాద్.

"యస్."

శంభూప్రసాద్ కేబ్రేవేలులోకి వెళ్ళి, ఒక నిముషం తరువాత తిరిగివచ్చాడు. "నేను మేనేజర్ని పిలిపించాను," అనన్నాడు.

కొద్దిసేపటి తర్వాత శక్తిసింగ్ అక్కడికి వచ్చాడు.

"మిస్టర్ శక్తిసింగ్," శంభూప్రసాద్ గంభీరంగా అన్నాడు. "నీవు నన్ను ఎరుగుదువా?"

"తెలుసు; మీరు సూపర్నెంట్ గారు" శక్తిసింగ్ వినయంగా అన్నాడు. అతను నిర్మల్‌కుమార్, విమల్ వైపు కన్నెత్తికూడా చూడ్లేదు.

"ఈ గదిలో ఏముంది?" తాళం వేసివున్న గదిని చూపించి అడిగాడు.

"పాత ఫర్నిచర్."

"దీనిని తెరిపించు" ఆజ్ఞాపించాడు.

"ఇప్పుడే తాళంచెవి తెప్పిస్తాను," అంటూ శక్తిసింగ్ వెళ్ళాడు. కొద్ది సేపటి తరువాత అతను ఒక వెయిటర్‌తో సహా వచ్చాడు.

వెయిటర్ చేతిలో ఒక తాళం చెవుల గుత్తివుంది. శక్తిసింగ్ సంకేతంపై వెయిటర్ తాళం తెరిచి లోపలకు వెళ్ళి స్విచ్చి నొక్కాడు.

అందరూ లోపలకు ప్రవేశించారు.

గదంతా పాత ఫర్నిచర్‌తో నిండివుంది. ఫర్నిచర్ పై...

గదినేలపై గోడలపై అంతటా అరంగుళం మందాన దుమ్ము పేరుకు పోయివుంది. తానంతకుముందు స్టూలు విసిరి పగల గొట్టిన ట్యూబ్ లైట్ గుర్తులు అసలులేవు. అంతా అయోమయంగా వుంది.

శంభూప్రసాద్ విమల్ వైపు చూశాడు.

విమల్ అనుమానంగా శక్తిసింగ్ కేసి చూశాడు. "కొద్ది సేపటిక్రితం ఈ గది డ్రాయింగ్ రూంలా అలంకరించి వుండింది," విమల్ అన్నాడు.

"ఎంత సేపటి క్రితం?"

"సుమారు అరగంట క్రితం..." విమల్ తన చేతి గడియారం చూసుకుని అన్నాడు.

"విమల్ చెబుతున్నది నిజమే!" నిర్మల్ కుమార్ అన్నాడు.

"ఊఁ!" శంభూప్రసాద్ అన్నాడు... "ఇంతకీ మీరు చెప్పిన ఆ గోడ ఏది?"

విమల్, నిర్మల్ కుమార్ లిద్దరూ ఒకసారి ఒక గోడను చూపించారు. అతను ఫర్నిచర్ ని తప్పించుకుని ఆ గోడ వద్దకు వెళ్ళి దానిని అక్కడక్కడ తట్టి చూశాడు.

"ఈ గోడలో నా కేలోపం కనిపించడం లేదు..."

"గోడలో ఏ విధమయిన లోపమూ లేదు..." విమల్ ఉత్తేజితుడయి అన్నాడు. "కాని... ఈ గోడ పక్కకు తొలగుతుంది. ఈ గోడ వెనుకనున్న కారిడార్ లో జూద గృహంలోకి తీసుకెళ్ళడానికి లిఫ్టు వుంది. నేను స్వయంగా అక్కడికి వెళ్ళాను. నేనా జూద గృహంలో ఒక ఫొటో కూడా తీసాను..."

"ఫొటో తీసావా...?" శంభూప్రసాద్ సీరియస్ గా అన్నాడు. "ఆ విషయం ఇంతకుముందు నువ్వు చెప్పలేదే?"

విమల్ తన కోట్ కాలర్ నుండి కెమెరాని తీసి చూపిస్తూ, "ఇందులో ఆ జూదగృహం ఫొటో వుంది"

అన్నాడు.

"నేనా ఫొటోని చూడాలి...ఆ కెమెరా ఇటివ్వు నేను దాని నిప్పుడే పోలీస్ లాబరెటరీకి పంపుతాను," శంభూ ప్రసాద్ చేయిచాస్తూ అన్నాడు.

"సారీ!" విమల్ ధృఢంగా అన్నాడు. "కెమెరా నే నివ్వను. కావాలంటే దాని కాపీ ఒకటిస్తాను."

"నీవు నాపైన నమ్మకం లేదా...?"

"ఇది నమ్మకం మాటకాదు సూపరిన్టెంటుగారూ! నా ప్రాణాలపై ఆశవదులుకుని దీనిని సంపాదించాను. మొదటగా ఇది భారత్‌లోనే ప్రింటవ్వాలి. అదే నా సిద్ధాంతం." విమల్ చెప్పసాగాడు. "దీనిని నా నుండి వేరు కానివ్వలేను."

శంభూప్రసాద్ మరింకేమీ మాట్లాడలేదు.

"సూపరిన్టెంటుగారూ! ఇప్పుడేమిటి చేయడం," నిర్మల్ కుమార్ అడిగాడు.

"మీరిద్దరూ నాకో విషయం చెప్పండి."

"ఏమిటి?" ఇద్దరూ ఒకేసారి అడిగారు.

"నిజంగానే ఇందులో జూదగృహ ముందా?"

"అవును! నేను స్వయంగా చూశాను. నా కెమెరాలోని ఫొటో ఇందులో జూదగృహ ముందని నిరూపిస్తుంది" విమల్ అన్నాడు.

"వాట్ అబవుట్ యూ?" నిర్మల్ వైపు చూసి అడిగాడు సూపరిన్టెంట్.

"జూదగృహాన్ని నేనైతే చూశ్లేదు. కాని ఈ గోడ జరగడం, దీని వెనుకనున్న కారిడార్ చూశాను."

"ఆల్‌రైట్! నిర్మల్ నేను నీ స్నేహితుణ్ని గురించి ఎరగను. కాని నీ మాట నమ్మి నేను ఈ క్లబ్‌ని వెదకడానికి సెర్చ్‌వారెంట్ తెప్పించబోతున్నాను," అని

శంభూప్రసాద్ శక్తిసింగ్ వైపు తిరిగి, "మిస్టర్ ఈగదికి తాళంవేసి తాళం చెవులు నాకివ్వు," ఆదేశించాడు.

"ఎందుకు?" సంభాషణ అంతా విన్నా అడిగాడు శక్తిసింగ్.

"ఈ క్లబ్‌లో రహస్యంగా జూదం సాగుతూందని నాకు నమ్మకంగా తెలిసింది. నేను క్లబ్‌ని సర్చ్ చేయించబోతున్నాను."

శక్తిసింగ్ తాళంవేసి తాళం చెవులు శంభూప్రసాద్‌కి అందించాడు.

"టెలిఫోన్ ఎక్కడుందో చూపించు."

శక్తిసింగ్ వారిని ఒక ఆఫీసులాంటి గదిలోకి పిలుచుకు వచ్చాడు. అందులో టెలిఫోన్ వుంది. సూపర్నెంట్ అందరినీ బయిటవుండమని, తానుమాత్రం లోపలకు వెళ్ళి ఫోన్ చేయసాగాడు.

"పదిహేను ఇరవయి నిముషాల్లో ఇక్కడికి పోలీసులు సెర్చ్ వారెంట్‌తో వస్తున్నారు" బయటకు వచ్చిన శంభూప్రసాద్ చెప్పసాగాడు. "నేను మీ వెంట పోలీసులని ఎస్కార్ట్‌గా పంపుతాను. వాళ్ళు మిమ్ములని ఎక్కడ కావాలంటే అక్కడ వదిలి వస్తారు. సరేనా?"

"ఓ. కే" విమల్, నిర్మల్‌కుమార్‌లిరువురూ ఒకేసారి అన్నారు.

"నీవు ఆ ఫొటో ప్రింటొకటి వీలయినంత త్వరగా పంపాలి తెలిసిందా?" విమల్‌ని చూసి అన్నాడు.

"మంచిది సార్," విమల్ సంతోషంగా అన్నాడు.

సరిగ్గా పదిహేను నిమిషాలకంతా మూడు ట్రక్కులలో కనీసం నలభయిమంది పోలీస్ కానిస్టేబుల్స్ వచ్చారు. శంభూప్రసాద్ పోలీస్ రక్షణలో నిర్మల్, విమల్‌లను

పంపించాడు. ఇద్దరు ఆయుధ ధారులని, వారి ఇంటివద్ద కాపలా వుండమనికూడా ఆదేశించాడు. అందుకు విమల్ ఒప్పుకొన్నాడు. కాని నిర్మల్ తనకు కాపలా అనవసరమని నిరాకరించాడు.

విమల్ తన హిందూస్తాన్‌లోనూ, నిర్మల్‌కుమార్ తన 'హోండా'పై కూర్చుని, శంభూప్రసాద్‌కి గుడ్ బై చెప్పి, బయలుదేరారు. వారి వెనుక ఒక పోలీస్ జీప్ బయలుదేరింది.

# 3

విమల్ తన ఫ్లాట్‌కి చేరుకునేసరికి రాత్రి ఒకటిన్నర అయింది.

అతను ఫ్లాట్‌లోకి వెళ్ళగానే హీటర్‌పై టీ చేసుకుని తాగాడు. అయిదు నిముషాలు సిగరెట్ పీలుస్తూ విశ్రాంతి తీసుకుని పనిచేయడంలో మునిగిపోయాడు.

అతను మినియేచర్ కెమారానుండి నెగెటివ్ తీసి దానిని డెవలప్ చేసి, దానివి మూడు ప్రింట్లు తయారుచేశాడు. ఒక ప్రింట్‌ని ఒక కవరులో వేసి కవరుపై సూపరింటెంట్ శంభూ ప్రసాద్ అని రాశాడు.

జాగ్రత్తగా తన ఫ్లాట్‌లోంచి బయటకు వచ్చాడు విమల్. బయట లాంప్ పోస్ట్ నానుకుని ఆయుధ ధారుడయిన కానిస్టేబుల్ అప్రమత్తతతో నిలబడివున్నాడు. విమల్ బయటకు రావడంచూసి కానిస్టేబుల్ దగ్గరకు వచ్చాడు.

"ఈ కవరు సూపరింటెంట్ గారికి అందచేయాలి," కవరిస్తూ అన్నాడు విమల్.

"వెళ్తాను. కాని మరో అరగంట వరకు ఫ్లాట్‌లోంచి బయటకు రాకండి. ఎవరికి తలుపులు తీయవద్దు. అరగంటలో నేను తిరిగివస్తాను," కానిస్టేబుల్ అన్నాడు.

"మంచిది."

కానిస్టేబుల్ వెళ్ళిపోగానే విమల్ లోపలినుండి తలుపులు మూసివచ్చి తన టేబుల్ ముందు కూర్చుని బల్లసొరుగు తాళం తీసాడు. సొరుగులోంచి ఒక కట్ట కాగితాలను తీసాడు. అందులో కొన్ని కాగితాలు టైప్ చేసివుంటే, కొన్ని షార్ట్ హాండ్ లో వున్నాయి...మరికొన్ని చేత్తో రాసివున్నాయి. చిందరవందరగా వున్న ఆ కాగితాలను సరిచేశాడు విమల్.

ఆ తరువాత అతను టైపురైటర్ని తన ముందుకిలాక్కుని రోలర్ లో రెండు ఫుల్ స్కేపు కాగితాలు ఎక్కించి మధ్యన కార్బన్ బిగించి, టైపుచేయడం మొదలుపెట్టాడు.

ఉదయం ఏడుగంటలవరకు అతను యాభయిపేజీల రిపోర్ట్ టైపుచేశాడు. టైపుచేసిన వాటిలోంచి కార్బన్ కాపీ వేరుచేశాడు. తరువాత కొన్ని ఫొటోస్టాట్ కాపీలు, కొన్ని ఫొటోగ్రాఫిక్ ప్రింట్లు ఆ కాగితాలతో జతచేశాడు. వాటన్నింటిని ఒక పెద్ద కవరులో వేసి అంటించి, ఆ కవరుని తన బ్రీఫ్ కేస్ లో పెట్టుకున్నాడు.

ఆ రిపోర్ట్ యొక్క కార్బన్ కాపీని, కొన్ని నెగటివ్స్ ని కొన్ని ఫొటోలని మరో కవరులో వేసి, దానిని సూట్ కేస్ లో వేసి తాళంవేశాడు. సూట్ కేస్ అందుకుని, అతను తన ఫ్లాట్ లోంచి బయటకువచ్చి పై అంతస్తుకి చేరుకున్నాడు. పై అంతస్తులో ఒక ఫ్లాట్ ముందాగి కాల్ బెల్ నొక్కాడు.

ఒక నిముషం తర్వాత విమల్ మిత్రుడు సాగర్ తలుపు తెరిచాడు.

"నీతో చిన్నపనుండి వచ్చాను," లోపలకు ప్రవేశించాడు విమల్.

"ఏమిటది?"

"ఈ సూట్ కేస్ ని నీవద్ద వుంచుకోవాలి."

"ఓ కే...ఏముందందులో?"

"నా వృత్తికి సంబంధించిన కొన్ని ముఖ్యమయిన కాగితాలు. అంతే."

"దీన్ని నీవద్దనే ఎందు వుంచుకోకూడదు?"

"సాగర్! ఎదురు ప్రశ్నలు వద్దు; దీన్ని నీవద్ద దాస్తావా లేక..." విమల్ కొంచెం చికాగ్గా అని వెనక్కి తిరిగాడు.

"అరే! ఊరికే ఎందుకలా ఎగిరిపడుతున్నావు. నేనేదో మాట వరుసకి అడిగాను. జవాబివ్వడం, ఇవ్వకపోవడం నీ ఇష్టం. సరే ఇలా ఇవ్వు," సాగర్ ఖిన్నవదనంతో అన్నాడు.

"సారీ, సాగర్!" విమల్ క్షమించమన్నట్లుగా అన్నాడు. "నా బుర్ర పనిచేయడంలేదు. బాగా అలసిపోయాను."

"రాత్రి నిద్రపోలేదా?" మిత్రుని పరిస్థితిని అర్థంచేసుకుని అన్నాడు సాగర్.

"లేదు, రాత్రంతా పనిచేస్తూ వుండిపోయాను."

"టీ తయారయి వుంటుంది, తెప్పించమంటావా...టీ త్రాగావంటే సర్దుకోవచ్చు" లోపలిగదివైపు తలతిప్పుతూ "రాణీ! మీ మరిదిగారికో కప్పు టీ తీసుకురా!" అన్నాడు.

"అరెరె...ఇప్పుడొద్దు. నేనింకా ముఖమయినా కడగలేదు. వద్దు వదినా. నేను వెళుతున్నాను," బిగ్గరగా అని బయటకువచ్చి తన ఫ్లాట్ వైపుకి సాగాడు విమల్.

తన ఫ్లాట్‌లోకి రాగానే హీటర్‌పై టీకి నీళ్ళు పడేసి టవలందుకుని బాత్‌రూంలోకి వెళ్ళాడు. పదినిముషాలకంతా స్నానపానాదులు ముగించుకుని బయటకు వచ్చాడు. టీ తయారుచేసుకుని టీ కెటిల్‌తోపాటు డ్రెస్సింగ్ రూంలోకి ప్రవేశించాడు. బిస్కట్లుతింటూ, టీ త్రాగుతూనే దుస్తులు వేసుకోవడం ముగించాడు.

అయిదు నిముషాల తర్వాత విమల్ ఫ్లాట్ కి తాళంవేసి రోడ్డుమీదికి వచ్చాడు. ఆ కానిస్టేబుల్ ఉదయం ఎప్పుడో వెళ్ళిపోయినట్లున్నాడు.

విమల్ పబ్లిక్ బూత్ నుంచి నిర్మల్ కుమార్ కి ఫోన్ చేశాడు. కనెక్షన్ దొరకగానే "హల్లో! గురూజీ! విమల్ ని మాట్లాడుతున్నాను..." అన్నాడు. "రాత్రిసర్చ్ వారంట్ తో క్లబ్ ని అంగుళంగుళం వెదికిస్తానని అన్నాడు కదా! నీకేమయినా రిజల్ట్ తెలిసిందా?" ఆతురతగా అడిగాడు విమల్.

"చాలా గందరగోళం జరిగింది డియర్! ఏంచేయాలో తోచటంలేదు," నిర్మల్ కుమార్ భారంగా అన్నాడు.

"ఏమయింది?"

"పోలీసులు ఆ క్లబ్ ని అంగుళమంగుళం గాలించి వదిలారు. కాని ఎక్కడా జూదగృహంలేదు. సూపర్నెంట్ శంభూ ప్రసాద్ క్లబ్ బిల్డింగ్ ని జాగ్రత్తగా స్టడిచేశాడు. ఆయన వుద్దేశంలో... రౌలెట్ టేబుల్ లాంటి విశాలమయిన టేబుల్ గాని, యాభయి అరవయిమంది రహస్యంగా వుండడానికి వీలుగల రహస్యస్థావరం లేదు. అరగంట క్రితమే శంభూ ప్రసాద్ గారు ఫోన్ చేసి చెప్పారు."

"కాని, నేను చూసిందానికి ఏమంటావు?" విమల్ ఉత్తేజితుడయి అడిగాడు.

"ఏమో నేనుమాత్రం చూల్లేదు కదా!"

"డ్రాయింగ్ రూంలో గోడపక్కకి తోలగటం నీవు చూశావుకదా?"

"అవును."

"మరి దానికేమంటావు?" అడిగాడు విమల్.

అవతలినుండి నిర్మల్ కుమార్ ఏవిధమయిన జవాబు ఇవ్వలేదు.

"హల్లో! నిర్మల్!" విమల్ పిలిచాడు.

"చూడు విమల్! ఆ బిల్డింగ్‌లో గాంబ్లింగ్ హౌస్ లేదు. అంతవరకు నేనూ ఒప్పుకుంటాను..." నిర్మల్‌కుమార్ మెల్లిగా అన్నాడు.

"అంటే నీకు నా మాటపై నమ్మకంలేదా?"

"తప్పకుండా నమ్ముతాను. కాని, నేననేది ఏమిటంటే, నిన్నా బిల్డింగ్ నుండి దూరంగా తీసుకెళ్ళారు. డ్రింక్స్ మత్తులో నువ్వా విషయాన్ని గమనించలేకపోయావు."

"నో. అలాంటిదేమీ జరుగలేదు" విమల్ బిగ్గరగా అన్నాడు.

"అలాకాకుంటే నువ్వు ఏదో కలగని వుండాలి."

"పోలీసులు ఆ గోడను పరీక్ష చేశారా?"

"ఆఁ! అది ఆ క్లబ్‌కి చివరిగోడ. గోడకు అవతలివైపు క్లబ్ పోర్షన్ ఏమీలేదు."

"వాళ్ళు దానిని కూలగొట్టి చూడాల్సింది."

"విమల్! వాట్ నాన్సెన్స్ యూ ఆర్ టాకింగ్" నిర్మల్‌కుమార్ విసుగ్గా అన్నాడు. "చెప్పడంలో, చేయడంలో చాలా మార్పు వుంటుంది. ఇప్పటికి జరిగిందానికే శక్తిసింగ్, ఐ. జి. కి రిపోర్ట్ ఇస్తానని కూర్చున్నాడు."

"నేను సూపరెన్టెంట్ గారికి అక్కడ తీసిన ఫోటో పంపించాను..."

"అది జూదగృహంలో తీసినఫోటో...అందులోసందేహం లేదని చెప్పారు. కాని, ఆ ఫోటోకి, కాస్మాపాలిటన్‌కి ఏవిధమయిన సంబంధంలేదు. ఆ ఫోటోలోని స్థానం ఆ నైట్‌క్లబ్‌ది కాదు."

విమల్ ఒకసారి దీర్ఘంగా నిట్టూర్చాడు. "సూపరెన్టెంటు గారు ఇంకా కొంచెం స్ట్రాంగ్ ఆక్షన్ తీసుకుని వుండాల్సింది."

"ఇప్పటికే ఆయన చేసిన దానికి పశ్చాత్తాప పడుతున్నారు. ఒక తాగుబోతు కథనంవిని ఇదంతా చేసినందుకు బాధపడుతున్నారు."

"మైగాడ్! నిర్మల్! నేను త్రాగుబోతునే కాను, అది కథనమూ కాదు. నూటికి నూరుపాళ్లు వాస్తవం."

"కామ్ డౌన్ డియర్...కామ్‌డౌన్. నీ మాటలు నేను నమ్ముతాను. కాని ఇతరులకి అది కథనంలాగే వుంటుంది."

"ఆల్ రైట్—" విమల్ అన్నాడు. "త్వరలోనే ఇది కథనం కాదని ప్రజలకు తెలిసిపోతుంది. ఇవాళే నేను సంపాదించిన డైనమైట్‌కి అగ్గిపుల్లగీసి అంటిస్తున్నాను... ఇవాళ్టి 'భారత్'లో అంతా ప్రింటవుతుంది. కాగితాలతో ఎడిటర్ వద్దకి వెళుతున్నాను. అప్పుడయినా పోలీసులు నిద్ర మత్తు వదలుతారో లేదో చూద్దాం."

"ఓ కే...ఒక రిపోర్టర్‌గా మనం చేయాల్సింది మనం చేస్తాం. విష్ యూ గుడ్‌లక్. కాని నీవు వేసే ప్రతిఅడుగు దృఢంగా వుండాలని మరచిపోవద్దు."

"ష్యూర్!"

"ఆల్ రైట్; గుడ్ లక్ అగైన్."

"థాంక్యూ" రిసీవర్ క్రెడిల్ చేశాడు విమల్.

తన కారులో కూర్చుని అతను తమ దినపత్రిక కార్యాలయానికి వెళ్ళాడు. అతను నేరుగా సంపాదకుని గదిలోకి వెళ్ళి "నేను మీతో కొంచెం మాట్లాడాలి" అన్నాడు.

"ఏమిటి విషయం?"

"విషయం చాలా గంభీరమయినది."

"కూర్చో."

విమల్ సంపాదకుని కెదురుగా కుర్చీలో కూర్చున్నాడు. తన బ్రీఫ్‌కేస్ తెరిచి, తను తయారు చేసిన కాగితాలను ఎడిటర్ ముందుంచాడు.

"ఏమిటది?" అడిగాడు ఎడిటర్.

"ఒక నెలగా నేను శ్రమపడి,ఏర్చికూర్చిన డైనమైట్."

ఎడిటర్ ఒకసారి విచిత్రంగా విమల్ ముఖంలోకి చూశాడు. ఆ కాగితాలను అందుకుంటూ "ఇంతకూ ఏమిటిది?" మళ్ళీ అడిగాడు.

"మీరే స్వయంగా చూసుకోండి."

"ఆల్ రైట్...!" అని ఎడిటర్ ఆ కాగితాలను చూడసాగాడు. మొదట అతను ఫొటోగ్రాఫ్స్ చూశాడు. తరువాత అతను రిపోర్ట్ని అక్కడక్కడ చూశాడు. అతని నేత్రాలు విస్ఫారితమయ్యాయి. ఆశ్చర్యంగా విమల్ కేసి చూశాడు.

విమల్ ప్రశాంతంగా కూర్చున్నాడు.

తన చేతిలోని టైంబాంబు ఏ క్షణంలోనైనా పేల వచ్చన్నట్లుగా చూశాడా రిపోర్టుని. "నీవు వెళ్ళి నీ సీటులో కూర్చో. నేను దీనిని జాగ్రత్తగా పరిశీలించి నిన్ను పిలిపిస్తాను" విమల్తో అన్నాడు ఎడిటర్.

"మంచిది" అని లేచాడు విమల్.

సుమారు రెండుగంటల తర్వాత ఎడిటర్ విమల్ని పిలిపించాడు. తనని ఎవరో హిప్నటైజ్ చేశారేమో అన్నట్లుగా వుంది సంపాదకుని ముఖం.

"ఇదంతా నీవే చేశావా?" ఆందోళనగా అడిగాడు సంపాదకుడు.

"అవును..." గర్వంగా అన్నాడు విమల్.

"ఈ విషయం నీ వింతవు ముందుప్పుడూ చెప్పలేదు."

"సరయిన ప్రమాణాలు లభించేవరకు ఎవరికి ఏమీ చెప్పకూడదనుకున్నాను అంతే!"

"వండర్!"

"ఇందులో చాలామంది పెద్ద మనుష్యుల పేర్లున్నాయి"

సంపాదకుడు తిరిగి తనే అన్నాడు. "ఇదంతా నిజమేనా?" విమల్ వైపు సందిగ్ధంగా చూశాడు.

"ఇదంతా అబద్ధమని మీరనుకుంటున్నారా?" ఎదురు ప్రశ్న వేశాడు విమల్.

"లేదు, నీవు చాలా పటిష్టమయిన ప్రమాణాలను సంపాదించావు. కాని నాకెందుకో ఇదంతా అబద్ధమయితే బాగుండుననిపిస్తూంది."

"ఈ రిపోర్ట్‌లోని ప్రతి అక్షరమూ నగ్నసత్యం."

"యస్" సంపాదకుడు బరువుగా నిట్టూర్పు వదిలి అన్నాడు. "బట్, అయామ్ సారీ! నేను దీనిని ప్రింటుకి పంపలేను."

"ఎందుకు??" ఉలిక్కిపడ్డాడు విమల్... "మీకింకా సందేహం వుందా?"

"ఊహుఁ! అలాంటిదేమీ లేదు."

"మరి ప్రింటుకి ఎందుకు పంపనంటున్నారు?"

"ఇందులో నగరంలోని పెద్ద మనుష్యుల పేర్లు చాలా వున్నాయి. అందులో ఒకతను మన పత్రిక యజమాని పట్టాభిరామ్‌గారికి ప్రాణస్నేహితుడు కూడా!"

"అయితే ఏమయింది? నిజాన్ని మరుగుపరచాలని మన యజమాని అనుకుంటారని నేననుకోను."

సంపాదకుడు మరి మాట్లాడలేదు.

"ఒక దినపత్రిక ఎడిటర్‌గా మీకూ కొన్ని బాధ్యతలున్నాయి" విమల్ అన్నాడు.

"నా బాధ్యతలేమిటో నాకు తెలుసు."

"అయితే ఈ రిపోర్టుని ప్రింటుకి పంపండి."

"నెవర్!" సంపాదకుడు కఠినంగా అన్నాడు.

"మీరు మీ బాధ్యతనుండి దారి తప్పుతున్నారు. ఈ బాధ్యతను నెత్తిన వేసుకోవడానికి భయపడుతున్నారు,"

విమల్ బల్లగుద్దుతూ అన్నాడు.

"కాదు; కేవలం జాగ్రత్తపడుతున్నాను."

"నా వుద్దేశంలో మీరు మీ కర్తవ్యాన్ని పాటించడం లేదు...అంతే!"

"నీవు నన్ను ఒత్తిడి చేస్తున్నావు"

"లేదు;" విమల్ అసహ్యంగా అన్నాడు. "మీరు పిరికివాళ్ళనీ, బాధ్యతారహితులని, దేశం, చట్టం, ప్రభుత్వం పట్ల మీకెలాంటి గౌరవం లేదనీ, మీ అసలు రూపాన్ని మీకు చూపుతున్నాను."

"చూడు విమల్!" సంపాదకుడు నెమ్మదిగా అన్నాడు. "నేను కేవలం సంపాదకుణ్ణి కాని, యజమానిని కానన్న విషయాన్ని నీవెందుకు మరిచిపోతున్నావు...నాకు వయస్సు చెల్లిపోయింది. నాలో, మీలాంటి యువక రక్తం లేదు. నాకున్న అధికారాలని వినియోగించి దీనిని ప్రచురించిన తరువాత, మన యజమానికి నా పని నచ్చకపోతే నేను ఈ సీట్లో ఉండడానికి బదులుగా రోడ్లో నిలబడాల్సి వుంటుంది. నేను భార్యపిల్లలు కలవాణ్ని. పెళ్ళికెదిగిన ఇద్దరు ఆడపిల్లలున్నారు. ఈ వుద్యోగంపోతే నేను వాళ్ళ వివాహం ఎలా చేయగలను...నువ్వే ఆలోచించు...ఈ రిపోర్టు ప్రింటయిన మరుక్షణం నగరంలో పెనుతుఫాన్ వీస్తుంది. ఇందులో కొందరి ప్రభుత్వోద్యోగుల పేర్లు కూడా వున్నాయి. వాళ్లు ప్రమాణాలు అడుగుతారు. పత్రిక పై డజన్‌కి పైగా మానసష్టం దావా లేస్తారు. ఈ రిపోర్టువల్ల షాక్ తిన్నవాళ్ళందరూ...ప్రెస్‌ని తగలబెడతారు... అప్పుడు ఈ పత్రికా వుండదూ...ఈ సంపాదకుడూ వుండడు. ఈ రిపోర్టుని ప్రచురించడం ఎంత అపాయమో ఇప్పుడు నీవే గంభీరంగా ఆలోచించు..." సంపాదకుడు ఆగాడు.

"నా యీ రిపోర్టు చూసి మీరు ఎగిరిపడతారనుకున్నాను," విమల్ నెమ్మదిగానే అన్నాడు. "మీరు నన్ను మెచ్చుకుంటారనీ, దాంతో నా పరిశ్రమకి ఫలితం లభించిందని సంతృప్తిపడదామనుకున్నాను...ఎనీ హౌ...ఈ రిపోర్టు తప్పక ప్రింటవుతుంది. మీరు కాకుంటే మరొకరు ప్రింట్ చేసుకుంటారు...ఎవరూ ప్రచురించకుంటే నేను స్వయంగా ప్రచురిస్తాను. నిజాన్ని ప్రజలకు తెలుపుతాను. ఇందులో నా ప్రాణంపోయినా సరే!"

సంపాదకుడు ఏదో ఆలోచించాడు.

"నాకొక్క క్షణం టైమివ్వు. ఈ విషయం యజమానితో మాట్లాడుతాను."

విమల్ ఒక్క క్షణం ఆలోచించి "ఆల్ రైట్" అన్నాడు.

"నే నిప్పుడే ఆయనతో టెలిఫోన్‌లో మాట్లాడుతాను. ఆయన రమ్మంటే ఈ రిపోర్ట్ తీసుకుని ఆయన వద్దకు వెళతాను" అని టెలిఫోన్ అందుకున్నాడు.

అయిదు నిముషాలు ఫోన్‌లో మాట్లాడి, "విమల్! ఆ రిపోర్ట్ తీసుకుని నీవు ఇప్పుడే యజమానివద్దకు వెళ్లు... ఆయన నిన్ను చూడాలనుకుంటున్నారు."

"నే నెందుకు?"

"ఆ రిపోర్ట్‌లో ఏమయినా అనుమానాలుంటే నువ్వే వాటిని తీర్చగలవు. అందుకనే నిన్నే రమ్మంటున్నారు."

"మంచిది. నే నిప్పుడే వెళతాను" బ్రీఫ్‌కేస్ అందుకుని బయటకు నడిచాడు విమల్.

## 4

రాత్రి ఎనిమిది గంటలయింది. కాని హిల్‌రోడ్‌పై అప్పుడప్పుడు ఒకటి, అరా కార్లు వస్తూ పోతున్నాయి.

అది ఘాట్‌రోడ్. చలికాలం కావటం వలన మంచు కురు

స్తూంది. కారు హెడ్ లైట్స్ వెలిగించినా కూడా ఎక్కువ దూరం స్పష్టంగా కనిపించటం లేదు.

విమల్ అతి జాగ్రత్తగా కారు నడుపుతున్నాడు.

అతనికి అప్పుడే కుడివైపునుండి మరోకారు వస్తూ కనిపించింది. అది అతివేగంగా హెడ్ లైట్స్ లేకుండా వస్తూంది. అది విమల్ కారుని దాటుకుని అకస్మాత్తుగా ఎడమవైపుకి రాసాగింది.

విమల్ కంగారుపడ్డాడు. అతను బలంగా బ్రేక్ నొక్కి స్టీరింగ్ ని కుడివైపుకి తిప్పాడు. అతనికారు కుడివైపు పల్లంలో పడబోయి వెంట్రుకవాసిలో తప్పుకుంది.

పెద్దకారు ఇప్పుడు విమల్ కారుకి ఎడమ వైపు నేరుగా రాసాగింది.

విమల్ తన కారుని ఆపాడు. అతని శరీరం జలదరించింది. కారు పల్లంలో పడివుంటే...అనుకోగానే అతనిగుండె అదిరింది.

"రాస్కెల్; బాగా తాగినట్లున్నాడు. హెడ్ లైట్స్ కూడా ఆన్ చేయలేకున్నాడు" ఆ కారు డ్రయివర్ని మనస్సులోనే తిట్టాడు.

విమల్ మళ్ళీ కారు స్టార్ట్ చేశాడు. అతనతికష్టంగా ఒక ఫర్లాంగు దూరం వెళ్ళేసరికి పెద్దకారు మళ్ళీ ప్రత్యక్షమయింది. అది అతివేగంగా విమల్ కారు సైడుని గుద్దుతూ ముందుకి దూసుకుపోయింది. విమల్ కారు కుడివైపు హెడ్ లైట్ అద్దం ముక్కలు ముక్కలయింది. మళ్లీ ఒకసారి కారు పల్లంలో పడబోయి తప్పుకుంది.

విమల్ గుండెకాయ కుత్తుకలోకి వచ్చింది. తన కారుని కావలనే ఎవరో పల్లంలోకి తోసే ప్రయత్నం చేస్తున్నారని అతనికి అర్థమయింది. ఎవరో తనని హత్యచేసే ప్రయత్నం చేస్తున్నారు.

రోడ్డు నిర్మానుష్యంగావుంది. ఎటువైపునుండికూడా సహాయం లభించే ఆశలేదు.

విమల్ కారుని బాక్ చేసి ఆపాడు. స్టీరింగ్ వీల్ని తప తపలాడిస్తూ దీర్ఘంగా ఆలోచించసాగాడు. కారుని ముందుకి నడిపించే ధైర్యం కలగటం లేదతనికి.

అప్పుడే వెనుకనుండి ఏదో కారు వస్తున్నట్లుగా లైట్ల వెలుగు కనిపించింది. విమల్ వెంటనే కారుదిగి రోడ్డుకి అడ్డంగా నిలబడి ఆ కారుని ఆపే ప్రయత్నం చేశాడు. కాని ఆ కారు రివ్వున దూసుకుపోయింది. ఆ వెనుక మరో ట్రక్ వస్తోంది...దాన్నికూడా ఆపే ప్రయత్నం చేశాడు. అది ఆగ లేదు.

అప్పుడే ఎదుటినుండి మరోకారు వస్తూంది. దాన్నయినా ఆపాలని రోడ్డుకి అడ్డంగా నిలబడ్డాడు.

ఆకారు పదిగజాలకి దూరంలోకి రాగానే అది ఇంతకు ముందు తన కారుని గుద్దిన కారేనని గుర్తించి చురుగ్గాపక్కకి తప్పుకున్నాడు. కాకుంటే ఆ కారుక్రింద పడి నలిగేవాడు.

ఆ కారు కొంచెం ముందుకి వెళ్ళగానే కారులోంచి రివాల్వర్ పేలింది. గుండు విమల్ తలపైనుండి దూసుకుపోయింది.

విమల్ వెంటనే తన కారువైపు పరుగెత్తాడు. వెనుకనుండి మళ్ళీ రివాల్వర్ పేలింది. అప్పటికే విమల్ కారులోకి చేరుకుని ఆక్సిలేటర్ బలంగా నొక్కాడు.

కారు ఒక్క ఉదుటున ముందుకురికింది. పిచ్చివాడిలా తన కారుని పరుగెత్తించసాగాడు. అతని కారు రోడ్డు వారగా వుంచిన ఖాళీడ్రమ్ములని గుద్దుకుంటూ ముందుకి పోతోంది. విమల్ దృష్టి ఉండిఉండి రియర్‌వ్యూ మిర్రర్‌పై పడుతోంది.

ఉన్నట్లుండి వెనుక హెడ్‌లైట్లు కనిపించాయి. ఆకారుని గుర్తించాడు విమల్. ఆక్సిలేటర్‌పై అతనికాలి ఒత్తిడిఎక్క

తయింది. వెనుక కారులోనివాళ్ళు హెడ్ లైట్లు ఆర్పేశారు. దాంతో రియర్ వ్యూ మిర్రర్ లో ఆ కారు కనిపించడంలేదు.

ముందురోడ్డుపై ఒక అపాయకరమైన మలుపుంది. రోడ్డుకి కుడివైపు ఎత్తయిన గుట్టవుంది. ఎడమవైపు లోతైన పల్లం వుంది. విమల్ తన కారుని కుడివైపుకోసాడు. వెనుక కారు విమల్ కారుకి సరిగ్గా బుల్లెట్ లా వెనుక దూసుకువస్తూంది.

విమల్ సడన్ గా బ్రేకులు వేశాడు.

వెనుకవస్తున్న కారు విమల్ కారు ప్రక్కనుండి దూసుకు పోయి విమల్ కారుకి ఎదురుగా గోడలా నిలబడింది. విమల్ కారు బలంగా ఆ కారు సైడుకి గుద్దుకుంది. దాంతో ఆ కారు విపరీతంగా ఊగిసలాడింది. ఆ కారులోంచి ఎవరో చావు కేక పెట్టారు.

తనకారు ఆ కారుకి గుద్దుకోగానే 'ధఢామ్!' అన్న శబ్ద మయింది. విమల్ కారు విండ్ స్క్రీన్ ముక్కలు ముక్కలు అయి విమల్ పై పడ్డాయి. విమల్ ఛాతీ బలంగా స్టీరింగ్ వీల్ కి గుద్దుకుంది. మరుక్షణం తను గాల్లో తేలిపోతున్నట్లు అనుభూతి పొందాడు విమల్. క్రమక్రమంగా అతనికి స్పృహతప్పింది.

అతనికి తిరిగి స్పృహ వచ్చేసరికి ఒక ఎస్. ఐ., ముగ్గురు కానిస్టేబుల్స్ తన్ను చుట్టుముట్టి వుండటం గమనించాడు విమల్. అతని హిందూస్తాన్ వెనుక ఒక పోలీస్ జీపు నిల బడివుంది.

ఒక కానిస్టేబుల్ విమల్ చేయిపట్టి బయటకు లాగాడు. పెద్దకారు నానుకొని ఒకవ్యక్తి నిలబడివున్నాడు. లెదర్ జాకెట్ వుందతని శరీరంపై. అతని తలపైనుండి రక్తం కారుతోంది. ఆ కారుకి రెండవవైపున్న తలుపు తెరుచు కుంది. ఒక కానిస్టేబుల్ ఆ కారుకి అటువైపువెళ్ళి టార్చి వెలుగుని పల్లంలోకి ప్రసరింపచేశాడు.

టార్చి వెలుగులో క్రింద ఒక వ్యక్తి పడివుండటం కనిపించింది విమల్ కి.

సబ్ ఇన్స్పెక్టర్ సంకేతంపై అతను కిందికిదిగాడు. ఆ కానిస్టేబు లా వ్యక్తిని పరీక్షించి "ఇతనింకా బ్రతికివున్నాడు సార్!" క్రిందనుండే అరిచాడు.

"ఇక్కణ్నుంచి కొంచెందూరంలో ఒక బంగళావుంది. అక్కడికి వెళ్ళి అంబులెన్స్ కి ఫోన్ చేసిరా..." మరో కానిస్టేబుల్ ని చూసి ఆదేశించాడు ఇన్స్పెక్టర్.

కానిస్టేబుల్ వెళ్ళిపోయాడు.

"మీకెక్కడ దెబ్బలు తగిలాయి?" ఇన్స్పెక్టర్ అవతల వ్యక్తిని అడిగాడు.

"తలపై బలమయిన గాయాలయినాయి."

"మీకు?" విమల్ ని ప్రశ్నించాడు.

"అక్కడక్కడ గీసుకుపోవడం తప్ప బలమైన దెబ్బలు తగల్లేదు."

"ఆక్సిడెంట్ ఎలా జరిగింది?"

విమల్ ఏదో చెప్పబోతూండగానే అవతలివ్యక్తి గబగబ చెప్పసాగాడు. "ఇతను బహుశా బాగా త్రాగివున్నట్లున్నాడు. ఇతను తన కారుని మా కారుకి గుద్దాడు. దాంతో నా ఫ్రెండ్ కూర్చున్నవైపు తలుపు తెరుచుకుని బయటపడిపోయాడు."

"ఇన్స్పెక్టర్!" విమల్ అరిచాడు. "ఇతను..."

"మీరు కొంచెంసేపు నోరుమూసుకోండి," ఇన్స్పెక్టర్ గద్దించాడు.

విమల్ మరి మాట్లాడలేదు.

"ఊఁ!" ఇన్స్పెక్టర్ అవతలివ్యక్తిని చూస్తూ అన్నాడు.

"ఈ మనిషి మొదటినుండీ కారుని చాలా డేంజరస్ గా నడుపుతున్నాడు..." అతను మళ్ళీ చెప్పసాగాడు. "ఒకటి

రెండు మైళ్ళ వెనుక ఇతను తన కారుని ఒక చెట్టుకిగూడ కుద్దాడు."

"హుం!"

"ఇన్స్పెక్టర్; ఇతను..." విమల్ అన్నాడు.

"కొంచెం ఊరుకుంటారా?"

"ఎందు కూరుకోవాలి?" విమల్ అరిచాడు. "మీరు నేను చెప్పేది ఎందుకు వినటంలేదు?"

"ఏం చెప్పాలనుకుంటున్నారు?" ఇన్స్పెక్టర్ అడిగాడు.

"ఇతను అబద్ధం చెబుతున్నాడు" విమల్ చెప్పసాగాడు. "నేను త్రాగిలేను. ఇతను, ఇతని ఫ్రెండు కలిసి నన్ను హత్యచేయడానికి ప్రయత్నంచేశారు. నా కారుని పల్లం లోకి తోసెయ్యాలని చూశారు. నాపై రివాల్వర్ కూడా పేల్చారు. ఈ ఆక్సిడెంట్ కూడా వీళ్ళే చేశారు. నన్ను క్రిందికి తొయ్యాలని నా కారుకి అడ్డం వచ్చారు. కాని కారు వారి కంట్రోల్ నుండి తప్పిపోయి పల్లంలోకి పడబోయి ఆగింది. ఆ విసురుకే అతని ఫ్రెండ్ క్రిందపడి వుంటాడు."

"నాన్ సెన్స్" అతను అరిచాడు. "ఇతను అబద్ధం చెబు తున్నాడు. ఇతణ్ని హత్యచేస్తే మాకు ఒరిగేదేమిటో?"

ఇన్స్పెక్టర్ ఒకక్షణం అతన్ని చూసి విమల్ వైపు తిరిగి ప్రశ్నించాడు. "నీవు తాగలేదు కదూ!"

"లేదు."

"ఇప్పుడే తెలుస్తుంది..." ఇన్స్పెక్టర్ అన్నాడు. "ఏయ్ టూనాట్ సిక్స్, త్రీఫార్టిఫోర్, బాబుగారి చేతులు పట్టుకోండి..." కానిస్టేబుల్స్కి ఆదేశించాడు.

ఇద్దరు కానిస్టేబుల్స్ విమల్ని గట్టిగా పట్టుకున్నారు.

లెదర్ జాకెట్ తొడుక్కునతను తన జేబులోంచి ఒక బాటిల్ తీసి ఇన్స్పెక్టర్కి అందించాడు.

విమల్ నేత్రాలు విస్ఫారితమయ్యాయి. వాళ్ళ పట్టు

నుండి తప్పుకోవాలని ప్రయత్నం చేయసాగాడు.

"ఏయ్...ఏయ్... ఏమిటి మీరు చేస్తున్నది..." విమల్ గొంతు చించుకుని అరిచాడు— "మీరు...మీరు...పోలీసులా... లేక..."

ఇన్‌స్పెక్టర్ బాటల్‌ని బలవంతంగా విమల్ నోట్లో కుక్కి వంపుతూ ముక్కు మూసాడు.

విమల్ శ్వాస పీల్చడానికి విలవిల్లాడసాగాడు... నోటిలో పీల్చే ప్రతి శ్వాసతోపాటు ఒక్కొక్క చుక్క విస్కీ అతని గొంతుకలోకి దిగసాగింది. సగానికి పైగా బాటిల్ ఖాళీ కాగానే ఇన్‌స్పెక్టర్ బాటిల్ తొలగించి... "మిస్టర్, బాగా తాగి రాష్ డ్రయివింగ్ చేస్తున్న నేరంపై నిన్ను అరెస్ట్ చేస్తున్నాను," అన్నాడు ఇన్‌స్పెక్టర్.

## 5

"విమల్! ఇటు నా కళ్ళలోకి చూడు," పోలీసు హెడ్‌క్వార్టర్స్‌లో విమల్‌ని కలిసిన నిర్మల్ కుమార్ అన్నాడు. వాళ్ళిద్దరిని తన గదిలో కలవడానికి అవకాశం కల్పించిన సూపరింటెంట్ శంభూప్రసాద్ తనుకూడా బయటకు వెళ్ళిపోయాడు.

విమల్ తలఎత్తి నిర్మల్ కుమార్ కళ్ళలోకి చూశాడు. విమల్ కళ్ళలో నైరాశ్యం అలుముకుని వుంది.

"నిరాశపడక" నిర్మల్ కుమార్ సానుభూతిగా విమల్ భుజం తడుతూ అన్నాడు.

"నీవు చెబుతున్నది నిజమే అయితే నిన్నెవరూ ఏమీ చేయలేరు. అంతా అదే సర్దుకుంటుంది."

"నిర్మల్, నేను చెబుతున్నది నిజం. నన్నిందులో ఇరికించారు. బిలీవ్ మీ..."

"విమల్ నీవు చెప్పే ప్రతిమాటను నేను నమ్ముతాను..."

"నేనూ నిన్ను నమ్ముకుని వున్నాను," విమల్ ఆశగా అన్నాడు.

"నీవు కంగారు పడక. నాలో ఏ లోపమూ లేకుండా ప్రయత్నం చేస్తాను."

విమల్ మాట్లాడలేదు.

"ఇంతకీ ఏం జరిగింది?" నిర్మల్ అడిగాడు.

"మొన్న నీతో ఫోన్‌లో మాట్లాడిన తరవాత నేను ఆఫీస్‌కి వెళ్ళాను. మా ఎడిటర్ నా రిపోర్ట్ చూసి మా యజమానిని కలవమన్నాడు. మధ్యాహ్నం మూడు గంటలకు నేను మా యజమాని ఇంటికి వెళ్ళాను.

ఆయన నా రిపోర్ట్‌ని చూసి గుడ్లెళ్ళ బెట్టాడు. తరువాత అతను నా జీతం పెంచుతున్నాననీ... ఈ రిపోర్ట్ ప్రెస్‌కి పోదని నా ముందు నోట్లకట్టలు గుమ్మరించాడు. ఆ తరువాత బెదిరించాడు. కాని నేను దేనికీ లొంగలేదు.

దాంతో అతను నా నిజాయితీని మెచ్చుకుంటూ పొగిడాడు. ఎవరికి బెదరక ఒక నెల రోజులుగా శ్రమపడి ఆ రిపోర్ట్ తయారు చేసినందుకు నాకు మూడు నెలల జీతం రెమ్యూనరేషన్ ఇస్తానన్నాడు. అందులో మరికొన్ని మార్పులు చేసి తను ఎడిటర్‌కి పంపుతానని రిపోర్ట్ తనవద్దనే వుండనివ్వమన్నాడు.

నేను సరేనని బయల్దేరాను...

ఆయన ఇల్లు నగరానికి ఎనిమిది మైళ్ళ దూరంలో తయారవుతున్న 'శ్రీనగర్' కాలనీలో వుందని నీకూ తెలిసి వుంటుంది. నేను బయలుదేరేటప్పటికి సాయంత్రం ఏడున్నర అయింది. మా యజమానే నన్ను కావలని అంతవరకు ఆపాడని పిస్తుంది. దారిలో జరిగిందేమిటో నీకూ ఇంతకు ముందే చెప్పాను."

అని నిట్టూర్చాడు విమల్.

"నిన్న నేను మీ యజమానిని కలిశాను. అతను నీవక్కడకు రానేలేదంటున్నాడు. విమల్ అనే రిపోర్టర్ వస్తున్నట్లు ఎడిటర్ ఫోన్ చేసి చెప్పిన మాట మాత్రం నిజమేకాని, నా వద్దకు విమల్ రాలేదు, అతనెలా వుంటాడో కూడా నాకు తెలియదు, అని అంటున్నాడతను. నేను రహస్యంగా ఆ ఇంటి నౌకర్లనుకూడా విచారించాను. కాని ఎవరూ నీ వక్కడికి వచ్చినట్లు చెప్పటంలేదు."

"యజమాని ఏది చెప్పమంటే నౌకర్లు అదే చెబుతారు. అస్క్రాండ్రల్ కూడా వీళ్ళలో కలిసిపోయి వుంటాడు. అందుకే ముందు లంచమిచ్చి నా నోరు మూయించాలనుకుని వుంటాడు. అలా కాకుండేసరికి నా నోరు శాశ్వతంగా మూయించాలని చూశాడు. కాని అనుకోకుండా వాళ్ళ మనిషే ఆక్సిడెంటుకి గురయి... హాస్పిటల్ లో మరణించడంతో, ఆ హత్యానేరాన్ని నాపై రుద్దడానికి మరోమంచి అవకాశం దొరికింది" విమల్ అన్నాడు.

"నీవు నన్ను కలవాలన్నావట... ఎందుకు?" నిర్మల్ అడిగాడు.

విమల్, నిర్మల్ కుమార్ కి దగ్గరగా జరిగాడు. "నిర్మల్! ఇంకా సమయముంది. ఇప్పుడు కూడా ఆ పెద్దమనుష్యుల గుట్టు బట్టబయలు చేయవచ్చు. నేను చేయలేని పనిని నీవు పూర్తిచేయి. నా ప్రాణం పోవచ్చు. కాని నా సవమేమిటో బయటకు రావాలి. ఆపని చేయాలి గురూజీ!" విమల్ ఉత్తేజంగా అన్నాడు.

"ఇప్పుడెలా సంభవం? ఆ రిపోర్టుని మీ యజమాని పట్టాభిరాం సర్వనాశనం చేసేసి వుంటాడు. ఇప్పుడేం చేయగలం??"

"ఆ రిపోర్టుని మళ్ళీ తయారు చేయవచ్చు..." మెల్లగా

అన్నాడు విమల్.

"ఎలా?"

"ఆ రిపోర్ట్ కార్బన్ కాపీ, నెగెటివ్స్, కొన్ని ఫొటోగ్రాఫ్స్ ఇంకా సురక్షితంగా వున్నాయి" విమల్ మరింత మెల్లిగా అన్నాడు.

"ఎక్కడ...?" నిర్మల్ కుమార్ ఉలికి పడ్డాడు.

"నా స్నేహితుని వద్ద వుంది... నేను ఫొటో తీసిన్నాడు రాత్రే ఈ రిపోర్ట్ తయారుచేసి దానికి సంబంధించిన డూప్లికేట్ మెటీరియల్ ఒక సూట్ కేస్‌లోవుంచి, ఒక ఫ్రెండ్ వద్ద వుంచాను. ఆ విషయం ఇంకా శత్రువులకి తెలియదు."

"నీవలా ఎందుకు చేశావు?"

"శత్రువులు నా ఇల్లుగాలిస్తారేమోననే అనుమానంతో ఆపని చేయాల్సి వచ్చింది."

"అందులో ఏముందో నీ మిత్రునికి తెలుసా?"

"తెలియదు."

"ఈ విషయం నీవు ముందు నాకెందుకు చెప్పలేదు?"

"ఆ అవకాశం రాలేదు. ఈ విషయం ఇతరులకి తెలియడం నా కిష్టంలేదు. ఈ విషయం శత్రువులకు తెలిసిందంటే నా స్నేహితుని ప్రాణాలకి అపాయం సంభవించవచ్చు."

"ఎవరా స్నేహితుడు?"

"నేనతని పేరు చెప్పను. నా మూలంగా అతను ఆపదల్లో ఇరుక్కోవడం నా కిష్టంలేదు."

"ఇది సూపరింటెంట్ గారి ఆఫీస్. ఇక్కడ ఇతరులెవరున్నారు?"

"అయినా సరే! పేరు చెప్పను. పేరు చెప్పకుండానే పని అవుతుంది."

"ఎలా?"

"నిన్న పోలీసులు నన్ను మేజిస్ట్రేట్ ముందు హాజరు

పరిచారు. కోర్టులోకి నా పరిచయస్తు లెందరో వచ్చారు. అందులో అతనుకూడా వున్నాడు. నా డిఫెన్స్ లాయరు చెప్పటం వలన పోలీసులు నన్ను రెండు నిముషాలు ఆ మిత్రు నితో మాట్లాడే అవకాశం కల్పించారు. ఆ సూట్ కేస్ ని నీ కందచేయమని అతనికి నేను చెప్పాను.''

''అత నెప్పుడు వస్తాడు?''

''ఏమో! మొత్తానికిఅత నా సూట్ కేస్ ని నీకందచేస్తాడు.''

''సరే! నేనతని గురించి ఎదురు చూస్తుంటాను.''

''నా క్షేమాన్ని కోరేవాడివే అయితే తప్పకుండా ఆ రిపోర్ట్ ప్రింటయ్యేలా చూడు.''

''తప్పకుండా! ఆ విషయంలో నీవింక నిశ్చింతగావుండు.''

''ఈ విషయంలో ఎవరినీ నమ్మకర్దు... నాకు జరిగిన అను భవం తర్వాత నాకు ప్రతిఒక్కడూ వంచకుడిలాగే అగుపి స్తున్నాడు,'' విమల్ బరువుగా అన్నాడు.

''నేనుకూడానా?'' నిర్మల్ నవ్వుతూ అన్నాడు.

''నిర్మల్!'' విమల్ అన్నాడు. ''ప్రతిక్షణం అప్రమత్త తతో వుండు. ఆ రిపోర్ట్ కి మరో కార్బన్ కాపీ వుందనీ, అది నీవద్దకు చేరిందని వాళ్ళకు తెలిసిందంటే వాళ్లు నిన్నుకూడా వదలరు. జాగ్రత్త.''

''మంచిది. ఇక నేను వస్తాను,'' అని లేచాడు నిర్మల్ కుమార్.

# 6

నిర్మల్ కుమార్ బరువుగా కళ్ళు తెరిచాడు.

అతని కళ్లు విపరీతంగా మండుతున్నాయి. తల గిర్రున తిరుగుతున్నట్లుంది. వెనక భాగంలో సూదులుపెట్టి పొడిచి నట్లు బాధగావుంది. ఎడమ చేత్తో తల వెనుక భాగాన్ని తడుముకున్నాడు. నిమ్మకాయ ఆకారంలో వెనుక భాగంలో

బొడిపికట్టింది.

టైం చూసుకున్నాడు. అర్ధరాత్రి దాటింది. జరిగిందేమిటో జ్ఞప్తికి తెచ్చుకోసాగాడు.

ఆ సాయంత్రం ఆరు గంటల ప్రాంతంలో తనకు సాగర్ వద్దనుండి ఫోన్ వచ్చింది. తనపేరు 'సాగర్' అని, విమల్ సూట్ కేస్ తనవద్ద వుందనీ, విమల్ చెప్పటంవల్ల అతను దానిని తనకందచేయడానికి రాత్రి తొమ్మిది గంటలకు వస్తున్నానని ఫోన్ చేశాడు. తానతని రాకకోసం ఎదురు చూస్తూ కూర్చున్నాడు.

రాత్రి ఎనిమిది గంటల ప్రాంతంలో మళ్ళీ ఒక ఫోన్ వచ్చింది. ఈసారి తన మిత్రుడు జయరాం ఫోన్ చేశాడు. ఏర్ పోర్ట్ ప్రాంతంలో ఎవరో ఒకతణ్ని కాల్చి చంపారని, హతుడు మరణించే ముందు. తనపేరు, విమల్ పేరు కలవరించాడట. అప్పుడక్కడున్న జయరాం ఆ విషయం తెలిసి తనకి ఫోన్ చేస్తున్నాడట. హతుడు పేరేమిటని తానడిగిన దానికి 'సాగర్' అని జవాబిచ్చాడు జయరాం.

అది వినగానే తాను ఆదరా, బాదరాగా ఏర్ పోర్ట్ వైపు జయరాం చెప్పిన స్థలానికి బయలుదేరాడు. కాని తానక్కడికి చేరుకునేసరికి ఏ విధమయిన కోలాహలమూ, హత్య జరిగిన సూచనలు లేవు.

తానటు, ఇటు చూస్తుండగానే ఒకతను తనవద్దకు వచ్చి జయరాంని చూపిస్తానని తనను ఏర్ పోర్ట్ కి దూరంగా కారులో తీసుకెళ్ళాడు. చాలా దూరం వెళ్ళిన తరువాత అతను తనని క్రిందకి దిగమని స్పృహ తప్పేలా తలపై కొట్టాడు.

ఆ తరువాత ఇప్పుడే కళ్లు తెరుస్తున్నాడు తను.

అతికష్టంగా ఏర్ పోర్ట్ వరకు నడిచివచ్చి, పార్కింగ్ లో వున్న తన మోటర్ సైకిల్ పైకెక్కి తన ఫ్లాట్ వైపు సాగాడు నిర్మల్ కుమార్.

తన ఫ్లాట్ తాళం తీయబోయి ఆగాడు నిర్మల్ కుమార్.

తలుపులు దగ్గరగా చేరవేసి వున్నాయి. ఆశ్చర్యంగా వాటికేసి చూశాడు. నెమ్మదిగా తలుపు తీశాడు. తలుపులు తెరుచుకున్నాయి. లోపలంతా చీకటిగా వుంది. తన ఫ్లాట్ తలుపు లెవరు తెరిచారో, లోపల ఎవరయినా వున్నారో లేదో, అర్థం కావడంలేదు.

"లోపల ఎవరు?" నిర్మల్ కుమార్ బిగ్గరగా అడిగాడు.

లోపలినుండి ఏ విధమయిన జవాబు రాలేదు.

జాగ్రత్తగా లోపలకు అడుగుపెట్టాడు నిర్మల్ కుమార్.

ఆ చీకట్లోనే అలవాటైన అతనిచేతులు ఎలక్ట్రిక్ స్విచ్ నొక్కాయి. లైట్ వెలగ్గానే, ఆ ట్యూబ్ లైట్ వెలుగులో అతని దృష్టి కేన్ చేర్ ప్రక్కగా క్రింద బోర్లా పడివున్న శవంపై పడింది. నిర్మల్ కుమార్ ఆశ్చర్యంగా చూశాడు శవం వైపు.

అటు తరువాత అతని దృష్టి డ్రాయింగ్ రూమంతటా కలియ తిరిగింది.

మదించిన మత్తేభాలు కొలనుని కల్లోల పరచినట్లుంది అతని డ్రాయింగ్ రూం పరిస్థితి. తన ఏ వస్తువుకూడా తన స్థానంలోలేదు. ఎవరో ఆ గదిని క్షుణ్ణంగా గాలించి వదిలారు.

నిర్మల్ కుమార్ శవం వద్దకు చేరుకున్నాడు. అతను మోకాళ్ళపై కూర్చుని శవం ముఖం చూశాడు.

హంతకుడు నిర్మల్ కుమార్ కి పూర్తిగా అపరిచితుడు. అతనింతకు ముందెప్పుడూ హతుని ముఖంకూడా చూల్లేదు. అతని మెడపై 'స్పైనల్ కార్డ్'ని ఛేదిస్తూ పిడివరకు ఛురిక దిగబడి వుంది.శవంక్రింద రక్తం మడుగులా పేరుకుంది. చాలా భాగం గడ్డకట్టడం మూలంగా రక్తం నల్లరంగులోకి మారింది.

శవంవున్న స్థితినిబట్టి చూస్తే హత్యజరిగి అయిదారుగంట

లయినట్లుంది.

శవం జేబులు వెదికాడు నిర్మల్ కుమార్. అన్ని జేబులు ఖాళీగా వున్నాయి. శవానికి కొంచెం దూరంలో ఒక పర్స్ పడివుంది. దాన్నందుకు చూశాడు. లోపల హంతుని ఫోటో వుంది. దానిక్రింద 'సాగర్' అని వ్రాసివుంది.

విమల్ తనకిచ్చిన సూట్ కేస్ ని నిర్మల్ కుమార్ కి అందించడానికి తొమ్మిది గంటలకు వస్తానని చెప్పింది అతనే... సాగర్ హత్య జరిగిందని తనని మోసం చేయటం ద్వారా అలాంటి దేదయినా జరగవచ్చని స్ఫృహ వచ్చిన వెంటనే అనుకున్నాడు నిర్మల్.

మరోసారి శవాన్ని పరీక్షగా చూసి, టెలిఫోన్ అందుకుని పోలీసులకి ఫోన్ చేశాడు.

అరగంటకంతా పోలీసులు తమ బలగంతో వచ్చారు. ఇన్ స్పెక్టర్ నిర్మల్ కుమార్ని ఒక ప్రక్కగా కూర్చోమనడంతో, తన బెడ్ రూంలో సిగరెట్స్ పీలుస్తూ కూర్చున్నాడు.

ప్రభాకరుని ప్రథమ కిరణాలు ప్రసరించే సమయానికి ఇన్ స్పెక్టర్ తనపని ముగించి సాగర్ శవాన్ని మార్చురీకి పంపించి, నిర్మల్ కుమార్ ప్రక్కగా మరో చేర్ లాక్కుని కూర్చుంటూ అడిగాడు.

"ఊఁ! ఇప్పుడు చెప్పండి మీరు చెప్పదలచుకున్న దేమిటో?"

జరిగిందేమిటో క్లుప్తంగా చెప్పాడు నిర్మల్ కుమార్.

"సాగర్ మిమ్మలను కలవడానికి వస్తున్నాడని మీకు తప్ప ఇంకెవరికయినా తెలుసా?"

"తెలియదు! నేనుకూడా ఇంతకు ముందెప్పుడూ ఇతన్ని చూడ్లేదు. నా ఫ్రెండ్ విమల్ ఇతని గురించి చెప్పాడు. కాని, రాత్రి తొమ్మిది గంటలకు ఇతను నావద్దకు వస్తున్న విషయం విమల్ కికూడా తెలియదు."

"ఊహుఁ! హంతకునికి కూడా ఈ విషయం తెలుసు. అందుకే అతను మిమ్ములను బయటకు రప్పించి సాగర్ రాగానే అతణ్ని హత్యచేశాడు. కాని హంతకుడికి ఈవిషయం ఎలా తెలిసింది?"

"నేనెలా చెప్పగలను. నాకే ఆశ్చర్యంగా వుంది... ఆఁ! హంతకుని కీ విషయం తెలిసేందుకు రెండే పద్ధతులున్నాయి. ఒకటి సాగర్ తనే ఎవరికయినా చెప్పివుండాలి, లేదా నా ఫోన్ ఎవరైనా టాప్ చేసి వుండాలి. నాకెందుకో రెండవదే సంభవమనిపిస్తుంది..." నిర్మల్ కుమార్ ఏదో ఆలోచిస్తూ అన్నాడు.

"రెండవది మాత్రం ఎలా సంభవమంటారు?"

"ఒకవేళ విమల్ చెప్పిందే నిజమయితే అది సంభవమే! శత్రువులు చాలా తెలివయిన వాళ్ళు. పోలీసులే వాళ్ళతో కలిసివుంటే, టెలిఫోన్ ఎక్స్ఛేంజి వాళ్లు కలిసిలేరని ఎలా అనుకోగలము?"

"ఊహుఁ! నేనలా అనుకోను. బాధ్యతగల ఒక పోలీస్ ఇన్‌స్పెక్టర్ విమల్ చెప్పినట్లు ప్రవర్తించాడంటే నాకు నమ్మకం కలగటంలేదు," ఇన్‌స్పెక్టర్ అన్నాడు.

"కాని ఒకటి మాత్రం నిజం," నిర్మల్ కుమార్ అన్నాడు. "హంతకునికి తనక్కావలసిన కాగితాలు మాత్రం లభించలేదు."

"ఆ విషయం మీరెలా చెప్పగలరు?" ఇన్‌స్పెక్టర్ అడిగాడు.

"నా డ్రాయింగ్ రూంని గాలించిన పద్ధతినిబట్టి తెలుస్తోంది?"

"ఎలా?"

"హంతకుడు నన్ను బయటకు పంపిన తరువాత, తను స్వయంగా వచ్చి నా బెడ్‌రూంలో కూర్చుని సాగర్ రాక

కోసం ఎదురు చూడసాగాడు. సాగర్ వచ్చి వున్నది డ్రాయింగ్ రూంలోనే... సాగర్ ఆ కాగితాలను తనవెంట తేనట్టుంది. ఏదైనా అనుమానం కలిగి వుంటుంది. తగిన జాగ్రత్త కోసం అతనలా చేసి వుంటాడు. హంతకుడు సాగర్‌ని హత్యచేసి అతని జేబులు వెదికాడు. అవి లభించలేదు. సాగర్ అది తెచ్చివుంటే వాటిని డ్రాయింగ్ రూంలో దాచి వుండాలన్న అభిప్రాయంతో నా డ్రాయింగ్ రూంని క్షుణ్ణంగా వెదికి, అవి లభించక పోవటంతో వెళ్ళిపో యాడు."

"ఆల్ రైట్;" ఇన్‌స్పెక్టర్ లేస్తూ అన్నాడు. "నేను నేరుగా సాగర్ ఇంటికి వెళ్తున్నాను."

"మంచిది" నిర్మల్ కుమార్ అన్నాడు.

ఇన్‌స్పెక్టర్ వెళ్ళిపోయాడు.

# 7

నిర్మల్ కుమార్ సాయంత్రం మూడు గంటలకు నిద్ర లేచాడు. కంటినిండా నిద్రపోవడం వలన, శరీరం తేలికగా వుంది. లేచి స్నానపానాదులు ముగించుకుని పత్రికాఫీస్‌కి వెళ్ళడానికి బయలుదేరాడు.

బయటకు వచ్చి ఫ్లాట్‌కి తాళంవేసి, అలవాటు ప్రకారం లెటర్ బాక్స్ తెరిచిచూశాడు. అందులో ఒక కవరుంది. కవరందుకున్న చేతికి ఒక కాగితపు ముక్క కూడా వచ్చింది. నిర్లక్ష్యంగా ఆ కాగితాన్ని తెరచి చూసిన నిర్మల్ వులిక్కి పడ్డాడు.

కవరుని జేబులో పెట్టుకుని కాగితాన్ని మళ్ళీ చూశాడు. అదొక రైల్వే స్టేషన్ క్లాక్ రూం రసీదు. దానిపై సాగర్ పేరుంది. క్లాక్ రూంలో రెండు రోజుల క్రితం ఒక సూట్ కేస్ ఉంచినట్లు రాసివుందందులో.

నిర్మల్ కుమార్ గుండెలు దడదడలాడాయి. అతనిలో మళ్ళీ ఆశ చిగురించింది. సాగర్ క్లాక్ రూంలో దాచిన సూట్ కేస్ బహుశా విమల్ దే కావచ్చు. ఆ రసీదు తన లెటర్ బాక్స్‌లో వుండటం అదే నిరూపిస్తుంది. జాగ్రత్త కోసం సూట్ కేస్‌ని క్లాక్ రూంలో దాచిన సాగర్, ఆ రసీదు తనకివ్వడానికి వచ్చి ఏదో అజ్ఞాతశక్తి ప్రేరణవల్ల ఫ్లాట్ లోకి అడుగుపెట్టే ముందు ఆ రసీదుని లెటర్ బాక్స్‌లో వేసి వుండాలి.

రసీదుని కోటులోపలి జేబులో పెట్టుకుని ఉల్లాసంగా మెట్లుదిగి తన ప్రియమయిన మోటర్ సైకిల్ 'హోండా'పై కూర్చుని స్టార్ట్ చేశాడు.

సూపర్నెంటు శంభూప్రసాద్ ఇల్లుకూడా అదే రోడ్ లో వుంది. ఆ ఇంటి ముందుగా వెళుతూ శంభూప్రసాద్ బయట వరండాలో నిలబడి వుండటం చూసి మోటర్ సైకిల్ ఆపాడు నిర్మల్ కుమార్.

"నమస్కారం సూపర్నెంటుగారూ!" నిర్మల్ కుమార్ అన్నాడు.

"నమస్కారం..." శంభూప్రసాద్ అన్నాడు. "నిన్న రాత్రి నీ ఫ్లాట్ లో హత్య జరిగిందట..."

"అవును" నిర్మల్ కుమార్ బరువుగా అన్నాడు. "ఇప్పుడు నా ఫ్లాట్ లోకే వెళ్ళడానికి నాకే భయం కలుగుతూంది."

"హతుడు విమల్ కి స్నేహితుడనీ, అతను నీవద్దకు ఏదో కాగితాలు తీసుకు వస్తానని అన్నాడట."

"అవును; అత నేవో కాగితాలు తెస్తానన్నాడు. కాని అతను ఆ కాగితాలు తేలేదనుకుంటాను. లేదా తెచ్చివుంటే దానిని హంతకులు అతనివద్దనుండి తీసుకెళ్ళిపోయి వుండాలి."

శంభూప్రసాద్ ఏదో ఆలోచిస్తూండి పోయాడు.

"సూపర్నెంట్ గారూ! ఇప్పుడయినా విమల్ చెప్పిన

వాటిలో నిజముందని ఒప్పుకుంటారా? ఆ రిపోర్ట్ని సంపాదించడానికి వాళ్ళు హత్యలు చేయడానికి కూడా వెనకాడడంలేదు."

"రాత్రి నీ ఫ్లాట్ లో జరిగిన హత్యకుకారణం అదేనన్ని చెప్పలేము కదూ?"

"అయితే మరేమయి వుంటుందంటారు?"

"ఏమో! పరిశోధన జరుగుతుంది. త్వరలోనే కారణాలతో పాటు హంతకుడు కూడా పట్టుబడవచ్చు..." శంభూప్రసాద్ అన్నాడు... "అదిసరే! నిర్మల్, నీ వుద్దేశంలో ఆ కాగితాలు అపరాధుల చేతుల్లోనే చేరిపోయి వుంటాయంటావా?"

"నేనలా అనుకోను... ఇంతకు ముందే నాకు లభించిన ఒక ఆధారాన్నిబట్టి ఆ కాగితాలు సురక్షితంగా వున్నాయనే అనుకుంటాను... అవి నా చేతికి చిక్కాయంటే విమల్ రక్షింప బడటం ఖాయం."

"నీకు లభించిన ఆ ఆధార మేమిటో నేను తెలుసుకోవచ్చా?"

తనకు లభించిన క్లాక్ రూం రసీద్ విషయం చెప్పాడు నిర్మల్ కుమార్.

"ఆ సూట్ కేస్ లో విమల్ తయారుచేసిన ఆ బాంబ్ షెల్ వుందని గ్యారంటీ ఏముంది?" శంభూప్రసాద్ అడిగాడు.

"ఏమో నేను మాత్రం వుండవచ్చనే అనుకుంటున్నాను. కాకుంటే సాగర్ వద్ద వున్న ఆ క్లాక్ రూం రసీదు నా లెటర్ బాక్స్ లో ఎందుకుంది?"

"ఇప్పుడా సూట్ కేస్ తీసుకు రావడానికి స్టేషన్ కి వెళ్తున్నావా?"

"అవును."

"పద. నేనూ వస్తాను..." శంభూప్రసాద్ తనూ బయలు దేరడానికి ఉద్యుక్తుడవుతూ అన్నాడు.

"తప్పకుండా రండి; కాని సూపరెంటెంట్ గారూ! ఆ సూట్ కేస్ ని మాత్రం నేను మీ కివ్వను."

"అదేమిటి?" శంభూప్రసాద్ అన్నాడాశ్చర్యంగా...

"నీవా సూట్ కేస్ ని తప్పకుండా పోలీసుల కందచేయాలి. దానివల్ల సాగర్ హంతకుడు ఎవరయిందీ తెలిసే అవకాశ ముంది."

"మీకసలు అందులో ఆ రిపోర్ట్ వుంటుందని నమ్మకమే లేదుకదా?"

"అయినా...దానిని పోలీసుల కందజేయడం నీ ధర్మం."

"సారీ! సూపరెంటెంట్ గారూ!" నిర్మల్ కుమార్ నిర్దయాత్మకంగా అన్నాడు. "నేను మీ కా సూట్ కేస్ విషయం...ఒక మిత్రుడిగా మీకు చెప్పానేకాని ఒక పోలీసు అధికారికి చెబుతున్నానని చెప్పలేదు. 'బ్లాస్ట్'లో రిపోర్టు ప్రచురింపబడేవరకు, మీకు ఈ విషయం అసలు తెలియనే తెలియదు." ఒక్క క్షణం ఆగి తిరిగి చెప్పాడు నిర్మల్. "మొదటగా ఆ రిపోర్ట్ ని 'బ్లాస్ట్'లో ప్రచురించిన తరువాత, దానిని పోలీసులకి అప్పగించడంలో మా కే అభ్యంతరమూ లేకుంటే అప్పుడది పోలీసులకివ్వబడుతుంది."

శంభూప్రసాద్ మరి మాట్లాడలేదు.

"నేను వెళ్తున్నాను సూపరెంటెంటుగారూ!" నిర్మల్ అన్నాడు,

"ఆల్ రైట్; నీవనుకున్నట్లుగా అందులో విమల్ రిపోర్ట్ వుంటే నాకు తెలియజేయడం మరచిపోవద్దు."

"మంచిది."

"బి కేర్ ఫుల్" వెనుకనుండి అరిచాడు శంభూప్రసాద్.

"థాంక్స్!"

నిర్మల్ కుమార్ పార్కింగ్‌లో మోటార్ సైకిల్ ఆపి స్టేషన్‌లోకి ప్రవేశించాడు. లోపలకు అడుగు పెడుతూనే అతని సిక్స్త్‌సెన్స్ అతన్ని హెచ్చరించింది.

కనీసం డజనుమంది తనను గమనిస్తున్నారని తెలుసుకున్నాడు నిర్మల్‌కుమార్. అందులో నలుగుర్ని తను మొదటి రాత్రి కాస్మాపాలిటన్ క్లబ్ కాంపౌండ్‌లో చూశాడు కూడా.

నిర్మల్‌కుమార్ జాగ్రత్తపడ్డాడు.

సూట్‌కేస్ లేకుండా వెనక్కి వెళ్ళడంకూడా అపాయకరమే! వాళ్ళు దారిలో తనపైబడి రసీదు లాక్కునే అవకాశముంది. మనస్సులోనే ఒక నిశ్చయానికి వచ్చిన నిర్మల్‌కుమార్ క్లాక్‌రూంకి పోవడానికి బదులుగా ఒకప్రక్కగా వున్న టెలిఫోన్ బూత్ వైపు సాగాడు. వెనక్కి తిరిగి చూడకుండా లోపలకు వెళ్ళి తలుపు మూసుకున్నాడు.

నిర్మల్‌కుమార్ తలుపుకి వీపు అడ్డంగా పెట్టాడు. తరువాత జేబులోంచి ఫ్లాట్ నుండి తను బయలుదేరినప్పుడు లెటర్‌బాక్స్‌నుండి తీసుకున్న కవరు తీసాడు. దానిని జాగ్రత్తగా విప్పి అందులో క్లాక్‌రూం రసీదుంచి దానిని నాలుకతో తడిపి అతికించాడు. తరువాత దానిపైనున్న తన అడ్రస్ కొట్టేసి తన పత్రిక 'బ్లాస్ట్' అడ్రస్ రాశాడు. పైన పెద్ద అక్షరాలతో 'రిడైరెక్టెడ్' అని రాసి దానిని తిరిగి జేబులో పెట్టుకున్నాడు. తర్వాత తన మిత్రుడు 'అడ్వెంచర్ క్లబ్'కి ప్రొప్రయిటర్ అయిన జయరాంకి ఫోన్ చేశాడు.

"జయరాం!" అవతలినుండి కనెక్షన్ లభించగానే అన్నాడు. "నేను నిర్మల్ కుమార్ని మాట్లాడుతున్నాను."

"హల్లో డియర్" అవతలనుండి జయరాం సరదాగా అన్నాడు.

"అబ్బా! ఎన్నాళ్ళకు? ఇంతవరకు ఏ అప్సరస చేతుల్లో వున్నావో తెలుసుకోవచ్చా?"

"ఉఫ్! జయరాం, నీకెప్పుడూ వేళాకోళమేనా... నా మాట విను..." నిర్మల్ కుమార్ గంభీరంగా అన్నాడు.

నిర్మల్ కంఠంలోని సీరియస్ నెస్ అవతల జయరాంపై వెంటనే తన ప్రభావాన్ని చూపింది.

"ఏమిటి?" అవతలనుండి జయరాం సీరియస్ గా అన్నాడు.

"ఒక సూట్ కేస్ తీసుకో..." నిర్మల్ కుమార్ చెప్పసాగాడు. "బరువుండడానికి దానిని పాత న్యూస్ పేపర్లతోనూ, చిత్తుకాగితాలతోనూ నింపి, ఒక మనిషిచేత రైల్వే స్టేషన్ కి పంపించు. అతడు దానిని క్లాక్ రూంలో పెట్టాలి. తన పేరు 'సాగర్' అని రాయించమని అతనికి చెప్పు."

"సాగర్ అని ఎందుకు రాయించాలి?"

"నో క్వశ్చన్స్... నేను చెప్పేది విను..."

"విషయమేమిటి?"

"అదంతా తరువాత చెబుతాను ఇప్పుడు టైంలేదు."

"మళ్ళీ ఏదో అందమయిన అమ్మాయి కేసేనా... బైగాడ్! నిర్మల్ ఎప్పుడో ఈ అమ్మాయిలు నీ ప్రాణం పోవడానికి కారకులౌతారు."

"ఉహూఁ! అలాంటిదేమీ కాదు."

"అయితే సరి ఆ తరువాత అతనేం చేయాలి?"

"క్లాక్ రూంకి ఎదురుగా ఒక మూల టెలిఫోన్ బూత్ వుంది, నీ మనిషి ఆ క్లాక్ రూం రసీదుని బూత్ లో వున్న టెలిఫోన్ డైరెక్టరీలో మన 'అడ్వెంచర్ క్లబ్' ఎంట్రీవున్న పేజీలమధ్య పెట్టేయాలి... అంతే ఆ తరువాత అతని పనయిపోతుంది."

"సరే; ఇప్పుడే పంపిస్తాను," అవతలినుండి జయరాం అన్నాడు.

"థాంక్యూ."

రిసీవర్ క్రెడిల్ పై వుంచి బయటకు వచ్చాడు. ఫ్లాట్ ఫాంపై తిరుగుతూ అతను లెటర్ బాక్స్ వద్దకు వెళ్ళి తను క్లాక్ రూం రసీదుంచి రీడైరెక్ట్ చేసిన కవరుని బాక్స్‌లో పడవేసి తిరిగి బూత్ వద్దకు వచ్చి కూర్చుని సిగరెట్ ముట్టించాడు.

నిర్మల్ కుమార్‌ని గమనిస్తూన్న వాళ్ళ దృష్టి ఒక్క క్షణంకూడా నిర్మల్ కుమార్ పైనుండి తప్పటంలేదు. అందరూ అప్రయత్నంగా దూరంనుండి అతడ్ని గమనిస్తున్నారు.

ఇరవయి నిముషాల తరువాత, జయరాం పంపిన మనిషి జాకబ్ సూట్ కేస్‌తో స్టేషన్‌లోకి రావడం గమనించాడు నిర్మల్. జాకబ్ అడ్వెంచర్ క్లబ్‌లో మెంబరు.

జాకబ్ క్లాక్ రూంవైపు వెళ్ళడం గమనించి అటువైపు వీపు పెట్టి కూర్చున్నాడు.

కొద్దిసేపటి తరువాత జాకబ్ ఉత్తచేతులతో క్లాక్ రూంనుండి బయటకు వచ్చాడు. అతను స్టేషన్ బయటకు వెళ్ళబోయి టక్కున ఆగాడు. ఆగి తన చేతి గడియారం చూసుకుని నొసలు చిట్లించాడు. దేన్నో గమనిస్తున్నట్లుగా చుట్టు పరికించి, టెలిఫోన్ బూత్ పై దృష్టి పడగానే అటు సాగాడు జాకబ్...

బూత్‌లోపలకివెళ్ళి ఎవరికో ఫోన్ చేశాడు. అయిదు నిముషాల తరువాత బూత్ నుండి బయటపడి నేరుగా స్టేషన్ బయటకు వెళ్ళాడు.

జాకబ్ బయటకు వెళ్ళిన రెండుమూడు నిముషాలకు నిర్మల్ కుమార్ సిగరెట్‌ని పారేస్తూలేచి బూత్‌లోకి ప్రవేశించాడు. డైరెక్టరీ అందుకుని తిప్పసాగాడు. అతనికి క్లాక్ రూం రసీదు కనిపించింది.

దాన్నందుకుని జేబులో పెట్టుకుని, అదే జేబులోంచి

చిల్లర తీసాడు. మూడు పదిపైసల నాణాలు తీసి మిగిలింది జేబులో వేసుకుని...తనకు తోచిన నెంబర్ డైల్ చేసాడు. అవతలినుండి 'హల్లో, హల్లో' అని వినిపిస్తున్నా తనకు లైన్ దొరకడం లేదన్నట్లుగా అభినయించసాగాడు. రెండు మూడుసార్లు అలాగే చేసి చివరకు విసుగ్గా రిసీవర్ని తగిలించి చిల్లర జేబులో వేసుకుంటూ బయటకు వచ్చాడు.

అతను నేరుగా ఒక టీ స్టాల్ వద్దకు వెళ్ళి టీ తాగసాగాడు. అతణ్ని గమనిస్తున్న వాళ్లు సందిగ్ధంలో పడ్డారు. తన అక్షన్ వల్ల వాళ్ళ విషయం తనకు తెలిసినట్లు ప్రదర్శించలేదు నిర్మల్ కుమార్.

నింపాదిగా టీ త్రాగి, నిర్లక్ష్యంగా క్లాక్ రూంవైపు సాగాడు.

క్లాక్ రూం రసీదుపై సంతకంచేసి రసీదుని ఇరవయిపైసలతో క్లర్క్కి అందించాడు. క్లర్క్ సంకేతంపై ఒక పోర్టర్ ఒక సూట్ కేస్ తెచ్చి నిర్మల్ కుమార్కి అందించాడు.

కొద్దిసేపటికిందట జాకబ్ తీసుకువచ్చింది ఆ సూట్ కేస్ నే...దానినందుకుని అతను నేరుగా బయటకు వచ్చాడు.

సూట్ కేస్ని అందుకుని పార్కింగ్ వైపు సాగుతున్నాడు. ఇద్దరు రౌడీలు తనకు రెండడుగుల దూరంలో వున్నారని గ్రహించాడు. అంతలోనే ఒక కారు రివ్వున దూసుకువచ్చి నిర్మల్ కుమార్ ప్రక్కన ఒక చిన్న జర్క్తో ఆగింది. ఆ మరుక్షణం ఆ కారు వెనుక తలుపులు తెరుచుకున్నాయి. ఏమిటో ఆలోచించే లోపలే రెండు ధృఢమయిన చేతులు అతణ్ని తెరిచిన తలుపుల గుండా కారు లోపలకి తోసాయి.

తడబడుతూ అతను కారులోపల పడ్డాడు. అతని

ఛాతీకి ఒక రివాల్వర్ గురిపెట్టబడి వుంది... "ఊఁ! లోప లికిరా! అరిచే ప్రయత్నం చేయవద్దు!" అతనన్నాడు.

నిర్మల్ కుమార్ లోపలకి చేరుకున్నాడు. బయటనున్న వ్యక్తి విసురుగా తలుపు మూశాడు. మరుక్షణం కారు గాలిలో పందెం వేయసాగింది. అంతా కన్నుమూసి తెరి చేంతలో జరిగిపోయింది. దుండగులు తన సూట్ కేస్ మాత్రమే లాక్కుంటారని అనుకున్నాడు నిర్మల్ కుమార్. కాని, వాళ్ళు తననుకూడా బంధించారు.

రివాల్వర్ తో తనను బెదిరించిన వ్యక్తిని చూసి, "నువ్వా?" అన్నాడు.

అతను కుటిలంగా నవ్వాడు. అతను నైట్ క్లబ్ మేనే జర్ శక్తిసింగ్.

"అయితే ఈ ట్రబుల్స్ కి కారణం నువ్వన్నమాట" నిర్మల్ కుమార్ అన్నాడు.

"షటప్! నోరుమూసుకుని కూర్చో..." శక్తిసింగ్ గద్దించాడు.

"నన్నెక్కడికి తీసుకుపోతున్నారు?"

జవాబుగా శక్తిసింగ్ రివాల్వర్ చేత్తో నిర్మల్ కుమార్ చెంపపై విసురుగా కొట్టాడు. రివాల్వర్ బారెల్ విసురుగా తగిలిందతనికి. ఆ దెబ్బకి లోపలివైపు చర్మం చిట్లి రక్తం చెమర్చినట్లుంది. అతని నాలుకకి ఉప్పగా తగిలింది.

శక్తిసింగ్ చేసిన సైగతో ముందు సీటులో డ్రయివర్ పక్కన కూర్చున్నతను నిర్మల్ కుమార్ చేతిలోంచి సూట్ కేస్ లాక్కున్నాడు.

"దీనికి తాళం వేసివుంది..." అతను సూట్ కేస్ ని పరీ క్షించి అన్నాడు.

"తాళంచెవి ఎక్కడుంది?" అడిగాడు.

"నా వద్దలేదు."

సూట్ కేస్ లాక్కున్నతను తన జేబులోంచి చిన్న కత్తిని తీసి దాని సహాయంతో సూట్ కేస్ తాళం తీసాడు. మూత తీసి లోపలకు చూస్తూనే కంగారుగా అరిచాడు "బాస్!... ఇందులో చిత్తుకాగితాలు తప్ప ఇంకేమీ లేవు."

"ఏమిటి నీవంటున్నది?" శక్తిసింగ్ గద్దించి అన్నాడు.

"మీరే చూసుకోండి!" అంటూ అతను సూట్ కేసుని శక్తిసింగ్ ముందుంచాడు.

సూట్ కేస్‌లో వున్న చిత్తు కాగితాలని, పాత న్యూస్ పేపర్లని చూడగానే శక్తిసింగ్ కళ్ళు నిప్పులు కురిపించాయి. అతను తీక్షణంగా నిర్మల్ కుమార్ వైపు చూశాడు. తరువాత ముందున్న వ్యక్తితో "కవర్" అన్నాడు.

డ్రయివర్ ప్రక్కనున్న వ్యక్తి ముందు సీటుకి, వెనుక సీటుకిమధ్యనున్న పరదాని లాగాడు. కారు కిటికీలు, వెనుక వైపు మొదటనుండే కవర్ చేయబడి వున్నాయి. కారు ఎటు వెళుతుందో తెలుసుకోవడం కష్టమయిపోయింది నిర్మల్ కి.

పావుగంట తరువాత కారు ఒకచోట ఆగింది. శక్తిసింగ్ క్రిందికి దిగే ప్రయత్నం చేయలేదు. అతని రివాల్వర్ ఇంకా నిర్మల్ కుమార్ ప్రక్క టెముకలకు ఆనించబడే వుంది. ఒక నిముషం తర్వాత డ్రయివర్ నిర్మల్ కుమార్ వైపు తలుపు తెరిచాడు.

"క్రిందికి దిగు" శక్తిసింగ్ రివాల్వర్ మొనతో పొడుస్తూ అన్నాడు.

నిర్మల్ కుమార్ కిందికి దిగాడు. తానొక గారేజ్‌లో వున్నట్లు తెలుసుకున్నాడు. కారు బోనెట్ వున్నవైపు ఒక తలుపువుంది. "ఊఁ! ముందుకి పద" శక్తిసింగ్ అన్నాడు.

నిర్మల్ కుమార్ తలుపువైపు నడిచాడు.

శక్తిసింగ్, అతని ఇద్దరు అనుచరులు కూడా నిర్మల్‌ని కవర్ చేస్తున్నారు.

# 8

అదొక విశాలమయిన గది.

ఆ గది మధ్య ఒక స్టూల్ పై నిర్మల్ కుమార్ చలికి గడ గడలాడుతూ ముడుచుకుని కూర్చుని వున్నాడు. అతని శరీరంపై కేవలం అండర్ వియర్ తప్ప మరింకేమీ లేదు. అతని ఎదురుగా వున్న ఆర్క్ లాంప్ తీవ్రమయిన ప్రకాశం తీక్షణంగా అతని ముఖంపై పడుతూ అతణ్ని కళ్ళు తెరవ నీయడంలేదు.

కుడివైపున్న మరో గది తలుపులు తెరిచివున్నాయి. ఆ గదంతా చీకటిగా వుంది. ఆ గది తలుపులవద్ద ఒక వ్యక్తి నిలబడి వున్నట్లుగా లీలామాత్రంగా తెలుస్తోంది.శక్తిసింగ్ ని కలుపుకుని ఆరుగురు వ్యక్తులు నిర్మల్ కుమార్ ని చుట్టుముట్టి నిలబడి వున్నారు.

చేతులు, కాళ్ళు ముడుచుకుని కూర్చుని వున్నాడు నిర్మల్ కుమార్.

ఎవరో వెనుకనుండి అతని జుట్టు పట్టుకుని అతని తలను పైకి లేపారు. బాధతో విలవిల్లాడుతూ నిర్మల్ కుమార్ అతని చేతులని పైకి లేపాడు.

తన జుట్టుని పట్టుకున్న చేతుల వరకు అతని చేతులు చేరక ముందే ముందున్న వ్యక్తి చేతిలోని కొరడా గాల్లో తేలింది. మరుక్షణం అది అతని నగ్న వక్షస్థలాన్ని ముద్దు పెట్టుకుంది. నిర్మల్ కుమార్ తన చేత్తో ఛాతీని కవర్ చేసుకున్నాడు. బాధవల్ల అతని ముఖం వికృతమయింది.

వెనుకనుండి అతని జుత్తును విసురుగా విడిలించారు. నిర్మల్ కుమార్ కళ్లు తెరవగానే ఆర్క్ లాంప్ వెలుగువల్ల అతని కళ్లు మిరుమిట్లు గొలిపాయి.

''నిర్మల్ కుమార్;'' అతని చెవులకి శక్తిసింగ్ స్వరం వినిపించింది.

"హుం!" నిర్మల్ కుమార్ వగరుస్తూ అన్నాడు.

"ఇటు నా వైపు చూడు."

శబ్దం వచ్చినవైపు చూశాడు నిర్మల్. శక్తిసింగ్ ఆర్క్ లాంప్ వెనుక నిలబడి వున్నాడు. అక్కడవున్న కొన్ని ఛాయాకృతుల్లో అతనిది కూడా ఒకటిగా వుంది.

"సూట్ కేస్‌లోని కాగితాలు ఏమయినాయి?" శక్తి సింగ్ అడిగాడు.

"నాకు తెలియదు."

"సూట్ కేస్ నీవద్దే వుండిందికదూ?"

"అవును; కాని దానిని తెరిచి చూళ్లేదు."

"ఎందుకని?"

"నాకా అవకాశం లభించలేదు. నేను సూట్ కేస్‌తో బయటకు రాగానే నీ మనుష్యులు నన్ను కవర్ చేసుకున్నారు."

"కాని, సూట్ కేస్‌లోని అసలు కాగితాలు ఏమయినాయి?"

"నాకేమీ తెలియదు. అందులో ఏముందో మీరు స్వయంగా చూశారుకదా?"

"సూట్ కేస్‌లో చిత్తుకాగితాలుంచి, దానిని విమల్ తన స్నేహితుడికిచ్చాడంటావా? నేన్నమ్మను—"

నిర్మల్ కుమార్ మౌనంగా ఉండిపోయాడు.

"నీ వేదో అతితెలివి చూపించి వుంటావు?" శక్తిసింగ్ గర్జించి అన్నాడు.

"నాకా అవకాశంలేదు."

"నీవు స్టేషన్‌కి వెళ్ళి ఒకగంటసేపు అటు ఇటు తిరుగుతూ గడిపావు. నేరుగా క్లాక్ రూంకి ఎందుకు వెళ్ళలేదు?"

"నా ఫ్రెండ్ కోసం ఎదురు చూస్తూండిపోయాను."

"ఎవరా ఫ్రెండ్?"

"పోలీస్ సూపర్నెంట్ శంభూప్రసాద్."

"ఆ తరువాత?" శక్తిసింగ్ మళ్ళీ అడిగాడు.

"ఆ తరువాత రెండుసార్లు ఫోన్ చేసినా శంభూప్రసాద్ గారితో మాట్లాడలేకపోయాను. దాంతో క్లాక్ రూంకి వెళ్ళి సూట్ కేస్ తీసుకుని వచ్చాను."

"ఇతను స్టేషన్ నుండి రెండుసార్లు ఎవరికో ఫోన్ చేశాడు," నిర్మల్ కుమార్ చుట్టువున్న వారిలోంచి ఒక డన్నాడు.

"నీవు సూపర్నెంటు గారితో ఎందుకు మాట్లాడాలను కున్నావు?" శక్తిసింగ్ మళ్ళీ అరిచాడు.

"నేను స్టేషన్ లోకి రాగానే కనీసం డజన్ మంది నన్ను గమనిస్తున్నారని తెలుసుకున్నాను. సూపర్నెంట్ గారితో ఈ విషయం చెప్పి ఆయనున్నుంచి పోలీస్ సహాయం పొందా లనుకున్నాను. కాని ఆయన రెండుసార్లు ఫోన్ చేసినా కలవ లేదు..."

ఎవరూ మాట్లాడలేదు.

"నా ఫ్లాట్ లోకి విమల్ ఫ్రెండ్ రానున్నాడని మీ కెలా తెలుసు? విమల్ తన రిపోర్ట్ డూప్లికేట్ కాపీని తన మిత్రుడు సాగర్ కి ఇచ్చాడని ఎలా తెలుసు? నేను స్టేషన్ నుండి సాగర్ సూట్ కేస్ తేవడానికి వెళుతున్నానని ఎలా తెలుసు??" నిర్మల్ కుమార్ అడిగాడు.

"శక్తిసింగ్ ...!" లోపలినుండి ఎవరిదో బొంగురు కంఠం వినిపించింది. "అనవసరంగా టైం వేస్ట్ చేయవద్దు."

"యస్, బాస్!" శక్తిసింగ్ వెంటనే అని నిర్మల్ కుమార్ వైపు తిరిగాడు. "ఆ కాగితాలు ఎక్కడున్నాయి?" క్రూరంగా అడిగాడు.

"నాకు తెలియదు."

"చివరిసారిగా అడుగుతున్నాను. ఆ కాగితాలు ఎక్కడ

దాచావో చెప్పు?"

"నేనసలు వాటిని చూడనేలేదు," నిర్మల్‌కుమార్ దృఢంగా అన్నాడు.

"ఆల్ రైట్!" అంటూ శక్తిసింగ్ తన ప్రక్కనేవున్న దైత్యాకారంలో వున్న మనిషిని చూస్తూ "చాందానీ!" అన్నాడు.

చాందానీ కుటిలంగా నవ్వుతూ నిర్మల్‌కుమార్ ముందు కొచ్చి నిలబడ్డాడు. అతను ఎడమ చేత్తో నిర్మల్‌కుమార్ జుత్తుని పట్టుకుని పైకిలేపాడు.

నిర్మల్‌కుమార్ తన కుడిచేయి పిడికిలి బిగించి బలంగా చాందానీ కడుపులో గుద్దాడు. అతని వేళ్లు పటపటలాడాయి. చాందానీ ఒక అంగుళంకూడా కదల్లేదు. అతను పళ్ళు పట పట లాడిస్తూ కుడిచేత్తో బలంగా నిర్మల్‌కుమార్ ఛాతీపై గుద్దాడు.

నిర్మల్‌కుమార్ బిగ్గరగా అరిచి వెనక్కి పడిపోయాడు. కాని చాందానీ అతన్ని జుట్టు పట్టుకుని కూర్చుండబెట్టాడు. చాందానీ తన కుడిచేత్తో నిర్మల్‌కుమార్ రెండు చేతులు పట్టుకున్నాడు.

"లే...!" అంటూనే అతను జుట్టు పట్టుకుని పైకిలేపాడు. నిర్మల్‌కుమార్ బాధతో విలవిల్లాడుతూ లేచాడు.

"కూర్చో...!"అని ఈసారి అతను నిర్మల్‌కుమార్ తలను క్రిందకు వత్తాడు.

తను వెంటనే కూర్చోకుంటే మెడలు విరిగిపోతాయేమో ననిపించి కూర్చున్నాడు.

చాందానీ ప్రతిసారి "లే!" అంటూ జుట్టు లాగడం... "కూర్చో!" అంటూ మాడుపై గుద్దడం చేస్తున్నాడు. నిర్మల్‌కుమార్ బరువుగా రొప్పుతున్నాడు. అతని శరీర మంతా పచ్చిపుండులా తయారయింది.

"చెప్పు!" చాందానీ అరిచాడు. "ఎక్కడున్నా యా కాగితాలు?"

నిర్మల్ కుమార్ మాట్లాడలేదు.

"నువ్వు నోరుమూసుకుంటే లాభంలేదు మిస్టర్! చాందానీ కూర్చోమంటే కూర్చుంటున్నావు, నిలబడమంటే నిలబడు తున్నావు. అలాగే అతను చెప్పమన్నప్పుడు చెప్పేయాలి. లేకుంటే నీగతి ఏమవుతుందో నీకు తెలుసు," శక్తిసింగ్ అన్నాడు.

"చెబుతావా...లేదా?" చాందానీ అరిచాడు.

నిర్మల్ కుమార్ తన తల పైకెత్తాడు. శక్తిసింగ్, చాందానీలకేసి చూశాడు. ఆర్క్ లాంప్ వెలుగువల్ల అతని కళ్ళు మిరుమిట్లుగొలిపాయి. "గో, టు హెల్..." నిర్మల్ కుమార్ కళ్లు చికిలిస్తూ అన్నాడు.

"నీవు వెంటనే చెప్పకపోయావంటే అక్కడికి పంపే బాధ్యత చాందానీ తీసుకుంటాడు. ఏమంటావు?" శక్తి సింగ్ గుర్రుగా అడిగాడు.

నిర్మల్ కుమార్ నోరు విప్పలేదు.

"చాందానీ!" శక్తిసింగ్ అసహనంగా అరిచాడు.

చాందానీ మళ్ళీ అడుగు ముందుకు వేశాడు.

నిర్మల్ కుమార్ చురుగ్గా లేచి నిలబడ్డాడు. తను కూర్చున్న స్టూల్ ని అందుకుని దాన్ని చాందానీ పైకి విసిరాడు. చాందానీ తప్పుకోడానికి పక్కకి జరిగాడు. అయినా స్టూల్ కాళ్లొ కటి బలంగా అతని చెంపను గీసుకుంటూపోయింది. అతని కన్ను కొద్దిలో తప్పిపోయింది. చాందానీ కోపంతో పిచ్చి వాడయ్యాడు. అతను ఒక్క అంగలో నిర్మల్ కుమార్ పైకి వచ్చి రెండు చేతుల్తోను గుద్దసాగాడు. బలమయిన ఆ ప్రహారాలకి కొద్ది సేపట్లోనే నిర్మల్ కుమార్ శరీరం నిశ్చేష్టమై నేలపైబడింది...

చాందానీ కొట్టడం ఆపాడు. నిర్మల్ శరీరం నిశ్చలంగా పడివుంది.

ఒకతను ఒక బకెట్లో నీళ్లు తెచ్చాడు. ఆ బకెట్ నీళ్ళను నిర్మల్ కుమార్ నగ్న శరీరంపై గుమ్మరించాడు. మంచులాంటి చల్లని నీళ్ళు శరీరాన్ని స్పృశించగానే నిర్మల్ కుమార్ కి స్పృహవచ్చింది. ఒకతను వెళ్ళి స్టూల్ తీసుకువచ్చాడు. చాందానీ అతని రెండు చంకల కింద చేతులు వేసి అతణ్ని లేపి స్టూల్ పై కూర్చుండబెట్టాడు.

"ఇప్పుడేమంటావు?" శక్తిసింగ్ అడిగాడు.

"మీకేం కావాలి?" నిర్మల్ కుమార్ మెల్లిగా అడిగాడు. చలితోనూ, బాధతోను అతను కంపిస్తున్నాడు. అతని ముఖం వాలిపోయింది.

"సూట్ కేస్ లో కాగితాలు ఏమయినాయి?" శక్తిసింగ్ అడిగాడు.

"నాకు... నా... కు... చలి ... గా వుంది ... చెప్ప ... లేక ... పోతున్నాను..." గడగడలాడుతూ అన్నాడు నిర్మల్ కుమార్.

ఎవరో నిర్మల్ కుమార్ కి బ్లాంకెట్ కప్పారు. అతను దానిని తన నగ్నశరీరం చుట్టు బిగించుకున్నాడు. అతని పళ్ళు ఇంకా టకటక లాడుతూనే వున్నాయి.

"హాట్ కాఫీ" శక్తిసింగ్ అన్నాడు.

మూడు నిముషాల్లోనే ఒక పెద్ద గ్లాసునిండా పొగలు కక్కుతున్న కాఫీ వచ్చింది. నిర్మల్ కుమార్ దాన్ని అమృతంలా సేవించాడు. కొద్దిసేపట్లోనే అతని వణుకుడు ఆగింది.

"ఊఁ! చెప్పు" శక్తిసింగ్ అన్నాడు.

"ఆ కాగితాలున్న సూట్ కేస్ ఇంకా క్లాక్ రూంలోనే వుంది."

"వ్హాట్?!" శక్తిసింగ్ ఆశ్చర్యంగా అన్నాడు.

"అవును" నిర్మల్ కుమార్ అన్నాడు. "నేను చెప్పడం వలన నా స్నేహితుడు ఈ సూట్ కేస్ ని క్లాక్ రూంలో సాగర్ పేరుతో వుంచాడు," అంటూ నిర్మల్ కుమార్ జరిగింది చెప్పాడు.

"చాందానీ! ఇతని దుస్తుల్లో క్లాక్ రూం రసీదుందేమో మళ్ళీ చూడు," శక్తిసింగ్ ఆదేశించాడు.

"ఆ రసీదు నా కద్ద లేదు" నిర్మల్ కుమార్ అన్నాడు.

"మరైతే ఏమయిందది?"

"దానిని కవరులో పెట్టి స్టేషన్ లోని లెటర్ బాక్స్ లో పోస్ట్ చేశాను."

"ఎవరికి? ఎవరి పేర పోస్ట్ చేశావు?" శక్తిసింగ్ ఆతురతగా అడిగాడు.

"పోలీస్ సూపరింటెంట్ శంభూప్రసాద్ గారికి. ఆయన ఇంటి అడ్రస్ కి పోస్ట్ చేశాను."

"నిజం చెబుతున్నావా?"

నిర్మల్ కుమార్ జవాబివ్వలేదు.

"బాస్! ఇతను పోస్ట్ బాక్స్ లో కవరు వేయటం నేను చూశాను," ఒకతను అన్నాడు.

"శక్తిసింగ్!" లోపలి వ్యక్తి పిలిచాడు.

"యస్, బాస్," అంటూ శక్తిసింగ్ లోపలకు వెళ్ళి అయిదు నిముషాల తరువాత బయటకు వచ్చాడు.

"ఇతని బట్టలు ఇతని కివ్వండి. తరువాత పైన గదిలో బంధించండి" శక్తిసింగ్ ఆదేశించాడు.

"మిస్టర్!" శక్తిసింగ్ కఠినంగా అన్నాడు. "నీవా రసీదు విషయంలో అబద్ధం చెప్పివుంటే రేపు ఇంతకంటే దుర్గతి అవుతుంది."

"నేను నిజమే చెబుతున్నాను. నన్నిక్కడ ఎంతవరకు

బంధించి వుంచుతారు."

"ఆ కాగితాలు మా చేతికందేవరకు."

"నా కాకలిగా వుంది" నిర్మల్ కుమార్ అడిగాడు.

ఎవరూ అతనిమాటలు పట్టించుకోలేదు.

## 9

తనున్న గదిలో నిరీక్షించడం మొదలుపెట్టాడు నిర్మల్ కుమార్. ఆ గదికి ఒకే ఒక కిటికీ వుంది. దానికి లోపల నుండి గొళ్ళెం పెట్టి తాళం వేశారు. గది తలుపులకి పైనున్న వెంటిలేటర్ కి లావుపాటి ఇనుపచువ్వ లున్నాయి. ఆ గదిలోంచి ఎలాగయినా బయటపడాలని ఏకాగ్రతతో ఆలోచించసాగాడు నిర్మల్ కుమార్.

దుండగులు అతని జేబుల్లోని వస్తువులని అలాగే వుంచారు. తన జేబుల్లో వున్న సిగరెట్ తీసి వెలిగించాడు.

అతను గది మధ్య నిలబడి ఘాటుగా సిగరెట్ పీలుస్తూ ఆలోచించ సాగాడు.

ఉన్నట్లుండి అతని దృష్టి ఎలక్ట్రిక్ ఫిట్టింగ్ పై బడింది.

గది మధ్య సీలింగ్ ఫాన్ వుంది. ఒక వైపు గోడకు ఒక ట్యూబ్ లైట్ బిగించబడి వుంది. అది వెలగటం లేదు. ఆ ప్రక్కనే వున్న గోడకు ఒక మామూలు బల్బు వెలుగుతూ గదిని ప్రకాశవంతం చేస్తోంది. మంచం ప్రక్కగా భూమికి ఒక అడుగుఎత్తున ఒక పవర్ ప్లగ్ వుంది.

ట్యూబ్ లైట్ వున్న గోడకే స్విచ్చిలున్నాయి. అందులో ఒకటి ఆన్ చేయబడివుంది. ఒక స్విచ్ ఎక్స్ట్రా పవర్ పాయింటుది.

నిర్మల్ కుమార్ మిగిలిన రెండు స్విచ్చిలను ఆన్ చేశాడు. అందులో ఒకటి ఫ్యాన్ ది. రెండవది ట్యూబ్ లైట్ ది. ట్యూబ్ లైట్ మిలమిలలాడుతుందే కాని వెలగడం లేదు.

స్టార్టర్ ట్రబుల్ వున్నట్టుంది. అతను రెండు స్విచ్చిలు ఆఫ్ చేశాడు.

తన జేబులు తడుముకుని తాళం చెవుల గుత్తి బయటకు తీసాడు. దానికున్న పెన్ నైఫ్ బ్లేడ్ తీసాడు. తరువాత అతను గదిలో ఒకమూల వున్న బల్లను నిశ్శబ్దంగా లేపి తెచ్చి ట్యూబ్ లైట్ క్రింది పెట్టాడు. టేబిల్ పైకెక్కి ట్యూబ్ లైట్ కనెక్షన్ కి వున్న వైర్లను విడిలించి, లాగాడు. అతను ఆ వైర్లకు బిగించివున్న క్లిప్ లని లాగి, చివరకు స్విచ్ లోంచి కూడా తీగలను ఒక్క ఉదుటున లాగేశాడు.

ఇప్పుడతని చేతుల్లో సుమారు మూడు గజాల పొడవున్న పాజిటివ్, నెగటివ్ వైర్లున్నాయి. అతనా వైర్లను రెండు వైపులా కత్తితో చెక్కాడు. తరువాత ఒకవైపు మొనలను మంచం ప్రక్కగా వున్న ప్లగ్ హోల్స్ లో అగ్గిపుల్లల సహాయంతో ఇరికించాడు.

తరువాత తన చేతిలో వున్న పాజిటెవ్, నెగటివ్ కండక్టర్లను క్షణకాలం తగిలించి తీసేసాడు. అందులోంచి నిప్పురవ్వలు రాలాయి. తృప్తిగా నిట్టూర్చాడు నిర్మల్ కుమార్. ఆ వైర్లను మంచంపైగా అటువైపు పడేలా పెట్టి దానిపైనుండి దుప్పటి కప్పాడు.

అతను టేబుల్ ని యధాస్థానంలో వుంచి, వచ్చి మంచంపై వాలాడు.

తన గదిలోకి ఎవరయినా రావాలని, వస్తారని అతను ఓపిగ్గా ఎదురు చూడసాగాడు.

అరగంట తరువాత బయట అడుగుల చప్పుడు వినిపించి కళ్ళు మూసుకున్నాడు నిర్మల్ కుమార్. తలుపుతీసి ఎవరో బరువయిన అడుగులతో తన మంచం వద్దకు వస్తున్నట్లు పసిగట్టాడు.

"ఏయ్! మిస్టర్!!" ఆ వ్యక్తి పిలిచాడు.

నిర్మల్ కుమార్ కళ్ళు తెరిచాడు. ఎదురుగా చాందానీ ఒక చేత్తో స్టీల్ పళ్లెంతోనూ మరో చేతిలో రివాల్వర్ తోనూ నిలబడి వున్నాడు.

తలుపులవద్ద కూడా మరో వ్యక్తి రివాల్వర్ పట్టుకుని సావధానుడై నిలబడి వున్నాడు.

"అన్నమా?" నిర్మల్ కుమార్ ఆశగా అడిగాడు.

"ఊఁ!" అన్నాడు చాందానీ.

"థాంక్స్, బ్రదర్" నిర్మల్ కుమార్ అన్నాడు. "నేను ఆకలిలో చచ్చిపోతున్నాను. కడుపు ఖాళీగా వుంటే వెధవది నిద్రకూడా రాదు," అంటూనే అతను అకస్మాత్తుగా తన చేతిలోని వైర్లను చాందానీ చేతిలోవున్న స్టీల్ పళ్ళేనికి తగిలించాడు.

చాందానీ కంఠంలోంచి హృదయ విదారకమయిన అరుపు వినిపించింది. స్టీల్ పళ్ళెం అతని చేతిలోంచి జారిపోయింది. అతను బరువుగా మంచంపై పడ్డాడు. అతను క్రిందపడడానికి ముందే నిర్మల్ కుమార్ అతని చేతిలోని రివాల్వర్ లాక్కున్నాడు. చాందానీ శరీరాన్ని తన కడ్డంగా వుంచుకుని "ఖబడ్దార్" అరిచాడు.

తలుపులవద్ద నిలబడ్డ వ్యక్తి అకస్మికమయిన ఈ సంఘటనకు వులిక్కిపడ్డాడు. అతనికి రివాల్వర్ ని గురిచూసేఅవకాశం కూడా రాలేదు.

"ఊఁ! రివాల్వర్ పారేయ్! లేకుంటే మీ ఇరువురూ అనవసరంగా నా చేతుల్లో మరణిస్తారు" గద్దించాడు నిర్మల్ కుమార్.

ఆ వ్యక్తి వెంటనే రివాల్వర్ నిర్మల్ కుమార్ వైపు విసిరాడు.

లోపలినుండి తలుపులు మూసి, గోడవైపు ముఖముంచి నిలబడమని, అతడిని ఆదేశించాడు నిర్మల్ కుమార్. ఆ వ్యక్తి

అతని ఆజ్ఞను పాటించాడు.

నిర్మల్ కుమార్ ఒక్క గెంతున మంచందిగి ముందు ఆ వ్యక్తి విసిరిన రివాల్వర్ అందుకుని ప్యాంటు బెల్ట్‌లో దోపుకున్నాడు.

తరువాత తన చేతిలోవున్న రివాల్వర్‌ని బారెల్ వైపు పట్టుకుని ఆ వ్యక్తి మాడుపై బలంగా ఒక్కటిచ్చాడు. ఆ వ్యక్తి చిన్న మూలుగుతో నేలపై పడ్డాడు.

అప్పుడే చాందానీ మూలుగుతూ లేవబోయాడు. అతనికి కూడా అదే చికిత్స చేశాడు నిర్మల్ కుమార్.

తన చేతిలోవున్న రివాల్వర్ చేంబర్ తెరిచి చూశాడు. అది ఫుల్ లోడ్‌లో వుంది. ఫైరింగ్ పొజిషన్‌లో దాన్నుంచుకుని బయటకు వచ్చాడు. బయట కారిడార్ ఖాళీగా వుంది. అతను గది బయటనుండి గొళ్ళెం పెట్టి తాళం వేసి, తాళం చెవులు జేబులో వేసుకున్నాడు.

అతనతిజాగ్రత్తగా మెట్లుదిగి, తనను హింసించిన గది వైపు సాగాడు.

ఆ గది తలుపులవద్ద ఒకతను నిలబడి బీడి పీలుస్తున్నాడు. నిర్మల్ కుమార్ వైపు అతని వీపుంది. నిశ్శబ్దంగా అతని వెనుక చేరుకుని, ఎడమ చేతిని అతని మెడచుట్టు బిగించి, కుడిచేతి రివాల్వర్‌ని అతని కణత కానించి హెచ్చరించాడు. "అరవక! అరిచావా చస్తావ్?"

ఆ వ్యక్తి నోట్లోంచి బీడి క్రింద పడిపోయింది. అతని కళ్ళు ఆశ్చర్యంతో విస్ఫారితమయ్యాయి.

"లోపల ఎవరయినా వున్నారా?" అడిగాడు నిర్మల్ కుమార్.

ఆ వ్యక్తి అవునన్నట్టుగా తలూపాడు.

"ఎంత మంది?"

ఇద్దరు అన్నట్లుగా రెండు వేళ్లు చూపించాడతను.

నిర్మల్ కుమార్ చేయి అతని కుత్తుకపై బిగుసుకోసాగింది. మరోక్షణం తరువాత ఆ వ్యక్తి నిశ్చలంగా నిర్మల్ కుమార్ చేతుల్లో ఒరిగిపోయాడు.

అతణ్ని పక్క గదిలోకి లాక్కెళ్ళి బయటనుండి గొళ్ళెం పెట్టి తిరిగి ఈ గదిముందుకి వచ్చాడు. రివాల్వర్ని పొజిషన్లో ఉంచుకుని లోపలకు అడుగుపెట్టాడు. అక్కడ ఎవరూ లేరు. తనని అక్కడే టార్చర్ చేశారు. తనని టార్చర్ చేస్తున్నప్పుడు చీకటిగా వున్న గదిలో ఇప్పుడు వెలుగు కనిపిస్తోంది.

పిల్లిలా అడుగులు వేస్తూ అతను ఆ గదివద్దకు వెళ్ళి లోపలకు తొంగి చూచాడు.

లోపల ఇద్దరు వ్యక్తులు కూర్చుని మదిరను సేవిస్తూ మెల్లిగా మాట్లాడుకుంటున్నారు. ఆ ఇద్దరిని గుర్తించాడు నిర్మల్ కుమార్. అందులో ఒకతను శక్తిసింగ్, మరొకతను.

ఆ మరొకతను.

నిర్మల్ కుమార్ తన ప్యాంటు బెల్ట్లో దోపుకున్న మరో రివాల్వర్ కూడా చేతిలోకి తీసుకున్నాడు. రెండు చేతుల్లోనూ, రివాల్వర్లుంచుకుని, కాలితో తలుపులను తన్ని లోపలకు ప్రవేశించాడు.

"నమస్కారం సూపరింటెండెంటుగారూ!" నిర్మల్ కుమార్ రెండవ వ్యక్తిని చూస్తూ అన్నాడు.

లోపలున్న ఆ ఇద్దరూ వులిక్కిపడ్డారు.

"అరెరే జాగ్రత్త సూపరింటెండెంటుగారు!" నిర్మల్ కుమార్ వ్యంగ్యంగా అన్నాడు. "నేను ఉన్నట్లుండి ఇక్కడ ప్రత్యక్షం కావడం ఆరోగ్యానికి అంత క్షేమకరంగా లేదు కదూ! అరెరే జాగ్రత్త గ్లాసు పడిపోతుంది. బిగించి పట్టుకోండి. అదికాని జారిపోయి విలువయిన విస్కీ క్రింద ఒలికిందంటే నాకెంతో బాధగా ఉంటుంది.

పోలీస్ సూపరెన్టెంట్ శంభూప్రసాద్ విస్ఫారిత నేత్రాలతో నిర్మల్ కుమార్‌ని చూస్తూండిపోయాడు. అతని నోట మాట పెగలడం లేదు.

"ను...ను...వ్వు నువ్వెలా తప్పించుకున్నావు?" శక్తిసింగ్ తడబడుతూ అడిగాడు.

నిర్మల్ కుమార్, శక్తిసింగ్ మాటలను పట్టించుకోలేదు.

"సూపరెన్టెంట్ గారూ!" నిర్మల్ కుమార్ శంభూప్రసాద్‌తో అన్నాడు. "మీరు నన్నూ, విమల్‌ని మీ గదిలో వదిలి మీరు బయటకు వెళ్ళినప్పుడే నేను మిమ్మలను అనుమానించాల్సింది. మీ గదిలో ఎక్కడో మైక్రోఫోన్ బిగించబడి ఉంది. అందుకే మీరు ధైర్యంగా మమ్మల నొంటరిగా ఒదిలి వెళ్ళారు. మీరనుకున్న విధంగానే విమల్ తన రిపోర్ట్ కాగితాలు తన మిత్రునివద్ద వున్నాయని, అతను నా వద్దకు వస్తాడని చెప్పాడు. అదివిన్న మీరు నా ఫోన్ టాప్ చేయించారు. విమల్ ఫ్రెండ్ సాగర్ నన్ను కలవడానికి వస్తున్నాడని మీకు తప్ప మరొకరికి తెలిసే అవకాశం లేదు.

"సాగర్ నాకు ఫోన్ చేయగానే అతనెప్పుడు వస్తున్నదీ మీకు తెలిసిపోయింది. ఆ తరువాత, మీరో, మీ అనుచరుడో గొంతుమార్చి నా ఫ్రెండ్ జయరాంలా మాట్లాడి నన్ను ఫ్లాట్ నుండి బయటకు పంపించి వెంటనే తిరిగి రాకుండా చేశారు. ఆ ఎక్సైట్‌మెంట్‌లో నేనూ తొందరపడ్డాను. కాని కొంచెం ఆలోచించి వుంటే అది జయరాం ఫోన్ కాదని కనుక్కొనగలిగేవాణ్ని."

"ఎలా?" అప్పటికి తనను తాను సంబాళించుకున్న శంభూప్రసాద్ అడిగాడు.

"నా ఫ్లాట్‌లో రెండు ఫోనులున్నాయి. ఒకటి అన్ లిస్టెడ్ ఫోన్. దాని నెంబరు డైరక్టరీలో వుండదు. జయరాం నాకెప్పుడు ఫోన్ చేసినా ఆ నెంబర్‌కే ఫోన్ చేస్తాడు.

కాని ఆనాడు మరో ఫోన్ చేశాడు. నన్ను మోసం చేయడానికి ప్రయత్నం జరిగిందని ఆలోచించి వుంటే తెలిసిపోయి వుండేది."

శంభూప్రసాద్ కుటిలంగా మందహాసం చేశాడు.

"సాగర్ హత్య తరువాత నాకు మీపై కొద్దిగా అనుమానం కలిగింది. కాని ఒక వున్నత పోలీస్ అధికారి అపరాధి కాగలడని నా మనస్సు ఒప్పుకోలేదు" నిర్మల్ కుమార్ చెప్పసాగాడు.

"పోలీస్ హెడ్ క్వార్టర్స్‌లో మా మాటలను మైక్రోఫోన్ ద్వారా టేప్ చేశారు. అందులో సందేహం లేదు. కాని అది మీరని అనుకోలేదు. మీ సబార్డినేట్స్‌లో ఎవరయినా దుండగులతో చేతులు కలపారేమో అనుకున్నాను. మిమ్మలను పరీక్షించడానికి నేను సాగర్ పేరవున్న రైల్వే క్లాక్ రూం రసీదు విషయం మీకు చెప్పాను. నేను స్టేషన్‌కి వెళ్ళేసరికి డజనుమంది వరకు నన్ను గమనిస్తున్నారని తెలిసిపోయింది. అప్పుడే నిర్ణయించుకున్నాను. రక్షకులే భక్షకులవుతున్నారని.

"విమల్ ఇంత ప్రయత్నంచేసి ఏ గాంబ్లింగ్ బిజినెస్ విషయం ప్రజలకు, ప్రభుత్వానికి తెలుపాలని ప్రయత్నం చేశాడో, ఆ గాంబ్లింగ్ బిజినెస్‌కి నాయకులు మీరేనని నిర్ణయించుకున్నాను. తన యజమాని పట్టాభిరాం తన రిపోర్ట్‌ని నాశనం చేశాడనీ, ఒక ఇన్‌స్పెక్టర్ అతని నోట్లో బలవంతంగా విస్కీ పోశాడని విమల్ చెబితే మొదట నాకూ కొంచెం అనుమానంగానే ఉండింది. అతను చెబుతున్నది నిజమేనని తేలింది.

"అంతేకాదు 'కాస్మోపాలిటన్'లో జూదగృహం ఎందుకు బయట పడలేదో నాకిప్పుడు అర్థం అవుతోంది. అందుకే అక్కడ ఏమీ లభించలేదు. మీ మాటను అందరూ

నమ్మారు. అయినా ఒక పోలీస్ సూపరెంటెంట్ అపరాధుల నాయకుడు కాగలడని ఎవరికి తెలుసు?"

"ఇప్పటికే నీ వాగుడు చాలా విన్నాను. ఇప్పుడేం కావాలి?"

"శంభూప్రసాద్ గారూ!" నిర్మల్ కుమార్ అసహ్యంగా అన్నాడు. "పాతకాలంలాగే మిమ్మల్ని ప్రజలు సంచరించే నాలుగురోడ్ల కూడలిలో వేళ్ళాడదీయాలని వుంది. కాని అది అసంభవమని నాకు తెలుసు."

"నీవు నన్ను ఏమీ చేయలేవు" శంభూప్రసాద్ అన్నాడు. "నాకు విరుద్ధంగా నీవే ప్రమాణాలు, సాక్ష్యాలు చూపించలేవు. ప్రజలు నీ మాటకంటే నా మాటకు, ఒక పోలీస్ సూపరెంటెంట్ మాటకు ఎక్కువ విలువనిస్తుంది."

"విమల్ తయారుచేసిన రిపోర్ట్ కాగితాలు ఇంకా నా చేతుల్లోనే వున్నాయని మరచిపోతున్నారు?"

"దానివల్ల ఏమవుతుంది? ఏమీ అవదు. అందులో నాకు విరుద్ధంగా ఏమీ లేదు. నా పేరుకూడా లేదు. ఉండివుంటే ఆ రాత్రి విమల్ నన్ను నమ్మేవాడే కాదు. అలాగే అందులో పట్టాభిరాం పేరుకూడా లేదు. అందుకే విమల్ ధైర్యంగా ఆ కాగితాలని అతనికిచ్చి వచ్చాడు."

"కాని ఇతరులు చాలామంది పట్టుబడతారు."

"దానికి నేనేం చేయను" శంభూప్రసాద్ నవ్వుతూ అన్నాడు. "ఇతరులు చచ్చినా, బ్రతికినా నాకేం బాధ లేదు. దానివల్ల నాకేనష్టమూ సంభవించదు."

"పట్టుబడ్డవాళ్లు మీ పేరు చెప్పకుండా ఉంటారా?"

"నన్నెవరూ ఎరగరు...ఎరిగిన ఇద్దరు ముగ్గురు పట్టుబడరు...ఇక నువ్వేం చేయగలవు."

"శకిసింగ్ పట్టుబడతాడు. నేనా క్లబ్‌ని పునాదులతో సహా త్రవ్విస్తాను..." నిర్మల్ కుమార్ ధృఢంగా అన్నాడు.

"ప్చ...ప్చ..." శంభూప్రసాద్ అన్నాడు..."అది కూడా లాభంలేదు డియర్. అక్కడినుండి గాంబ్లింగ్ హౌస్‌ని ఎప్పుడో ఎత్తేశాము."

నిర్మల్‌కుమార్ క్షణకాలం ఆలోచిస్తూండిపోయాడు.

"అయితే ఇక చట్టాన్నే నా చేతిలోకి తీసుకోవాలి తప్పదు," నిర్మల్‌కుమార్ కఠినంగానే అన్నాడు.

"వాట్ డూ యూ మీన్...?" వులికి పడ్డాడు శంభూప్రసాద్.

"వాట్ ఐ మీన్ యీజ్..." నిర్మల్‌కుమార్ చెప్పసాగాడు. "మీరు అపరాధులని నాకు తెలుసు. కాని మీ కథనం ప్రకారం మిమ్ములని అపరాధులని నిరూపించలేను. సో, మీకు శిక్ష విధించడమూ, మానడమూ న్యాయాలయం చేతికి వదిలేకంటే రెండునిముషాలపాటు ఆ న్యాయాన్ని నా చేతుల్లోకి ఎందుకు తీసుకోకూడదు..."

"ఇంతకీ ఏమిటి నీవంటున్నది?"

"నేను చెప్పేదేమిటంటే మరో రెండుక్షణాల తర్వాత మీ ఇద్దరి జీవితాలు నా చేతుల్లో సమాప్తం కానుందని చెబుతున్నాను. అంతే...!"

శంభూప్రసాద్ వదనంలో భయం తొంగిచూసింది.

"నో, నీవలా చేయలేవు," అతని కంఠం కంపించింది.

"ఏం...? ఎందుకు చేయలేను...?? ఎవరో దుండగులు నన్నిక్కడ బంధించివుంచారు. ఇక్కడినుండి తప్పించుకోవడంలో ఆత్మరక్షణకై నేను రివాల్వర్ పేల్చాను. చీకట్లో వాళ్ళెవరో నాకు తెలియలేదు...నా ప్రాణం కాపాడుకోవడానికి వాళ్ళ ప్రాణం తీయక తప్పలేదని చెబుతాను. నా మాటను కోర్టు నమ్ముతుందనే ఆశిస్తాను..."

"తప్పకుండా నీవు ఉరికంబాన్ని చూస్తావు...?"

"ఫర్వాలేదు; సమాజానికి కళంకమయిన మీలాంటి

వాళ్ళను సంఘంలోంచి తొలగించిన తరువాత చచ్చినా ఫర్వాలేదు...ఊం! చివరిసారిగా దైవప్రార్థన చేసుకోండి" అంటూ నిర్మల్ కుమార్ రెండు రివాల్వర్లను ఆ ఇద్దరికి గురి పెట్టాడు.

ఆ ఇరువురి ముఖాలపై స్వేద బిందువులు అలుముకున్నాయి. భయంవల్ల వాళ్ళ ముఖాలు పాలిపోయాయి.

నిర్మల్ కుమార్ వేళ్లు ట్రిగ్గర్ పై బిగుసుకుంటున్నాయి.

"నో...నో..." ఉన్నట్లుండి శక్తిసింగ్ పిచ్చివాడిలా అరిచాడు. "నన్ను చంపొద్దు...నన్నొదిలేయ్! నేనేమీ చేయలేదు... కేవలం క్లబ్ కి మానేజర్ని అంతే...అంతకు మించి నేనే అపరాధం చేయలేదు...నన్నొదిలేయ్...!"

"మరి శంభూప్రసాద్?" నిర్మల్ కుమార్ అడిగాడు.

"నగరంలోని జూద, వ్యభిచార గృహాలన్నీ ఇతని నేతృత్వంలోనే జరుగుతున్నాయి. నిజానికి ఇతను అసలయిన పోలీస్ సూపర్నెంట్ కాదు. అసలయిన సూపర్నెంట్ ముందు బొంబాయిలో వుండేవాడు. మూడేళ్ళ క్రితం ట్రాన్స్ఫర్ అయింది. ఇతను అతన్ని చంపి అతనిలా ఇక్కడికి వచ్చాడు. ఇతను కొన్నాళ్ళపాటు ఇన్స్పెక్టర్ గా గుజరాత్ లో పనిచేశాడు. తరువాత రాజీనామా ఇచ్చి ఇలా అక్రమ కార్యాలు చేయడం మొదలుపెట్టాడు.ఇన్స్పెక్టర్ గా పనిచేయడంవల్ల పోలీసుల మెళకువలు తెలియడంవల్ల ఇక్కడి పోలీసుల కెవరికి ఇతనిపై అనుమానం కలుగలేదు. నీ ఫ్లాట్ లో సాగర్ ని చంపిందికూడా ఇతనే...ఇతను చేసిన ఎన్నో నేరాలగురించి నాకు తెలుసు..." పిరికివాడయిన శక్తిసింగ్ చావుకి భయపడి అంతా చెప్పాకువచ్చాడు.

"నువ్వు ఇతనికి విరుద్ధంగా సాక్ష్యం చెబుతావా?"

"తప్పకుండా చెబుతాను...ప్లీజ్ నిర్మల్! నన్ను వదిలేయ్!"

"యూ! స్కౌండ్రల్...రాస్కెల్...నిన్ను...నిన్ను చంపేస్తాను..." అంటూ శంభూప్రసాద్ ఒక్క ఉదుటున శక్తిసింగ్ గొంతు నులుమసాగాడు.

"శంభూప్రసాద్!" నిర్మల్ కుమార్ అరిచాడు. "దూరంగా తొలగు..."

కాని, శంభూప్రసాద్ అతని మాటలు పట్టించుకోలేదు.

నిర్మల్ కుమార్ రివాల్వర్ పేల్చాడు. గుండు శంభూప్రసాద్ తొడలో దిగింది. బాధతో అతను క్రిందపడ్డాడు. శక్తిసింగ్ గొంతు తడుముకుంటూ లేచాడు.

"బాస్!!" బయటినుండి ఎవరో తలుపుతడుతూ పిలిచారు.

శక్తిసింగ్ కళ్ళల్లో భయం కనిపించింది.

"నీవు నన్ను నమ్ముతావా?" అతను నిర్మల్ ని అడిగాడు.

"నమ్మక తప్పదు."

"ఒక రివాల్వర్ నాకివ్వు...గుళ్ళు తీసేసుకో..."

"కరెక్ట్;" అంటూ నిర్మల్ కుమార్ ఒక రివాల్వర్ చాంబర్ ఖాళీచేసి శక్తిసింగ్ కి ఇచ్చాడు.

శక్తిసింగ్, బాధతో విలవిల్లాడుతున్న శంభూప్రసాద్ ని లాక్కొచ్చి తలుపుల కెదురుగా పడవేశాడు. తరువాత నిర్మల్ ని తలుపుల చాటున దాక్కోమని సైగచేశాడు.

నిర్మల్ కుమార్ తలుపు ప్రక్కగా గోడవారగా నిలబడ్డాడు.

శక్తిసింగ్ గబగబా వెళ్ళి తలుపులు తెరిచాడు. బయట ఐదారుగురు వ్యక్తులు నిలబడివున్నారు.

"బాస్!" ఒకతను కంగారుగా అన్నాడు. "మేమిప్పుడు రివాల్వర్ పేలిన శబ్దం విన్నాం."

"అవును;" శక్తిసింగ్ వెంటనే అన్నాడు. "నేనే రివాల్వర్ పేల్చాను. ఈ శంభూప్రసాద్ మనలను మోసం చేయాలని చూశాడు. మనందరినీ పట్టించాలని ప్రయత్నం

చేశాడు. అందుకని ఇతణ్ని షూట్ చేయాల్సివచ్చింది."

బయటవున్న వాళ్ళంతా "హాఁ!" అని రెచ్చిపోవటం వినిపించింది నిర్మల్‌కి.

"శంభూప్రసాద్ తప్పకుండా ఏదో గందరగోళం చేసి వుంటాడు. ఇక్కడికి ఏ క్షణంలోనయినా పోలీసులు రావచ్చు. మీరు వెంటనే బయల్దేరి మన ఇతర స్థావరాలకి వెళ్ళండి."

"పైనున్న ఖైదీ విషయం ఏంచేద్దాం?"

ఆ విషయం నేను చూసుకుంటాను. ముందు మీరిక్కడి నుండి బయటపడండి."

"ఓకే. బాస్."

ఆ వెంటనే అందరూ పరుగెత్తడం వినిపించింది నిర్మల్ కుమార్‌కి. అతను తలుపుచాటునుండి బయటకువస్తూ, "శక్తి సింగ్! ఏమిటీ మోసం. వాళ్లెందుకు వెళ్ళిపోనిచ్చావ్?" అరిచాడు.

"కోపం చేసుకోక" వినయంగా అన్నాడు శక్తిసింగ్. "వాళ్ళు కిరాయిమనుషులు. ఏ క్షణంలో అయినా పట్టుబడతారు. వాళ్లు ఇతర స్థావరాలవద్ద నా కొరకు ఎదురుచూస్తుంటారు. ఆ స్థావరాలని నేను చూపిస్తాను."

"ఆల్ రైట్! ఈ ఇంట్లో టెలిఫోన్ ఎక్కడుంది?"

శక్తిసింగ్ ఫోన్ చూపించగానే నిర్మల్‌కుమార్ డయల్ చేయసాగాడు.

# 10

శక్తిసింగ్ పిరికివాడు కావడం ఒకందుకు మంచిదయింది. సూపర్నెంట్ శంభూప్రసాద్ గ్యాంగ్‌ని గురించి తనకు తెలిసిందంతా చెప్పాడు శక్తిసింగ్. నిర్మల్‌కుమార్ ఫోన్ చేయడంవల్ల అతని మిత్రుడు పోలీస్ సూపర్నెంట్ మజుందార్ కమాండ్‌ని తన చేతుల్లోకి తీసుకున్నాడు. మొదటగా అతను శంభూప్రసాద్‌ని అరెస్ట్ చేశాడు.

శక్తిసింగ్ సహాయంతో ఎన్నో అరెస్టులు జరిగాయి. మజుందార్ నేతృత్వంలో పోలీసులు శక్తిసింగ్ చెప్పిన ప్రదేశాల్లో దాడిజరిపి జూద, వ్యభిచార గృహాలను వెలికి తెచ్చారు. అరెస్ట్ అయిన వారిలో విమల్‌ని మర్డర్ కేసులో ఇరికించాలని ప్రయత్నంచేసిన ఇన్స్‌పెక్టర్ కూడా వున్నాడు.

"ఇంతకీ ఆ రాత్రి నేను జూదగృహంలోకి వెళ్ళాను కదా? అదెక్కడుంది?" అడిగాడు విమల్.

"అది ఆ నైట్ క్లబ్‌లో లేదు. దాని ప్రక్కనేవున్న గొడౌన్‌లోవుంది. లోపల డ్రాయింగ్ రూం గోడ తెరచుకోగానే అది గొడౌన్‌లోకి దారితీస్తుంది. లిఫ్ట్‌లో చీకటిగా వుండటంవల్ల అందరూకూడా జూదగృహం క్లబ్‌లోనే వుందనుకుంటూరు" అన్నాడు శక్తిసింగ్.

"ఏమయితేనేం మీ ఇద్దరిశ్రమ ఫలించింది. అందరూ ఇంత పట్టుదలతో పనిచేస్తే దేశంలో శంభూప్రసాద్‌లాంటి వాళ్ళు తలెత్తరు" సూపరెన్టెంట్ మజుందార్. విమల్ భుజంతడుతూ అన్నాడు.

"ఈ క్రెడిట్ అంతా విమల్‌ది. నగరంలో గాంబ్లింగ్ బిజినెస్ సాగుతుందని కనుగొన్నది అతనే" నిర్మల్ కుమార్, విమల్‌ని ప్రశంసాపూర్వకంగా చూస్తూ అన్నాడు.

"కాని, నాకొక్కటే బాధగావుంది" విమల్ బాధగా అన్నాడు. "సాగర్ మరణం.సూపరెన్టెంట్ గారూ ప్రభుత్వం తరఫున అతని భార్యాపిల్లలకు ఏమయినా సహాయం అందేట్లు చూడండి."

"నా ప్రయత్న లోపంలేకుండా నేను ప్రయత్నం చేస్తాను," మజుందార్ హామీ ఇచ్చాడు.

ఆ తరువాత రెండు నిముషాలు అందరూ సాగర్ ఆత్మ శాంతికి మౌనం పాటించారు.

——:ఐ పో యిం ది:——

# అపరాధి ?

ఏ. వీ. మోహన్రావ్

బ్రాందీ గ్లాసు చేత్తో పుచ్చుకున్నాడు వరహాలరాజు. ఎదురుగా వయ్యారాలు వొలకబోస్తూ అర్ధనగ్నంగా అలవోకగా సోఫాలో కూర్చునుంది మణి.

"ఆగారేం? త్రాగండి!" అంది గోముగా.

"త్రాగుతాను నిన్నూ, దీన్ని కలిపి త్రాగుతాను మణీ!" అంటూ గుటుక్కున గ్లాసెడు బ్రాందీ గొంతులో ఒక్కసారిగా పోసుకుని మింగాడు రాజు.

మణి సోఫాలోంచి దిగింది. పొడవుపాటి తెల్లటి నున్నటి తొడలు, పిక్కలు, మెడ, చెంపలు ట్యూబ్ లైటు వెలుగులో మిలమిలలాడాయి. తిన్నగా వెళ్ళి రాజుగారి ఒళ్ళో కూర్చుంది.

"నువ్వు నా దగ్గరకొచ్చి రెండేళ్ళయినా ఎప్పటికప్పుడు క్రొత్తగానే వుంది!" అన్నాడు ఆమెకు చక్కిలిగింతలు పెడుతూ.

"అలాంటిభావం మీ కేర్పడటానికి నేనెంత తంటాలు పడుతున్నానో మీకేం తెలుస్తుంది. సిగ్గువిడిచి అడిగినా మీరుమాత్రం నా చిన్న కోరిక తీర్చటం లేదు" అంది మణి.

"కోరికా? ఏమిటది?"

"బెంజ్ కారు కొనిమ్మన్నాను. ఇంతవరకు కొననేలేదు."

"ఓశ్! అంతేగా! రేపీపాటికి నీ బంగళా పోర్టికోలో వుంటుంది. అలా జరగకపోతే నేను నీకు కనుపించను" అన్నాడు రాజు.

"అంతపని చెయ్యకండి, కారు లేకుంటే పోయింది. మీరు రండి. మిమ్మల్ని చూడకుండా నే నుండలేను" అంది మణి.

వరహాలరాజు కా మాటలు తగల వలసిన చోట తగిలి పిచ్చెక్కించాయి. కట్టుకున్న భార్యతో ఇరవై సంవత్సరాలు కాపురం చేశాడు. నలుగురు పిల్లల్ని కన్నాడు. ఒక్కనాడైనా ఆమె మణి ఇచ్చిన ఆనందాన్ని ఇవ్వలేదు. కనీసం మణిలా తనపట్ల ప్రేమ కనపరచలేదు.

మణిని వుంచుకొన్నందుకు రాజుగారికి గర్వంగా వుందిప్పుడు. ఆమెకు రెండు లక్షలు పెట్టి బంగళా కొన్నందుకు గానీ, నాలుగైదు లక్షలు ఖరీదుచేసే నగలు బహూకరించినందుకుగానీ, వారికి విచారం లేదు. తనకున్న ఆ స్తిపాస్తుల్లో ఆమె కిచ్చింది వెయ్యోవంతు. కానీ మణి! తన సర్వస్వం దాచుకోకుండా దోచి పెడుతుంది.

వేలి దగ్గరున్న బటన్ నొక్కింది మణి. లైట్లరిపోయాయి. చీకటి చిక్కగా పేరుకుంది.

# 2

"బాబూగారూ! ఈ చెక్కుపైన సంతకం చెయ్యండి," అన్నాడు మానేజర్ సుందరం, వరహాల రాజుగారి మొదటి అబ్బాయి మురళితో.

"మూడు లక్షలా! ఎందుకండీ ఇంతడబ్బు!" అడిగాడు మురళి చెక్కుపైన సంతకం చేస్తూనే.

"అయ్యగారు అర్జంటుగా మణిమాలగారి పేరుమీద ఒక బెంజ్ కారు కొనితెమ్మని ఉత్తరువు చేశారు. మూడు లక్షలకు తక్కువగా ఎక్కడా కుదరలేదు" అన్నాడు సుందరం చెక్ బుక్ తిరిగి అందుకుంటూ.

"అవసరానికి దొరికింది! అంతేచాలు వెంటనే వెళ్ళండి" అన్నాడు మురళి.

సుందరం వెళ్ళిపోయాడు.

"మీ మేనేజర్‌కున్న తెలివి మీకుంటే నేనూ నా పిల్లలు కాస్త సుఖపడి వుండేవాళ్ళం" అందుకుంది వెనుక నుంచి అప్పుడే అడుగుబెట్టిన మురళి భార్య సుజాత.

"నీ తెలివి ముందందరి తెలివీ తీసికట్టేగా? అయినా ఇప్పుడేం జరిగింది?" అడిగాడు మురళి నవ్వుతూ.

"ఆ ముసలాయన ఈ వయస్సులో తన సంతోషంకోసం లక్షలు లక్షలు తగలేస్తూంటే మీరు తప్పని చెప్పరేమండీ! అంతా ఊడ్చుకుపోయాక ఏడిస్తే ఏం లాభం? ఆ పాడు ముండను తెచ్చి ఎస్టేట్‌లోనే బెట్టి కులకడానికి ఆయనకు సిగ్గెలా లేకపోయిందో నాకు అర్థం గావటం లేదు," అంది సుజాత.

"సుజా! అనవసరంగా నోరు పారేసుకోకు. ఇది వారి ఆస్తి. వారనుభవించగా మిగిలితేనే మనం అనుభవిద్దాం లేకుంటే ఇంకోదారి చూసుకుందాం. అంతే!" అన్నాడు.

సుజాతకు చిర్రెత్తు కొచ్చింది. కళ్ళు కోపంతో ఎర్ర

బడ్డాయి. ముక్కుపుటాలు లావెక్కాయి.

"అలాంటి దుస్థితి నేను బ్రతికుండగా రానివ్వను!" అంది.

"అది మన చేతిలో లేదు!" అన్నాడు మురళి.

"ఉంది ఆ మణిమాలను స్వర్గానికి పంపిస్తే సరి," అని అక్కడొక్క క్షణమైనా వుండకుండా చకచక వెళ్ళి పోయింది.

మురళి విస్తుపోయి చూస్తూ నిలుచున్నాడు.

"అన్నయ్యా!" అని పిలవటంతో ఇహంలో కూడి పడ్డాడు మురళి. ఎదురుగా చిన్న తమ్ముడు హరనాథ్ కను పించాడు.

"ఏంట్రా హరీ!" అడిగాడు.

"ఏం లేదు. నాకు అర్జంటుగా ఐదు లక్షలు కావాలి."

"అంత డబ్బెందుకురా?"

"నేను మద్రాసు వెళ్ళి సినిమా తీద్దామనుకుంటున్నాను."

"ఉన్న వ్యాపారాలు చాలక మళ్ళీ అదొకటెందుకు. అయినా అంత డబ్బు నాన్నగార్ని అడగకుండా ఇచ్చే అధికారం నాకు లేదు. నువ్వో మారు నాన్నగార్ని కలుసు కుని వారికి నచ్చజెప్పించు. ఐదుకాదు పది లక్షలిస్తాను," అన్నాడు మురళి.

"నీకు చెప్పాగా? చాలదూ? మళ్ళీ ఆయన కెందుకు. ఆయనతో మాట్లాడాలంటే దాని కొంపకు పోవాలి. అది నా కిష్టంలేదు" అన్నాడు హరనాథ్.

"అలాగే హరీ! ఆమెకోసం నువు పోవడం లేదు. నాన్నగారికోసం పోతున్నావు. ఆమెను అలా కించపరచి మాట్లాడటం నాన్నగారు వింటే సహించరు," అన్నాడు మురళి.

"అయితే నేను నాన్నను కలుసుకోక తప్పదంటావ్"

"తప్పదు బాబూ! నా పరిస్థితి నీకు వివరించానుగా" అన్నాడు మురళి.

"అసలు ఆ ముండను అంతం చేస్తేగాని నాన్నగారు ఇంటికిరారు. ఆయన ఇంటికొస్తేగాని, నేను మాట్లాడే వీలు లేదు," అంటూ వెళ్ళిపోయాడు హరనాథ్.

అవాక్కయి చూస్తూ నిలుచున్నాడు మురళి.

# 3

పోర్టికోలోవున్న బెంజ్ కారు వెనకగా ఆగింది ఇంపాలా కారు. వెనుక డోర్ తెరుచుకుని దిగాడు మురళి. ముందున్న కారువంక తదేకంగా నిమిషం సేపు చూసి బంగళాలోనికి నడిచాడు. హాల్లో మాటలు వినబడుతున్నాయి. ముందుకు పోవడం మాని వెనక్కి నిలుచున్నాడు.

"నా మాట నమ్మండి. దాని ఖరీదు నిజంగా మూడు లక్షలు" అన్నాడు సుందరం.

"నీ చరిత్ర నాకు తెలీదనుకోకు. నా మాటపైనే నిన్ను మానేజర్‌గా పెట్టుకున్న విషయం మరచిపోకు. రెండు లక్షలకు కొని మూడు లక్షలని చెప్పి లక్ష రూపాయలు కాజేశావు కదూ!"

సుందరం మాట్లాడలేదు.

"నమ్మిన వాళ్ళను అలా మోసం చెయ్యడం మగవాడికి తగనిపని. నీ అసలు రంగు బయట పెడితే పిచ్చి కుక్కను కొట్టినట్టు కొట్టి చంపుతారు. ఇకనైనా అలాంటి పనులు చెయ్యొద్దు," అంది మణి.

అందుకూ సుందరం సమాధానం చెప్పలేదు.

"ఆ లక్షలో పాతిక వేలుంచుకో. మిగతాది తెచ్చి యివ్వు. గంట టైమిస్తున్నాను. ఈలోగా తేకుంటే అయ్య

గారితో చెప్పి నిన్ను తగిన విధంగా సన్మానించే ఏర్పాట్లు చేయిస్తాను. సరేనా?"

"తెస్తాను. గంటలోగానే వస్తాను" అన్నాడు సుందరం.

గోడవారగా నిలుచున్న మురళిని దాటుకుని చకచక వీధిలోకి వెళ్ళిపోయాడు.

అతన్ని ముందుకు పోనిచ్చి మురళి హాల్లో కడుగుబెట్టాడు. మణి చూచింది. ఆశ్చర్యపోతూ "మీరా బాబూ!" అంది.

"అవును" అన్నాడు మురళి.

"కూర్చోండి!" అంది మణి.

మురళి కూర్చున్నాడు.

"ఏమిటిలా వచ్చారు? నాన్నగారితో ఏదైనా అర్జంటు పనుందా?"

"లేదు. మీతోనే రెండు నిముషాలు మాట్లాడుదామని వచ్చాను."

"నాతోనా? దేన్ని గురించి?"

"నీ గురించే!"

"అంటే నా కర్థం కావటంలేదు" అంది మణి.

"కాదు! ఈ డబ్బు. ఈ హంగామా నీకేమీ అర్థంగా నివ్వదు. ఈ సిరిసంపదలలో బ్రతుకెంత హాయిగా వుంటుందో అంత భయంకరంగానూ, ప్రమాదపూరితంగానూ వుంటుంది. నాకు నీపైన విరోధంలేదు. కానీ నిన్ను ఎలాగైనా అంతం చెయ్యాలని అనేక మందికి ఆలోచనగా వుంది. అందరూ సమర్థులే. ఎంత ఘోరమయినా సాహసించి చేసి చట్టానికి పట్టుబడకుండా తప్పుకోగల ఘటికులే. ఈ అద్దాల మందిరంలో నువ్వెన్నో నాళ్ళు బ్రతకలేవు. తగు జాగ్రత్తలో వుంటే ఎక్కువ రోజులు బ్రతకొచ్చు," అన్నాడు మురళి.

"మీరు నన్ను భయపెడుతున్నారా?"

"లేదు! సుందరంలాంటి వాళ్ళను భయపెట్ట వద్దని చెపు

తున్నాను. ఆ భయంలో వాళ్ళేం చేస్తారో కూడా మనం ఊహించలేం. అంతే!''

''మా మాటలు మీరు విన్నారా?''

''కుతూహలం లేకున్నా విన్నాను. నేను వచ్చి వెళ్ళిన విషయం నాన్నగారికి కూడా తెలియజెయ్యి. అవసరమనుకుంటే మీకు ఇచ్చిన సలహా సంగతి చెప్పండి. వారి సుఖం కన్నా నాకు కావలసింది లేదు,'' అంటూ ఆమె ముందునుంచి చకచక వెనుతిరిగి వచ్చి కారెక్కాడు.

మణి ప్రాన్పడి చూస్తూ నిలుచుంది.

# 4

''మీ ఫొటో చూచి కళ్ళు చెదరిపోయాయి నాకు. మిమ్మల్ని చూస్తుంటే ఇప్పుడు మతే పోతూంది. ఇంత అందం ఎలా వచ్చిందండీ!'' ముందు సీట్లో కూర్చున్న సుందరం, కారు డ్రైవ్ చేస్తూన్న ఇందిరను అడిగాడు.

ఆమె అమెరికాలో చదువు ముగించుకుని విమానంలో వచ్చింది. మద్రాసునుండి ఎస్టేటుకు పిలుచుకొచ్చేందుకు కారులో వచ్చాడు సుందరం.

''రియలీ! అంత బ్యూటీ వుందా నాలో.'' అడిగింది ఇందిర, మిర్రర్‌లో తన్ను చూసుకుంటూ.

''మీరే బ్యూటీ! బ్యూటీయే మీరు. అమెరికాలో మీ కెవ్వరూ చెప్పలేదా?''

''అక్కడంతా తొందర. మనుషులకు ఓపిక లేదు. ఎదుటి వాళ్ళ అందాన్ని చూచి ఆనందించ గల కాలం వాళ్ళ దగ్గర స్పేర్ గా వుండదు'' అంది ఇందిర. ఆమె వేళ్ళు స్టీరింగ్ వీలుమీద డాన్సు చేస్తున్నాయి.

''మీరు మా ఎస్టేట్‌లో మానేజర్‌గా చేరి ఎన్నాళ్ళ యింది?'' అడిగింది ఇందిర.

"ఆరు మాసాలయింది."

"అంతకు ముందేం చేసేవారు?"

"ఈ దేశంలో నేపాల్ రాజా గారి ఆస్తి పాస్తుల్ని అజమాయిషీ చేస్తూ వుండేవాణ్ణి."

"వారివద్ద మానుకున్నారా?"

"లేదు. వారే నన్ను మీ నాన్నగారి వద్దకు పంపారు."

"ఐ సీ. మీరు ఫామిలీతో వుంటున్నారా?"

"నాకు పెళ్ళి కాలేదండీ! ఇంక ఫామిలీ ఎలా వుంటుంది?"

"ఐ మీన్ మదర్, ఫాదర్, సిస్టర్ ఎట్ సెట్రా!"

"నాకెవరూ లేరండీ! ప్రస్తుతానికి అంతా మీ నాన్నగారే!" అన్నాడు సుందరం.

"నా కేబుల్ చూసి నాన్నగారేమన్నారు" అడిగింది ఆత్రుతగా.

"వారు చూడనేలేదు. వారు తమ స్వంత బంగళాలో నిద్రపోయి సంవత్సరమయింది. మీ అన్నయ్యగారే ప్రస్తుతం ఎస్టేటు వ్యవహారాలు చూస్తున్నారు."

"మీ మాటలు నా కర్థం కావటంలేదు."

"మీ రొస్తున్నారుగా! అంతా మీకై మీరే చూసి తెలుసుకుంటారు. మధ్య నేను చెప్పి, మీ మనస్సు పాడు చెయ్యడం ఇష్టంలేదు," అన్నాడు సుందరం.

కారు దక్కన పెద్ద కుదుపుతో ఆగిపోయింది.

"బ్రేక్ వేశారెందుకు?"

"అదేదో చెప్తే తప్ప నేనింటికిరాను," అంది ఇందిర.

వరహాలరాజుగారికి, మణికి ఏర్పడ్డ సంబంధంగురించి కాస్త చిలవలు పలవలు కలిపించి చెప్తూ, మణిమాలకు వరహాలరాజుగారి సంతానంపైన గుర్రుగా వుందనీ, అందర్నీ వాతమారిస్తే ఆస్తిమొత్తం తనకు దక్కుతుందన్న ఆలోచన చేస్తూందనీ అంటించాడు సుందరం.

"డర్టీబిచ్! దాన్ని తుపాకితో కాల్చి చంపుతాను," అంది ఇందిర.

"అలా ఆవేశపడకండి! కాల్చడం తేలికే! ఆ తర్వాత పోలీసులు, వాళ్ళ ప్రశ్నలు, జైలుజీవితం, ఇవన్నీ కూడా ఆలోచించాలి. మనం ఇంతమందిమున్నాం. ఇక దాని ఆలోచనలు సాగనిస్తామా! దాని ఎత్తులు ఎప్పటికప్పుడు నేను కనిపెట్టివచ్చి మీకు చెప్తుంటాను. మనం యిద్దరం దానికి పై ఎత్తులు ఆలోచించివేసి, దాని ఎత్తుల్ని చిత్తుచేద్దాం! సరేనా?" అన్నాడు సీట్లో కొంచెం ప్రక్కకు జరుగుతూ.

"దటీజ్ కరెక్ట్!" అంది ఇందిర కాలు ఆక్సిలేటర్ పై వేస్తూ.

మళ్ళీ కారు కదిలింది.

సుందరం, ఇందిరవంక చూస్తూ కూర్చున్నాడు. అతని మనస్సునిండా ఆమే ఆవరించింది. ఆమె నెలాగైనా లోబరుచుకుని అనుభవించాలన్న ఆలోచన బలంగా నాటుకుంది.

మరో ఐదునిముషాల్లో కారు బంగళా పోర్టికోలో ఆగింది.

"హల్లో! బేబీ! వచ్చేశావా?" అడిగాడు హాల్లోనే ఎదురయిన మురళి చెల్లెల్ని.

"అహఁ! నాన్నగారెక్కడ?" అడిగింది తనకేమీ తెలియనట్లు ఇందిర.

"నువ్వెళ్ళి రెస్ట్ తీసుకో! నాన్నగారు వస్తారు."

"చిన్నన్నయ్యకూడా లేడా?"

"ఉన్నాడమ్మా! వస్తాడు. ముందు నువ్వెళ్ళి రెస్ట్ తీసుకో?" పురమాయించాడు మురళి.

"ఎక్కడుంటారు? ఏళ్ళొచ్చినా సిగ్గులేకుండా సాని కొంపలో పడి దొర్లుతున్నాడు మీ నాన్న దాని మొహాన లక్షలు పోస్తూ. పనీపాటు లేకుండా జులాయి వెధవలా

తిరుగుతున్నాడు మీ చిన్నన్న. ఇంటిని అంటిపెట్టుకొని వుండే ఖర్మ వీరికిమాత్రమే పట్టింది,'' అంది సుజాత.

''సుజా! నువ్వెళ్లు. అనవసరంగా నోరు పారేసుకుంటే ఏంలాభం?'' గద్దించాడు మురళి.

''ఆడబడచు అడిగిందికదాని, మీరు చెప్పేందుకు మొహమాట పడుతుంటే నేను చెప్పాను. అంతే! అయినా నాకెందుకు. మీరూమీరూ ఒకటే!'' అంటూ అక్కణ్నించి వెళ్ళిపోయింది సుజాత.

''వదినెలో మార్పేమీ లేదన్నమాట!'' అంది ఇందిర.

''ఈ జన్మకు రాదు నువ్వెళ్ళమ్మా'' అన్నాడు మురళి.

ఇందిర మెట్లెక్కి తన రూంకు వెళ్ళిపోయింది.

# 5

హాల్లో సోఫాలో కూర్చుని లంకచుట్ట అంటించారు వరహాల రాజుగారు. ఆయన చుట్టూ జనం నిలుచుని వున్నారు.

''మురళీ! అన్ని వ్యవహారాలు నువ్వు సమర్థవంతంగా చూస్తున్నావు. నాకు ఆనందంగా వుంది. డబ్బుకి కక్కుర్తి పడి మన తాతల నాటినుంచి వస్తున్న ఆనవాయితీలను జరుపకుండా వుండొద్దు. మనకు డబ్బుకన్నా ప్రతిష్ఠ ముఖ్యం. ఈ సంవత్సర కాలంలో నువ్వు చేసినదల్లా ఒక్కటే తప్పు. దాన్ని తప్పుగా నేను తీసుకోను. మొత్తం వ్యవహారాలు నువ్వే చూడాలి,'' అన్నాడు రాజుగారు.

''అంత బరువు నేను మొయ్యలేనండీ! తమ్ముడికూడా కొన్ని బాధ్యతలు అప్పగిస్తే నాకు సులువుగానూ ఉంటుంది, వాడూ చేతికి చిక్కుతాడు. అలాగే ఇందిర వ్యవహారం. ఆమెకేదైనా మంచి సంబంధం చూసి పెళ్ళిచేస్తే బాగుంటుందని నా అభిప్రాయం. వీటికంతా మీరు పూనుకోవాలి'' అన్నాడు మురళి.

"హరనాథ్ చెడిపోతున్నాడు. వాడ్ని దబ్బిచ్చి మనం బాగుపరచలేం. పూర్తిగా చెడ్డాక వాడే తిరిగి మంచి మార్గాన్ని ఎన్నుకుంటాడు. ఇందిర పెళ్ళి విషయం నేను చూస్తాను" అన్నాడు వరహాలరాజు.

"మీ ఇష్టం నాన్నా!" అన్నాడు మురళి.

"మరో విషయం! మణిమాల నా వుంపుడుగత్తె మాత్రమే కాదు, నా ప్రాణం! ఆమెకు మీ ఎవరివల్లా ఎప్పుడూ ఏ విధమైన ఇబ్బందిగానీ, ప్రమాదంగానీ, అవమానంగానీ, జరగకూడదు. నన్ను గౌరవించినట్లే మీరంతా ఆమెను గౌరవించాలి. అర్థమయిందా?" అడిగాడు వరహాలరాజు.

మేడ దిగొస్తూ తండ్రి మాటలు విన్న ఇందిర కోపంతో కుతకుతలాడిపోయింది.

"మీరు మాకన్న తండ్రి! మిమ్మల్ని నెత్తిన పెట్టుకుంటాం. కానీ దాన్నెవర్నో గౌరవించమనటం కన్నతల్లిలా చూచుకోమనటం అన్యాయం. నావల్ల కాదు!" అంది ఇందిర.

"అమెరికాలో నువ్వు నేర్చుకొచ్చింది తండ్రిని ఎదిరించి పోట్లాడడంలాగుంది. నా మాట కాదంటే దాని ఫలితం ఏమిటో నీకు తెలుసు. జాగ్రత్త!" అన్నాడు వరహాలరాజు.

"నాకు రావలసిన వాటా ఇచ్చెయ్యండి. నా కిష్టమొచ్చిన వాణ్ణి పెళ్ళిచేసుకొని అమెరికాకు వెళ్ళిపోతాను."

"వాటా అంటూ లేవు. నాకు ఇష్టమైతేనే ఇస్తాను. లేకుంటే లేదు. నామాట కాదన్నావో నీకు చిల్లిగవ్వకూడా ఇవ్వవలసిన అవసరం నాకులేదు. ఆపైన నీదారి నువ్వు చూచుకుంటే నాకు అభ్యంతరంలేదు."

"చెల్లాయ్! నువ్వెళ్ళు. నాన్నగార్ని ఎదిరించి మాట్లాడకూడదు," అంటూ సర్దాడు మురళి.

ఇందిర మాట్లాడకుండా మౌనంగా వుండిపోయింది.

అంతలో హరనాథ్ లోనికొచ్చాడు.

"ఏరా హరీ! నువ్వేదో సినిమా వ్యాపారం చెయ్యాలను కుంటున్నావట" అడిగాడు కొడుకును రాజుగారు.

"అవును. మీకు అన్నయ్య చెప్పాడా?"

"లేదు! మణి చెప్పింది. నన్నెలాగైనా ఒప్పించి డబ్బిచ్చే ఏర్పాటు చేయించమని, అలా చెయ్యకుంటే చంపుతాననీ బెదరించావటగా? నిజమేనా?"

"ఆ రంకుముండ మీకంతా చెప్పిందన్నమాట. నిజమే!"

"హరీ!" పెద్దగా అరిచాడు రాజుగారు.

ఆ అరుపుకు హాలు దద్దరిల్లి అందరూ విభ్రాంతులైనారు.

"మురళీ! వీణ్ణి కాళ్ళూ చేతులూ కట్టించి చీకటి కొట్లో పారెయ్. అన్నం నీళ్ళు లేకుండా ఆరురోజులుంచు. ఆ తర్వాత చేసిన తప్పుకు క్షమాపణ చెప్పకుంటే వదలిపెట్టు. రాస్కెల్ నా కెదురు తిరుగుతాడా?" అన్నాడు రాజుగారు.

"ఏదో చిన్న వయసు. ఆవేశంతో ఆమెగార్ని అలా అని వుంటాడు తప్ప వాడటువంటి వాడు కాదని మీకు మాత్రం తెలీదా నాన్న. నేను వాడికి సర్దిచెప్తా ఇప్పుడే వాడి చేత మీకు క్షమాపణ చెప్పిస్తాను," అన్నాడు మురళి.

వరహాలరాజు గారు మౌనంగా వుండిపోయారు.

మురళి, హరనాథ్‌ను ప్రక్కకు పిలిచి ఐదు నిముషాలు మాట్లాడాడు. ఆ తర్వాత హరి తండ్రికెదురుగా వచ్చి నిల బడి క్షమించమని అడగడంతో ఆ గొడవ తగ్గింది.

"ఇవాల్టినుంచి మన మైకాగనుల అజమాయిషీ హరికి అప్పగించు. డబ్బుపెత్తనంమాత్రం వాడికివ్వకు!" అన్నాడు రాజుగారు.

"అలాగేనండీ!" మురళి తలూపాడు.

"నాకవసరంలేదు. చేస్తే సినిమావ్యాపారం చేస్తాను. లేకుంటే ఖాళీగా వుంటాను," అంటూ హరనాథ్ విసురుగా వెలుపలకు వెళ్ళిపోయాడు.

6

సీసామూత తీసింది మణి. గ్లాసులోకి బ్రాందీ వంచుతూ ఎదురుగా వున్న రాజుగారికేసి చూసింది.

"మీ ఆస్తిపాస్తులు నేను దోచుకుంటున్నానని మీ వాళ్ళందరికీ అసూయగా వున్నట్లుంది. అది ఏ క్షణమైనా కోపంగా మారవచ్చు. ఆ కోపంలో నన్ను ఎవరైనా చంపుతారన్న అనుమానం కలుగుతోంది," అంది మణి భయంగా.

"అలా ఎవరైనా అన్నట్లు నీకు తెలిసిందా?"

"చంపుతామని ఇంకా బెదరించలేదు. కానీ, జాగ్రత్తగా వుండమని రెండుమూడు హెచ్చరికలు జరిగాయి," గ్లాసందించింది.

అందుకొని అమాంతం ఒక్క గుటకలో గ్లాసెడు బ్రాందీ మింగాడు రాజు. "నిన్నెవరు హెచ్చరించారు?"

"మీ రెండో అబ్బాయి వారనాథ్. అతనేదో వ్యాపారం చేసుకుంటానంటే మీరు డబ్బివ్వనన్నారట. అందుకు బాధ్యతంతా నాదేనన్నట్లుగా మాట్లాడివెళ్ళాడు" అంది మణి మళ్ళా గ్లాసునింపుతూ.

"వాడు దుర్రబుంక. ఆవేశం ఎక్కువ. వాడి మాటలు పట్టించుకోకు!" అన్నాడు రాజుగారు.

"పట్టించుకోలేదు. అయినా జరిగింది మీకు చెప్పడం మంచిదని తోచింది."

"నిన్ను హెచ్చరించిన మరో మనిషెవరు?"

"మీ మేనేజర్ సుందరం!"

"సుందరమా! అతన్ని నువ్వేగా మేనేజర్‌గా పెట్టుకోమని రికమెండు చేసింది. డిస్మిస్ చెయ్యమంటావా?"

"వద్దు. అతనుకాదు నన్ను చంపుతానన్నది. మీ అమ్మాయికి, అబ్బాయికి, కోడలికి నాపైన గుర్రుగా వుందనీ, మీ కుటుంబవ్యవహారాల్లో నేను తలదూర్చటం మంచిది

కాదనీ హెచ్చరించాడు. అంతే!" అంది మణి.

"మావాళ్ళవల్ల నీ కేవిధమైన అపాయం రాకుండా తగిన కట్టుదిట్టం చేస్తాను. ఆ విషయం మర్చిపో. హుషారు తెచ్చుకో. ఖుషీగా వుందాం!" అన్నాడు రాజుగారు.

రాజుగారిచెయ్యి ఆమె గుండ్రటి భుజంపై పడింది...

ఐదు నిముషాలకు ఇద్దరూ అలసిపోయారు. అలాగేమంచం మీద పడుకున్నారు. మగతతో మూసుకునిపోయిన కళ్లు కలతనిద్రలో కూరిగిపోయాయి.

ఠంగ్ మని శబ్దమైంది.

మణి లేచి కూచుంది. చుట్టూ చీకటి. దూరంగా నల్లటి ఆకారమేదో చకచక పరుగెత్తి బాల్కనీలోకి వెళ్ళినట్లు చూచాయగా తోచింది. ప్రక్కనున్న రాజును లేపి తను విన్న శబ్దం గురించి చెప్పింది.

రాజుగారు లైటుస్విచ్ నొక్కాడు.

తెల్లటి వెలుతురులో టీపాయిపైనున్న బ్రాందీసీసా గ్లాసుక్రిందపడి ముక్కలు ముక్కలయి వుంది.

రాజుగారు బాల్కనీలోనికెళ్ళి చూశాడు. అరంగుళాల బ్లేడున్న కత్తి కనిపించింది. చేతికి తీసుకొని చూశారు. బ్లేడుమీద గ్రీజ్ మరకలున్నాయి. అంటే క్రొత్తదన్న మాట. తనను, మణిని హత్యచేసేందుకు ఎవరో క్రొత్త కత్తి కొని పట్టుకొచ్చారు.

అంతకుముందు మణి చెప్పిన మాటలు గుర్తొచ్చాయి.

అంటే, హరి మణిని చంపేందుకు సిద్ధమైనాడా? ఆ ప్రయత్నం తనపైన జరిగేందుకు వీలులేదు.

స్వసుఖంకోసం, మణిని తెచ్చుకున్నాడు తను. ఆమె యిచ్చే ఆనందానికి ప్రతిఫలంగా డబ్బురూపంలో తను ముట్టజెప్పింది తనకున్న మొత్తం ఆస్తిలో వెయ్యోవంతు గూడా వుండదు. అలాంటప్పుడు తన కొడుకులుగానీ, మరె

వరూ గానీ, ఈర్ష్యతో మణిని చంపేంత నీచానికి పాల్పడరు. మరి ఇప్పుడా ప్రయత్నం చేసిం దెవరు?

"చూశారా? ఇవాళిలాగో తప్పించుకున్నాను. నన్ను చంపంది నిద్రపోరు. తెల్లారగానే నేపోతాను," అంది మణి.

"అలాగనకు మణీ! నిన్ను అడుగడుగునా కనిపెట్టివుండి రక్షించేందుకు అవసరమైన ఏర్పాట్లు చేస్తాను."

"ఏమిటూ ఏర్పాట్లు?"

"నమ్మకమైన మనుషుల్ని ఇంటికి కాపలా పెడతాను."

"నమ్మకమేమిటండీ! మనం నమ్మకమైన వ్యక్తులనుకొన్న వాళ్ళకీ లోగొట్టుకొని గుట్టుచప్పుడుకాకుండా గొంతు పిసికేస్తే చేసేదేముంది?"

"అలా బెంబేలుపడకు. నేను ఇక్కడే వుంటాను. మరో నలుగురు నాకు నమ్మకమున్న వాళ్ళను తెచ్చిపెడతాను. ఈలోగా మా అబ్బాయిలనికూడా ఓమారు హెచ్చరిస్తాను. నువ్వు నిర్భయంగావుండు," అన్నాడు రాజుగారు.

## 7

ఇందిర బట్టలన్నీ విప్పేసుకుంది. కట్ డ్రాయరు, బ్రా మాత్రమే వున్నాయి శరీరంమీద. ఎదురుగావున్న అద్దంలో తన్నుతాను చూసుకుంటూ వ్యాయామం చేయడం ప్రారంభించింది. చేతులు రెండు పైకెత్తింది. వాట్ని క్రిందకుదించి కాళ్ళ బొటనవ్రేళ్ళు పట్టుకుంది నడుంవంచి. అలా నాలుగైదు సార్లు చేసింది.

గది తలుపులు మూసివున్నాయి. వెలుపలున్న సుందరం తాళంచెవి బిగించే రంధ్రంగుండా కన్నార్పకుండా లోన ఇందిర చేస్తున్న ఫీట్సు చూడసాగాడు. అతనిలో ఆమె అందం ఆవేశం రగుల్కొల్పింది.

మెల్లగా తలుపు తట్టాడు.

ఇందిర కంగారుపడుతూ, టర్కిష్కోటు తొడుక్కుని వచ్చి తలుపు తెరిచింది. ఎదురుగా సుందరం కన్పించాడు.

"ఏమిటండీ! ఇలా వచ్చారు!" అడిగింది.

"మీతో అర్జంటుగా మాట్లాడాలి."

"లోనికి రండి!" అంటూ ప్రక్కకు తప్పుకుంది.

"రాత్రి మణిమాలను ఎవరో హత్యచేసేందుకు ప్రయత్నించారు. హంతకుడు వెళ్ళిపోతూ తను తెచ్చిన కత్తి పారేసుకున్నాడట. మీ నాన్నగారు క్రిందహాల్లో వున్నారు. అందరిపైనా కారాలు మిరియాలు నూరుతున్నారు. మిమ్మల్ని క్రిందకు పిల్చుకొని రమ్మని పంపారు."

"నన్నా? ఎందుకు?"

"ఏమో! తెలీదు?"

"నేను బట్టలు మార్చుకుని వస్తాను. మీరు పదండి."

"బట్టలు లేకుండానే అందంగావున్నారు. ఆ అందం చూసే అదృష్టం నాకు కలిగింది," అన్నాడు నవ్వుతూ.

"యూ! నాటీ! ఎప్పుడు చూశారు?"

"ఇప్పుడే! అదిగో ఆ రంధ్రంగుండా చూశాను. లోనికి రాబోయేముందు ఆ ఆవేశంలో నేనేం చేస్తానో నాకే అర్థంగా లేదు."

"మరేం చెయ్యలేదే?" క్రింది పెదవిని పంటితో కొరుకుతూ అంది ఇందిర.

"మీరేమన్నా అంటారేమోనని భయపడి" నసిగాడు.

"అలా భయపడేవాడివి నువ్వేంచేయగలవు? అలాంటి పిరికిపందలంటే నాకు అసహ్యం" అంది ఇందిర.

ఆమె మాటలు పూర్తికాకముందే సుందరం ఆమెపైకి సింహంలాదూకి తన బిగికౌగిట్లో ఆమెను పొదివి అదిమిపట్టుకున్నాడు. అతన్ని ప్రక్కకుతోస్తూ "ఇది సమయంకాదు. క్రింద నాన్నగారు వెయిట్ చేస్తున్నారు. ముందు మీరు

వెళ్ళండి. తర్వాత నేనొస్తాను'' అంది.

''మరి మనం కలుసుకొనే దెప్పుడు?''

''తర్వాత చెప్తాను'' అంది అతన్ని వదుల్చుకుంటూ.

ఐదు నిముషాల తర్వాత హాల్లో అంతా పోగయినారు. వరహాలరాజుగారుమాత్రం కూర్చొని వున్నారు. మిగిలిన వాళ్ళంతా నిలబడే వుండిపోయారు.

''మీలో చాలామందికి మణిమాలపైన కోపమున్నట్లు తెలుసుకొన్నాను. ఆమె నాకు భార్యతో సమానం. నాకు మీరెలాంటి గౌరవమిస్తారో ఆమెకు అలాంటి గౌరవమే ఇవ్వాలి. రాత్రెవరో ఆమెను హత్యచేసేందుకు ప్రయత్నించారు. కానీ వాళ్ళ ప్రయత్నం ఫలించలేదు. ఆ హంతకుడ్ని మీలో ఎవరైనా పురికొల్పి పంపివుండవచ్చు. ఈమారు క్షమిస్తున్నాను. మరోసారిలా జరిగిందంటే ఆ స్వంతా ఆమెపేర రాసి, ఆమెను తీసుకొని విదేశాలకు వెళ్లిపోతాను,'' అన్నాడు రాజుగారు.

''నాన్నగారూ! అంత నీచానికి పాల్పడే అవసరంగానీ, తత్వంగానీ మాలో ఎవ్వరికీ లేవు. మీ సుఖమే మా ఆనందం. అలాంటి సంఘటనలు మళ్ళీ జరగకుండా తగిన కట్టుదిట్టం చేస్తాను,'' అన్నాడు మురళి.

''అమ్మ నగలు, ఇంట్లోవున్న డబ్బు అంతా ఆ మణిమాల ఇంట్లో ఉన్నట్లు దొంగలకూ్కడా తెలిసిపోయి నట్టుంది. అందుకే అంత సాహసానికి తెగించారు'' అన్నాడు హరి.

''నా రక్తం పంచుకొని పుట్టారు. నాకు ఆనందాన్నిచ్చేందుకు వచ్చిన ఆ అమాయకురాలిపైన అఘాయిత్యం చెయ్యొద్దని మళ్ళీ చెపుతున్నాను. అలా మీలో ఎవరైనా చేసినట్లుగానీ, చేయించినట్లుగానీ తెలిస్తే నేనేం చెయ్యాదలచుకొందీ ముందే చెప్పాను. ఇంక మీరు వెళ్ళవచ్చు'' అన్నాడు.

అందరూ వెళ్ళిపోయారు.

సుందరం మాత్రం అక్కడే నిలబడ్డాడు.

"మిస్టర్ సుందరం మన ఎస్టేట్‌లో పనిచేసే మెరికల్లాంటి నలుగురు వస్తాదుల్ని మణి బంగళాకు కాపలాగా వుంచు," అన్నాడు రాజుగారు.

"అలాగే నండీ!"

"నువ్వు అనవసరంగా మణిని కలుసుకోవడం, లేనిపోనివి చెప్పి, ఆమెలో భయం రేకెత్తించడం నాకు యిష్టంలేదు. అక్కడకు నీ రాకపోకలు తగ్గించు" అన్నాడు రాజుగారు.

"అలాగే సార్!"

"మరో విషయం. హరికి ఐదు లక్షలివ్వు. వాడిష్టప్రకారం ఆ వ్యాపారమేదో తగలడమని చెప్పు," అన్నాడు.

"ఇప్పుడే ఇస్తాను."

"మంచిది" జేబులో నుండి చుట్టతీసి వెలిగించుకొన్నారు.

సినిమా తీసే మిషపైన హరి వెళ్ళిపోతాడు. ఇందిరకు పెళ్ళి చేసేస్తే ఆమెకూడా అత్తగారింటికి పోతుంది. ఇక మిగిలింది మురళి. తన మాటకు కలలో గూడా ఎదురు చెప్పి ఎరుగని పితృ వాక్య పరిపాలకుడు. అతనివల్ల మణికి ఏ విధమైన అపాయం జరుగదు. ఈదెబ్బతో తన సుఖానికే అంతరాయం ఉండదు.

## 8

రాత్రి ఒంటి గంటయింది.

హరనాథ్ బట్టలన్నీ సర్దుకున్నాడు. అన్నయ్యను అడిగి ఇంపాలా కారు తాళాలు తీసుకున్నాడు. టాంక్ నింపాడు పెట్రోలుతో. తెల్లారాక తను మద్రాసుకి వెళ్ళిపోతున్నాడు.

గాడ్రెజ్ అల్మైరాతీసి అందులోవున్న డబ్బంతా తెచ్చి మంచంపైన వేసుకుని కూర్చున్నాడు. అన్నీ వందరూపాయల నోట్లే. మొత్తం యాభై కట్టలు. దీన్ని పదింతలు చెయ్యాలి. డబ్బంతాతీసి మళ్ళీ యథాస్థానంలో పెట్టాడు. అల్మైరా

మూస్తూండగా లైటారిపోయింది. కరెంటు పోయిందేమోననుకుంటూ వెలుపల లైట్లు వెలుగుతున్నాయేమో చూద్దామనుకుని కిటికీవద్దకు వెళ్ళాడు.

అక్కడా చీకటి కనుపించింది.

వీపుపైన చురుక్కుమంది. వెనక్కి తిరగబోయాడు. కానీ వెంట వెంటనే కత్తిపోట్లు తగిలాయి. ఏదో చెయ్యి వెనుక నుండి ముందుకొచ్చి నోరు నొక్కిపట్టింది. రెక్కలు తెగిన పక్షిలా గిలగిల కొట్టుకున్నాడు హరనాథ్. నిముషంలో నేల కొరిగింది అతని ఆకారం.

ఆగంతకుడు తన పని ముగించుకొని వెళ్ళిపోయాడు.

మళ్ళీ లైట్లు వెలిగాయి.

లైటు వెలుగులో, రక్తపు మడుగులో, తెల్లవారిందాకా హరనాథ్ శవం అలా గేపడిఉండిపోయింది. కాఫీటిఫిను తెచ్చిన నౌకరు తలుపులుతీసి ఉండడం చూశాడు.

లోనికెళ్ళి హరనాథ్ శవాన్ని చూసి నోరు వెళ్ళబెట్టి "బాబోయ్; హత్య!" అని పెద్దగా అరిచాడు.

హాల్లోవున్న జనమంతా మేడమీది గదిలో కొచ్చారు.

మురళి తమ్ముడి శవంప్రక్క నిలబడ్డాడు. అతని కళ్లు చెమ్మగిల్లాయి. అప్పుడే వచ్చిన ఇందిర జరిగిన ఘోరాన్ని చూసి "చిన్నన్నయ్యా!" అంటూ బావురుమని ఏడ్చింది.

అప్పుడే లోనికొచ్చిన సుందరం "ఏమిటీ ఘోరం?" అడిగాడు. ఎవరూ జవాబు చెప్పలేదు.

"నాన్నగారికి ఫోన్ చేసి చెప్పండి," అన్నాడు మురళి.

"చేస్తాను. నిన్న సాయంత్రం హరనాథ్‌కు డబ్బిచ్చాను. అది ఉందో లేదో చూడండి" అన్నాడు సుందరం.

మురళి, ఇందిర, సుజాత, చకచక సూట్‌కేస్‌లు, అల్మేరాలు, మొత్తం గాలించారు. ఎక్కడా డబ్బు కనిపించలేదు.

"ఎక్కడా లేదు?"

"అయితే ఆ డబ్బుకోసమే ఎవరో చిన్నబాబును హత్యచేసి వుంటారు. నేను పోలీసులక్కూడా ఫోన్ చేస్తాను," అన్నాడు సుందరం.

"వద్దు! ముందు మామగార్ని రానివ్వండి. ఆ తర్వాత చూద్దాం," అంది సుజాత.

ఇందిర వదినకేసి చూసింది. సుజాత మాట్లాడకుండా చూస్తూ నిలుచుంది.

సుందరం హాల్లోకి వెళ్ళి వరహాలరాజుగారికి ఫోన్ చేశాడు.

మరో రెండునిముషాలకల్లా వరహాలరాజుగారు వస్తూనే "బాబూ! హరీ!" అంటూ శవం మీదపడి గుండెలు బాదుకుంటూ ఏడ్చాడు.

మురళి, ఇందిర, తండ్రిని చిన్నగా లేవదీసి ఓరడించారు.

"పోలీసులకింకా ఫోన్ చెయ్యలేదండీ! మీ కోసం ఎదురు చూస్తూండి పోయాం!" అన్నాడు సుందరం.

"ఫోన్ చెయ్యండి, రమ్మని," అన్నాడు రాజుగారు.

"ఈ వయస్సులో నాకీ కడుపుకోత ఏమిటి? మీ అమ్మ పోయింది మొదలు మిమ్మల్ని కళ్ళల్లో పెట్టుకుని పెంచాను. హరి ఇలా నా ముందే అంతమవుతాడని నేనూహించలేదు," అంటూ మళ్ళీ కంట తడి పెట్టుకున్నారు రాజుగారు.

"పోలీసు లొస్తారుగా బాబూ! వాళ్లు హంతకుణ్ణి సులభంగా పట్టుకుంటారు. పైగా డబ్బుకూడా దొంగిలించాడాయె అవన్నీ బాంకునుండి తెచ్చిన కొత్త నోట్లు. వాటి నంబర్లన్నీ మన దగ్గరున్నాయి. మీరు ధైర్యంగా వుండండి. హరిని చంపిన దుర్మార్గుణ్ణి మాత్రం ఉరికంబ మెక్కించడం మాత్రం ఖాయం!" అన్నాడు సుందరం.

"నాన్నా! పోలీసులెటూ వస్తారు. వాళ్ళపని వాళ్లు చేసుకు పోతారు. నాకు తెలిసిన ప్రఖ్యాత ప్రయివేట్ డిటెక్టివ్ గారున్నారు. వార్ని పిలిపిస్తే హంతకుణ్ణి సులభంగా పట్టు

కుంటారు. వారు మొన్న నాతో అమెరికా నుండి విమానంలో వచ్చారు!" అంది ఇందిర.

"ఆయన పేరేమిటి?" అడిగాడు మురళి.

"సుధాకర్."

"ఆయన్ని గురించి నేనూ విన్నాను. అలాగే పిలిపిద్దాం," అన్నాడు మురళి.

"పోలీసులు చెయ్యలేంది డిటెక్టివ్‌లు చెయ్యగలరా. అనవసరంగా డబ్బు దండుగ తప్ప," అంది సుజాత.

"ఆవిడగారి మాటా నిజమే!" అన్నాడు సుందరం.

"డబ్బు, డబ్బు, డబ్బు!!! తరగనంత ఉంది మనదగ్గర. దాని మొహం చూడని వాళ్ళ సలహాలు మా కక్కర్లేదు. ఇప్పుడే ఫోన్ చేసి రమ్మంటాను," అంది ఇందిర తండ్రితో.

"అలాగేనమ్మా! నీ యిష్టం," అన్నాడు రాజుగారు.

ఇందిర దిగి క్రిందకు వెళ్ళిపోయింది. రాజుగారు చుట్టతీసి వెలిగించుకున్నారు. దూరంగా కారొచ్చి ఆగిన చప్పుడైంది.

"పోలీసులొచ్చారు!" అన్నాడు సుందరం.

రెండు నిముషాల్లో పోలీసు పటాలం గదిలో కొచ్చింది.

# 9

ఇన్‌స్పెక్టర్ ఈశ్వరరావు రాజుగారి ముందు నిలబడ్డాడు. అతనికి ఆయనంటే గౌరవంతో బాటు భయంకూడా వుంది. కారణం వారి ఔదార్యంవల్లే డిగ్రీ తెచ్చుకో గలిగాడు.

"మీరు దిగులు పడకండి సార్! ఆ దురాగ్రహణి పట్టుకో నే పూచీ నాది" అన్నాడు ఈశ్వరరావు.

బదులు చెప్పకుండా మౌనంగా కూర్చున్నాడు రాజుగారు.

పోలీస్ డాక్టరొచ్చి "కత్తిపోట్లు బలంగా తగిలాయి. హంతకుడికి మంచి దేహదార్ఢ్యం వున్నట్లుంది. గాయం అంగుళం వెడల్పున, నాలుగంగుళాల లోతున వుంది. మరణం వెనువెంటనే సంభవించింది," అన్నాడు తన ప్రాథ

మిశ్ర పరిశోధన ఫలితాన్ని తెలియజెపుతూ.

"పోస్టుమార్టం చేశాక మీ రిపోర్టు త్వరగా పంపండి!"

"అలాగే!"

అంతలోనే ఫింగర్ ప్రింట్ ఎక్స్‌పర్ట్ వచ్చి ఏ విధమైన వ్రేలిముద్రలు దొరకలేదన్నట్లు పెదవి విరచాడు.

పోలీసులు హరిశవాన్ని పోస్ట్ మార్టంకోసం తరలించారు. ఆ గదిని సీలు చేశారు.

అందరూ వెళ్లిపోయారు. ఈశ్వరరావుకు జరిగిందంతా చెప్పాడు సుందరం. అతను క్రిందకువెళ్ళి నౌకర్లను, వంట పనివాడ్ని, తోటమాలిని రకరకాల ప్రశ్నలతో వేధించాడు. ఎవ్వరూ ఏమీ చెప్పలేకపోయారు.

ఆ మధ్యాహ్నానికి డిటెక్టివ్ సుధాకర్, అతని అసిస్టెంటు వసంత ఎస్టేటు చేరుకున్నారు.

"థాంక్ యూ సార్! ఫోన్ చెయ్యగానే వచ్చారు" అంది ఇందిర ఎదురొచ్చి.

పరస్పర పరిచయాలు అయ్యాక ఇందిర, హరి హత్యను గురించి వివరంగా తనకు తెలిసినంతవరకు చకచక చెప్పుకు పోయింది. మాటలమధ్య వాళ్ళకు తెలీకుండానే మేడ మెట్లెక్కారు.

హరి గది చూపించింది. దానికి సీలువేసి వుండడంతో మళ్ళీ క్రిందకు దిగి వచ్చారు.

వరహాలరాజుగారు, మురళి, సుజాత, సుందరం అంతా అక్కడే వున్నారు.

"ఇందిర ద్వారా హత్యకు సంబంధించిన వివరాలు కొన్ని తెలిశాయి. జరిగిందాన్ని బట్టి ఆలోచిస్తే ఇంకొన్ని హత్యలు జరిగే అవకాశం వున్నట్లు తోస్తూంది. నేను కొద్ది రోజులు నా అసిస్టెంటుతో సహా ఇక్కడే వుంటాను. ఎందుకైనా ఎవరి జాగ్రత్తలో వాళ్ళుండటం మంచిది. డబ్బుకోసమే

జరిగిన హత్యయితే హరనాథ్‌ను డబ్బుకోసం బెదిరించి తీసుకొనిపోవాలి. వెనకగుండా వెళ్ళి కత్తితో పొడిచి చంపాల్సిన అవసరం నాకు కనుపించడం లేదు,'' అన్నాడు.

"జరిగింది చాలక ఇంకా కొన్ని హత్యలు జరుగుతా యంటారా?" అడిగాడు రాజుగారు.

"అనే నా అభిప్రాయం. అయినా అలాంటిది జరగకుండా నా శాయశక్తులా ప్రయత్నిస్తాను," అన్నాడు సుధాకర్.

# 10

సుధాకర్ కిటికీ వారగా రాకింగ్ చెయిర్ వేసుకుని ముందుకూ వెనక్కూ ఊగుతూ సిగరెట్ కాలుస్తూ, ఆలోచించుకోసాగాడు.

ఇంతలో ఇన్‌స్పెక్టర్ ఈశ్వరరావు వచ్చి తన్నుతాను పరిచయం చేసుకొన్నాడు.

తర్వాత "మీ పరిశోధన ఎంతదూరం వచ్చింది?" అడిగాడు సుధాకర్.

"అందర్నీ ప్రశ్నించాను. ఎవ్వరూ మన కుపయోగించే చిన్న సమాచారం కూడా చెప్పలేకపోయారు," అన్నాడు.

"మెయిన్ డోర్ దగ్గరున్న వాళ్లెవ్వరూ తమకు తెలిసీ లోపలి కెవ్వరూ వెళ్ళలేదన్నారు. అలాగే వెలుపలకు వెళ్ళ లేదని అంటున్నారు. కిటికీలో గుండా ఎవ్వరూ హరనాథ్ గదిలోకి రాలేరని మనకు చూస్తేనే తెలుస్తూంది. అయితే హంతకు డెలా వచ్చాడు?"

"అదే సార్ నాకు అర్థం గానిది."

"ఆ కాపలా వాళ్లు అబద్ధం చెప్తూనన్నా వుండాలి. లేదా హంతకుడు లోపలే వుండి వుండాలి," అన్నాడు సుధాకర్.

"కాపలా వాళ్ళను అడిగాను. వాళ్లు తమకు తెలీదంటు న్నారు. రాజుగారుకూడా వాళ్లు చాలా నమ్మకస్తులనీ, వాళ్ళు చెప్పేది నమ్మవచ్చన్నారు!" అన్నాడు ఈశ్వరరావు.

"అలాగైతే హంతకుడు లోపలే వుండాలి."

"అదెలా సాధ్యం."

"అసాధ్యమంటూ ఏదీ లేదు. హత్యజరిగిన రోజు రాత్రి బంగళాలో వున్న వ్యక్తుల లిస్టు మీదగ్గరుంటే ఇవ్వండి. వీలైతే రాత్రికి బంగళాచుట్టూ అక్కడక్కడా పోలీసుల్ని పెట్టండి. అనుమానం కలిగించే విధంగా ఎవరన్నా ప్రవర్తిస్తే పట్టుకొని సేషనులో పెట్టమనండి. మిగిలింది నేను చూసుకుంటాను," అన్నాడు సుధాకర్.

"మళ్ళీ మరో హత్య జరుగుతుందంటారా?" అడిగాడు ఈశ్వరరావు.

"హత్యమాటటుంచుదాం. హంతకుడు బంగళా లోపలి వ్యక్తేననుకున్నాం. రాత్రి అతను వెలుపలకు వెళ్ళలేదు. ఆ డబ్బుకూడా వెలుపలకు వెళ్ళలేదు. అటు మీరూ, ఇటు నేనూ హంతకుణ్ణి పట్టుకునేందుకు తయారయివున్నాం. ఇప్పుడు డబ్బు ఎవరివద్ద దొరికితే వాళ్ళే హంతకులని మనకు ఋజువవుతుంది. అందువల్ల కనీసం ఆ డబ్బునన్నా వెలుపలకు జేర్చే ప్రయత్నం జరుగుతుంది" అన్నాడు సుధాకర్.

"మీరు చెప్పినట్లే చేస్తాను. వస్తాను" అంటూ ఈశ్వరరావు వెళ్ళిపోయాడు.

అప్పుడే వసంత లోనికొచ్చింది.

"నువ్వేం సమాచారం సేకరించుకొచ్చావ్?" అడిగాడు.

"ఈ ఇంట్లో ఒక్క ఇందిరతప్ప మిగిలిన వాళ్ళంతా నన్నుచూస్తే పిశాచాన్ని చూచినట్లు భయపడి దూరంగా తప్పుకున్నారు. పలకరిస్తేకూడా పలక్కుండా వెళ్ళి పోతున్నారు" అంది వసంత.

"ఇందిరేమంటుంది?"

"చనిపోయిన వారికా స్తదురుసుగా వ్యవహరిస్తాడేతప్ప, మనస్సు చాలా మెత్తనిదట. అతని కెవ్వరూ విరోధులు

లేరంటుంది. వరహాలరాజుగారు వుంచుకున్న మణిమాలంటే అతనికి గిట్టదట. అతనేదో బిజినెస్ చేసుకుందామని డబ్బు డిగితే రాజుగారు ఇవ్వనన్నారట. తండ్రి అలా అనడానికి ఆమే కారణమనుకుని వెళ్ళి, మణిమాలను నాలుగు దులిపి వచ్చాడట'' అంది వసంత.

''రాత్రి ఆమెపైన హత్యా ప్రయత్నం జరిగిందని కదూ వాళ్ళు చెప్పింది.''

''అవును. అది హరి చేయించివుంటాడని, ఒకవేళ మణిమాల ఎవరినన్నా హరిని హత్య చేయించేందుకు పురమాయించిందేమో!''

''వెలుపలి వాళ్ళెవరు లోనికి వచ్చేందుకు వీలులేదని ఈశ్వరరావు అంటున్నాడు.''

''లోపల వాళ్ళనే ఆమె లోగొట్టుకుందేమో?''

## 11

ఆ రాత్రి అంతా కలిసి భోం చేశారు.

వరహాలరాజుగారు కూడా ఇంట్లోనే వుండిపోవటం, మురళికి, సుందరానికి, ఇందిరకు ఆశ్చర్యం వేసింది.

ఒక్కొక్కరే టేబిల్ వద్దనుండి లేచిపోసాగారు. సుందరం మెల్లగా భోజనం చేస్తున్నాడు. ఆఖరకు అతనొక్కడే మిగిలాడు. గదిలోంచి వెళ్ళిపోయిన ఇందిర తిరిగి లోనికొచ్చింది.

''తలుపులు తీసివుంచుతాను, ఎవ్వరి కంటబడకుండా రా?'' అంది సుందరాన్ని. అలాగే నన్నట్లు తలూపాడు.

సుధాకర్, వసంత ఒక్కొక్క గదే వచ్చి చూశారు. కిటికీలన్నీ తామే స్వయంగా బిగించి, తలుపులు లోపల్నుంచి వేసుకోమని ప్రతి ఒక్కరికీ చెప్పారు. అన్ని గదులు పరిశీలించడం అయినాక వచ్చి తమకు ఏర్పాటు చేసిన గదిలో కూర్చున్నారు.

"బహుశా ఈ రాత్రికేమీ జరగకపోవచ్చు," అంది వసంత.

"మన విషయం వాళ్ళకు తెలుసుగా, అందుకని వాళ్ళ జాగ్రత్తలో వాళ్ళుంటారు" అన్నాడు సుధాకర్.

పనివాడొచ్చి తలుపు తట్టాడు. వసంత వెళ్ళి తలుపుతీసింది.

"పాలమ్మా!" అంటూ ఫ్లాస్కు అందించాడు.

వసంత దాన్నందుకుని తలుపులు మూసి వచ్చి కూర్చుంది.

"ఆ మణిమాలను చూసొచ్చావు గదా! ఆమె వద్ద ఏమైనా సమాచారం తెలిసిందా?"

"ఆవిడను నేను మద్రాసులో ఒకటి రెండుసార్లు చూశాను. డాన్సు ప్రోగ్రాములిస్తూండేది. దాంతోపాటు సినిమాలలో చిన్న చిన్న వేషాలు వేస్తూండేది. వరహాల రాజుగార్ని ఎలా వల్లో వేసుకుందో అర్థంగావడం లేదు."

"ఈ ఎస్టేటు మానేజరుగా వున్న సుందరంతో ఆమె కేమైనా సంబంధం వుందేమో మనం తెలుసుకోవాలి. రేపు అతని ఫోటో ఒకటి సంపాదించు. పోలీస్ కమీషనరుగారికి పంపుదాం. ఆమే హరిని హత్య చేయించిందనుకోవడానికి ఆధారం లేకుండా వుంది. వరహాలరాజుగారు ఆమెను అంటి పెట్టుకునే వున్నారట. హత్య చేసేందుకు ఆమెకు కారణం వుంది కానీ అవకాశం లేదు" అన్నాడు సుధాకర్.

"అవును బాస్! నాకూ అలాగే తోచింది."

"మన రాకపట్ల ఏదైనా ఇబ్బంది పడుతున్నట్లుతోచిందా నీకామె మాటల్లో."

"అలాంటిదేమీ లేదు అసలే నటి. కాస్త అందంగా కన్నీళ్ళు పెట్టుకుంది అంతే!" అంది వసంత.

సుధాకర్ వాచీ చూశాడు. గంట పదకొండయింది.

క్రైమ్ జర్నలు అందుకుని చదువుకోసాగాడు.

వసంత నడవలో కొచ్చింది. లైట్లన్నీ ఆరిపోయాయి. ఎక్కడా ఏ విధమైన అలికిడీ లేదు.

ఓ మారు అన్ని గదులవంకా చూసింది. తనున్న వరుసలో మూడు గదులున్నాయి. ప్రక్కనున్న గదిలో ఇందిరుంది. దానవతల మురళి వున్నాడు. ఎదురుగానున్న వరుస గదుల్లో రాజుగారు, సుందరం వున్నారు. మూడో గదిఖాళీ.

# 12

ఇందిర చీకట్లో మంచంపైన పడుకుని చెవులు రిక్కించి వినసాగింది. ఆవేశం అపుకోలేక సుందరాన్ని రమ్మన్నదేగానీ, పరాయిమనుషులు ఇంట్లో ఉన్నప్పుడు అతను రావడం ప్రమాదమన్నది ఆమెకు ఆలస్యంగా అర్థమైంది.

తలుపులు తెరచి పెట్టకుండా లోనుంచి బిగించి వేస్తే, వచ్చి చూసుకుని తిరిగి వెళ్ళిపోతాడు. అలా చేద్దామని తోచింది. అతను రావడం తలుపులు తట్టడం, తన గది ముందు వెయిట్ చెయ్యడం, ప్రమాదమనుకుంది.

తలుపుల దగ్గర అలికిడయింది.

ఇందిర లేచి కూచుంది చీకట్లో. నల్లటి సూటులోవున్న ఆకారం లోనికొచ్చి తలుపులు బిగించింది. ఆవేశం అపుకో లేక నగ్నంగానే వున్న ఇందిర మంచం దిగి, ప్రియుడి కెదురెళ్ళి ఒక్క వుదుటున అతన్ని కౌగలించుకుంది గట్టిగా.

మరుక్షణంలో కుప్పలా నేల కూలిపోయింది ఇందిర, కడుపు చేతపట్టుకొని.

అంతలో ఎవరో తలుపులు తట్టారు.

అతను మెల్లగా తలుపులు తీసి, తలుపు వారగా నక్కాడు. వెలుపలి వ్యక్తి లోనికి రాగానే, ఆ గంతకుడు వెలుపలకు తప్పుకున్నాడు. లోనికొచ్చిన వ్యక్తి కాళ్ళకేదో మెత్తగా తగిలింది. చీకట్లోనే కళ్ళు చిట్లించి చూశాడు.

వెంటనే స్విచ్ నొక్కాడు. లైటు వెలిగింది. ఇందిర

పొత్తికడుపు దగ్గర దూసుకుపోయిన తుపాకిగుండు చేసిన గాయంలోంచి రక్తం వరదలుగా కట్టుకొని ప్రవహిస్తూంది.

“బాస్! ఏమైంది?” అడిగింది వెనుకనుండి వసంత.

“ఇందిర నెవరో హత్యచేశారు.”

“నువ్విక్కడే వుండు వస్తాను” అంటూ సుధాకర్ గబగబ వెలుపలకు వెళ్ళిపోయాడు. అందరి గదులూ తట్టి నిద్రలేపాడు. రాజుగారు తట్టగానే తలుపు తెరచారు. మురళి రెండు నిముషాలకుగాని వచ్చి తలుపు తీయలేదు. అతను నిద్రపోయినట్లు కనుపించలేదు సుధాకర్ కి.

సుందరం ఐదునిముషాలు తడితేగాని నిద్ర లేచిరాలేదు. అందరికీ జరిగిన ఘోరం వివరించాడు సుధాకర్. ఒక్కరికీ నోటిమాట రాలేదు. అంతా ఇందిర గదిలోకివచ్చారు. తలుపుల కున్న గడియల్ని తాకొద్దని అందరికీ హెచ్చరించాడు. వసంతను పోలీసులకు ఫోన్ చెయ్యమన్నాడు సుధాకర్.

చిన్నపిల్లాడిలా వెక్కిళ్లుపెట్టి ఏడవసాగారు రాజుగారు.

“ఈ యింటకేదో శనిపట్టింది. దీన్నెలాగైనా వదలగొట్టాలి. సుధాకర్ గారూ మీరే ఈ పనికి పూనుకోవాలి,” అన్నాడు సుందరం.

“హత్య జరుగుతుందని అనుమానించాను. కానీ ఇంత తెలివిగా, నన్ను దెబ్బ తీయగలడని ఊహించలేకపోయాను. మీరు కాస్త ధైర్యంగా వుండండి,” అన్నాడు సుధాకర్.

మణిమాల లోనికొచ్చింది. ఆమెరాక గదిలోకి క్రొత్త వెలుతురు తెచ్చినట్లయింది.

“మణీ! అమ్మాయిని దారుణంగా ఎవరో హత్యచేశారు. నా సంతానాన్ని సమూలంగా నాశనం చేసేందుకెవరో కక్ష గట్టారు” అంటూ ఆమె వొళ్ళోతలబెట్టుకొని బావురుమన్నారు. మణి కూడా రాజుగార్ని ఓదార్చసాగింది.

ఈశ్వరరావు మళ్లీ పటాలంతో లోనికొచ్చాడు.

జరగవలసిన తతంగమంతా యధావిధిగా జరిగిపోయింది. హత్య కుపయోగించిన రివాల్వరు దొరకలేదు. తలుపులకున్న గడియలపైన, మరెక్కడగానీ హంతకుడి వ్రేలిముద్రలు లేవు.

# 13

"రాత్రి పాల ఫ్లాస్కు తెచ్చిచ్చింది నువ్వేగదూ!" అడిగాడు సుధాకర్ ఎదురుగావున్న నలభై సంవత్సరాల కోటయ్యను.

"అవును దొరా!"

"మాకు మాత్రమే ఇచ్చావా? లేక అందరికీ ఇచ్చావా?"

"అందరికీ ఇచ్చాను సార్!"

"ఫ్లాస్కులన్నీ ఒకేమారు తెచ్చావా?"

"లేదు సార్ ముందు మిగిలిన వాళ్ళకు తెచ్చియిచ్చాను. ఆ తర్వాత వెళ్ళి మీకు తెచ్చాను."

"అలా ఎందుకు చేశావ్? అన్నీ ఒక్కమారు ఎందుకు తేలేదు."

"వంటమనిషి మామూలులాగే ముందు మూడు ఫ్లాస్కుల్లో నింపి ఇచ్చింది. అయ్యగారు ఇక్కడే వున్నారని చెప్పాను. మరో ఫ్లాస్కులో మిగిలినవి పోసింది. తర్వాత మీ గురించి చెప్పాను' కాచిన పాలయిపోయినాయని, మళ్ళీ కాస్తానని, ఈ లోపల వెళ్ళి మిగిలినవాళ్ళకిచ్చి రమ్మని చెప్పింది."

"అప్పుడెవరన్నా అక్కడున్నారా?"

"లేదు దొరా! అదీ నేనూ మాత్రమే వున్నాం."

"మళ్ళీ నువ్వు తిరిగి వెళ్ళేసరికి వంట మనిషక్కడే వుందా ఇంకెవరయినా వున్నారా?"

"నేను మేడమీద కెళ్ళబోయే ముందు సుజాతమ్మగారు వంటగది గుమ్మంలో ఎదురొచ్చారు. మళ్ళీ నేను తిరిగొచ్చేసరికి ఆమె కనిపించలేదు."

"నువ్వెళ్లు" అంటూ దూరంగా నిలుచున్న కాంతమ్మను

పిలిచాడు. "వంట పని నువ్వేనా చేసేది?"

"అవును బాబూ!"

"కోటయ్య చెప్పిందంతా నిజమేనా?"

"నిజమే బాబూ!"

"సుజాతమ్మ గదిలోకి ఎందుకొచ్చింది."

"మురళియ్యగారికి కడుపు నొప్పిగా ఉందని కాస్త వాము గావాలంది. ప్రక్కనున్న స్టోర్ రూంలోకి వెళ్ళి తెచ్చిచ్చాను. తీసుకొని అమ్మగారు వెళ్ళిపోయింది."

"వంట మనిషి చెప్పేది నిజమేనాండీ!" అడిగాడు అక్కడున్న సుజాతను. "అవునండీ!" అంది సుజాత.

"మిస్టర్ మురళీ! కడుపు నొప్పి వెంటనే తగ్గిపోయిందా? లేక చాలాసేపు దాంతో బాధపడ్డారా?"

"పెద్దనొప్పి పుట్టలేదండీ! కొద్దిగా ఉండింది. కాస్త వాము తిని నీళ్లు త్రాగాను. నిద్రపట్టింది. అంతే!" అన్నాడు.

"కనీసం మీకా నొప్పి ఎక్కువగా ఉండివున్నా మేలుకొని ఉండి ఉండేవాళ్లు. హంతకుడి అడుగుల చప్పుడు వినబడేది. ఈ దారుణం జరగకపోయేది," అన్నాడు సుధాకర్.

"నిజమేనండీ! కానీ మీరు మేల్కొని ఉంటారనుకున్నాను," అన్నాడు మురళి.

"మేము త్రాగిన పాలల్లో మత్తుమందు కలిపారు. త్రాగాక మైకం కమ్మింది. నేనూ, వసంత వెంటనే పడిపోయాం. ఆ పాలల్లో మత్తుమందు కలిపిందెవరో తెలుసుకుందామనే అందర్నీ ఇన్ని ప్రశ్నలు వేశాను."

"పాలల్లో మత్తుమందు కలిపారా? మేమూ త్రాగాం. మా కలాంటి అనుభవం కాలేదే?" అన్నాడు సుందరం.

"మాకు పంపిన పాలల్లో మాత్రమే మత్తుమందు కలిపినట్లుంది. హంతకుణ్ణి పట్టుకునేందుకు వచ్చిన వాళ్ళం గాబట్టి మేము మేలుకొనే వుంటామని అతనికి తెలుసు. అలా జరిగితే

ఈ హత్యచేసే అవకాశం లభించదు. అందుకే మా కళ్ళు మూయించాడు" అన్నాడు సుధాకర్.

"ఈ హత్యలిలా ఎందుకు చేస్తున్నారో, వీటివల్ల ఎవరికి ఏం లాభిస్తుందో చెప్పగలరా??" అడిగాడు రాజుగార్ని.

"నా ఆస్తికి ఇంకా వీలునామా రాయలేదు. నా తదనంతరం ఈ ఆస్తి నేనెవరికి రాస్తే వాళ్ళకే దక్కుతుంది. ఇది నా స్వార్జితంగాకున్నా మా సాంప్రదాయ మది."

# 14

వసంత ప్రొద్దున్నే మద్రాసు వెళ్ళిపోయింది.

డైనింగ్ టేబుల్ వద్ద ఎదురయిన సుధాకర్‌ను మురళి అడిగాడు వసంత గురించి. మద్రాసు వెళ్ళిందని చెప్పాడు. అంతలోనే సుందరం వచ్చాడు.

అందరూ టిఫిన్ తినడం ప్రారంభించారు.

"ఇక్కడుండాలంటే భయంగా ఉంది. ఈ ఉద్యోగం మానుకుని వెళ్ళిపోదామనిపిస్తూంది," అన్నాడు సుందరం.

"ఇంత జరిగాక మనం అజాగ్రత్తగా ఉండంగా? హంతకుణ్ణి పట్టుకునే అవకాశం మీకు కలగవచ్చు. ఈశ్వరరావు కూడా మీరు ఎస్టేటు వదలి పోయేందుకు ప్రస్తుత పరిస్థితుల్లో అనుమతించడనుకుంటాను," అన్నాడు సుధాకర్.

సుందరం మౌనంగా ఉండిపోయాడు.

వరహాలరాజుగారు గదిలో కొచ్చారు. అందరూ ఆయనకు నమస్కరించారు. అక్కడున్న టిఫిన్ తినకుండా కాఫీ మాత్రం త్రాగసాగారు. మురళి, సుందరం లేచి వెళ్ళిపోయారు. సుధాకర్ మాత్రం కూర్చున్నాడు.

"రాజుగారూ! నా ప్రశ్నలకు కొన్నిటికి మీరు సమాధానం చెప్పాలి' వాటిన్నిబట్టి నేను ఎలా పరిశోధన సాగించాలో ఆలోచించుకుంటాను," అన్నాడు.

"అడగండి చెప్తాను."

"మణిమాలను మీరు ఎలా కలుసుకున్నారు?"

"మద్రాసు మ్యూజియం చూసేందుకు వెళ్ళాను. అక్కడ ఆమె, సుందరం కనుపించారు. ఆమె అందం నన్ను పిచ్చెక్కించింది. ఆ రోజంతా నేను ఆమె వెంటే తిరిగాను. నా అవస్థ కనిపెట్టిన సుందరం, తన్ను తనే పరిచయం చేసుకున్నాడు. ఆమె పేరు మణిమాలనీ, ఎవరో రాజుగారు ఉంచుకొని ఉన్నారనీ, వారిదగ్గర తను సెక్రటరీగా పని చేస్తున్నాననీ చెప్పాడు.

ఆమెపై నాకు కోరికగా ఉందన్నాను. నా వివరాలు అడిగాడు. చెప్పాను. ఆమె నెలాగైనా ఒప్పిస్తానన్నాడు.

మరుసటి దినం సాయంత్రం మణిమాల హోటల్‌కు వచ్చింది. తన్నుంచుకొన్న రాజా పేరుకు మాత్రమే రాజాగారనీ, వారిదగ్గర డబ్బులేదనీ, అతన్ని వదలి వేద్దామని అనుకుంటున్నాననీ, నాకు అభ్యంతరం లేని పక్షంలో, తను వెంట వస్తాననీ అంది. అంతే. వెంట తీసుకొచ్చేశాను," ఆగాడు రాజుగారు.

"మణి వచ్చిన రెండు మాసాలకు సుందరం వచ్చాడు. మణిని కలుసుకున్నాడు. ఆ రాజా అతన్ని ఉద్యోగంలోంచి తీసివేశాడనీ, బ్రతకటం కష్టంగావుందనీ, ఏదైనా చిన్న ఉద్యోగం ఇప్పించమనీ అడిగాడట. ఆమె ఆవిషయం నాకు చెప్పింది. వెంటనే నేను అతనికి ఎస్టేట్ మానేజర్ ఉద్యోగం యిచ్చాను."

"డబ్బు లావాదేవీలు ఎవరు చూస్తుంటారు?"

"మా పెద్దబ్బాయి.అయినా అన్ని కాగితాలపైన నాసంతకాలు వుండవలసిందే. నాకు చెప్పంది వాదేమీ చెయ్యడు."

"మీకు మొత్తం ఎంత ఆస్తి ఉంటుంది."

"పదికోట్లకుపైనే వుంటుంది. సరిగ్గా తెలీదు."

"సుందరం డబ్బు కాజెయ్యడంలాంటి దేదైనా మీరు

గమనించారా?"

"లేదండీ! అతనటువంటివాడుకాడు."

"మణిమాలకు ఆ స్థలమన్నా మీరు వ్రాసిచ్చారా?"

"లేదండీ! ఆ యిల్లు ఆమెపేరకొన్నాం. కారు కొనిచ్చాను. అదిగాక నగలుంటాయి. అంతే."

"ఎందుకైనా మీరు తగిన జాగ్రత్తలోవుండటం మంచిది. మురళినీ, సుందరాన్ని కూడా హెచ్చరించాను" అన్నాడు.

"అలాగే!" అంటూ లేచారు రాజుగారు.

"మీ అమ్మాయి అమెరికానుండి వచ్చాక ఆమె పెళ్ళి విషయం మీరేమైనా సుందరంతో చర్చించారా?" అడిగాడు సుధాకర్.

"లేదండీ! ఏదైనా మంచిసంబంధం చూడాలనుకుంటున్నాననే చెప్పాను. అంతే!"

"అప్పుడు సుందరం ప్రవర్తన ఎలా వుండింది?"

"నాకేం విచిత్రంగా తోచలేదు. తనకు తెలిసినవి రెండు మూడు గొప్పసంబంధాలున్నాయనీ, వాట్నికూడా విచారిద్దామన్నాడు. మీ అభిప్రాయం నాకు బోధపడడంలేదు?"

"ఊరకే అడిగాను. సుందరంతో మీ అమ్మాయి కలుపుగోలుగా వుండేదా?"

"ఏమోనండీ! అదివచ్చి మూడ్రోజులే అయింది. నేను ఇక్కడ వుండటం లేదాయె. ఇంతలో ఈ దారుణం జరిగింది. నాకుమాత్రం ఏం తెలుస్తుంది," అన్నాడు రాజుగారు.

"మీరు రాత్రికి ఇక్కడుంటారా? మణిమాలగారింటికెళ్తారా?" అడిగాడు సుధాకర్.

"అక్కడికే వెళ్తాను. కాస్త మనస్సన్నా ప్రశాంతంగా వుంటుంది."

"జాగ్రత్తగా వుండటంమాత్రం మరచిపోవద్దు," మరోసారి హెచ్చరించాడు సుధాకర్.

రాజుగారు వెళ్ళిపోయారు. సుధాకర్ తనగదికి వెళ్ళిపోయాడు. డ్రస్ మార్చుకుని వెలుపలకొచ్చి కారెక్కి పోలీస్ స్టేషనుకేసి పోనిచ్చాడు.

# 15

మధ్యాహ్నం మూడుగంటలయింది. ఇంట్లో ఎవ్వరూ లేకుండా జాగ్రత్తపడ్డాడు సుధాకర్. మురళిని వాళ్ళ నాన్న రమ్మన్నాడని చెప్పి మణియింటికి పంపాడు. సుందరాన్ని రమ్మని ఈశ్వరరావుచేత ఫోన్ చేయించాడు. వసంత సుజాతను వెంటబెట్టుకొని ఎస్టేటు చూసేందుకు వెళ్ళింది.

మెల్లగా వెళ్ళి ముందు సుందరంగది తలుపులు తాళం తెరిచాడు. లోనికెళ్ళాడు. గది సాదాగావుంది. బెడ్ ప్రక్కన పేపర్లు పుస్తకాలు చిందరవందరగా పడున్నాయి.

అల్మైరా సొరుగులన్నీ లాగిచూశాడు. అక్కడేమీ కనుపించలేదు. వెతకవలసిన చోట్లన్నీ పూర్తయినాయి. తనకు కావలసినదేదీ దొరకలేదు. ఆఖరి చాన్సుగా మంచంపైనున్న బెడ్ తొలగించాడు. అతనికళ్ళు బైర్లుకమ్మాయి.

వందరూపాయల నోట్లకట్టలు వరుసగా పేర్చివున్నాయి. వాటిపైన బెడ్ వేసి, బెడ్ పైన దుప్పటి పరచుకోవడంలో ఎవ్వరూ అక్కడ డబ్బుందని ఊహించడంకష్టం. సుధాకర్ దాన్ని అక్కడే వుంచాడు. తలగడ తీసుకొని దాన్ని చేతుల్తో అదిమిచూశాడు. అక్కడేమీ కనిపించలేదు. అతను వెతుకుతున్నది ఇందిరను హత్యచేసేందుకుపయోగించినపిస్టల్.

సుందరం గదితలుపులు యధాతధంగా మూశాడు. మళ్ళీ తాళంనొక్కి, తిన్నగా మురళి గదికేసి వెళ్ళాడు. పదినిముషాలు శ్రమించి తలుపులు తెరవగలిగాడు.

ఇంద్రభవనంలాగుంది గది. గది మధ్యగా గుండ్రని ఎత్తైన బెడ్ వుంది. అది అవసరమైతే గుండ్రంగా తిరిగే ఏర్పాటువుంది. కిటికీలకు ఖరీదైన తెరలు వ్రేలాడుతున్నాయి.

గది ఫేర్ కండిషను చేసివుంది.

సుందరం గదిలోలాగే, మురళిగదిగూడా శోధించాడు సుధాకర్. అనుమానించదగిన వస్తువేది అతని కళ్ళ బడ లేదు. డ్రస్సింగ్ టేబుల్ పైన వందరూపాయల నోట్లకట్ట లున్నాయి. ప్రక్కనున్న సొరుగులు లాగాడు. క్రిందిసొరుగులో పెద్ద డైరీలాంటి పుస్తకం కనుపించింది. దాన్నిలాగాడు.

అక్కడ నిలబడి చదవడం సాధ్యంకాదని మెల్లగా దాన్ని కోటుజేబులో వేసుకుని వెలుపలకొచ్చి తలుపులు మళ్ళి యధాప్రకారం బిగించి, మేడపైనుండి క్రిందికిదిగాడు.

క్రింద సుజాత గదివుంది. ఆమె, ఇద్దరు పిల్లలు క్రిందే వుంటారు. అవసరమైనప్పుడు భర్త రమ్మంటే పైకి వెళుతుంది.

సుజాత గదంతా వెతికాడు. అక్కడేమీ కనుపించలేదు. కానీ మంచం వెనుకవేపున్న అల్మైరాలో చీరలక్రింద దాచివుంచిన ఫోటో అల్బమ్‌మీద దృష్టి నాకర్షించింది. దాన్ని తెరిచాడు. అందులోని ఫోటోలుచూసి ఆశ్చర్యపోయాడు.

అన్నీ సుజాతవే. ప్రతిదీ గుడ్డలులేకుండా, నగ్నంగా తీయించుకున్నదే! ఒక గొప్పింటి స్త్రీ అలా బట్టలువిప్పి ఫోటోలు ఎలా తీయించుకోగలిగిందో అతని వూహకు అంద లేదు. దాన్ని చంకన బెట్టుకొని వెలుపలకొచ్చి తలుపుల్ని యధాతథంగామూసి మేడపైకి తన గదిలోకి వెళ్ళిపోయాడు.

# 16

"నువ్వు సుధాకర్ గార్ని పెళ్ళిచేసుకుంటావా?" రోజ్ గార్డెన్‌లో అడుగుపెడుతూ అడిగింది సుజాత వసంతను.

"ఎందుకు?"

"ఎందుకేమిటి? అందంగావున్నాడు. ఐశ్వర్యముంది. కావలసినంత పేరుంది. పెళ్ళాడు సుఖపడతావ్," అంది.

"ఆ ప్రసంగం మామధ్య ఎప్పుడూ రాలేదు. ఆయన యజమాని, నేను ఉద్యోగిని."

"పెళ్ళాడనం చేపోయ్. కనీసం ఆయన దగ్గర అనుభవం రుచి చూడక పోయావా?అమ్మన్ను నువ్వు రుచిమరగినా, నిన్నా యన రుచిమరిగినా పెళ్ళి ఈజీగా అవుతుంది," అంది సుజాత.

"నా కలాంటి పనులంటే గిట్టవు" అంది వసంత కాస్త కోపంగా. సుజాత మాటలతీరు వసంతకేమీ నచ్చలేదు. అయినా ఆమె మాటలు వినకతప్ప లేదు. "మీ వారు రసికులా!"

"ఆ! నీరసికులు. అయినా నాకేం అసంతృప్తిలేదు. తీరని వంటూకోర్కులను అణచిపెట్టను. ఎలా గోలా తీర్చుకుంటాను. అయితే అందుకు తెలివి తేటలు కావాలనుకో. వాటికి నా దగ్గర కొదువలేదు," అంది సుజాత.

"మణిమాలను చూశారా మీరు?"

"ఆ! అదిక్కడకు రావడం, మా మామగార్ని వల్లో వేసుకోడం నాకు ఇష్టంలేదు. దాని దగ్గరేమీ లేదు. ఎర్రటి తోలుంది. నువ్వు చూశావా? మగాళ్ళకేమి కనుపిస్తుందో కానీ, ఏ ఆంగిల్ లో చూచినా దాని శరీరంలో నాకు సెక్స్ కనుపించలేదు."

"ఇంది రెటువంటిది?"

"ఇక్కడుండగా మగాళ్ళంటే వాడలి చచ్చేది. అమెరికాలో అంతా నేర్చుకొచ్చినట్లుంది. మద్రాసునుండి ఇక్కడి కొచ్చేలోపుల సుందరాన్ని లోగొట్టుకొంది."

"సుందరం అలాంటి వాడు కాదన్నారు అందరూ?"

"ఈ మగాళ్లు వెలుపలకు కనపడేంత పవిత్రులేం కాదు."

"హరి ఎలాంటివాడు."

"అతనా! రసిక చక్రవర్తి. మా ఎస్టేటులో ఎదిగొచ్చిన ఏ ఆడపిల్ల నడిగినా చెపుతుంది ఆయన ప్రతాపం." నేను వాళ్ళల విషయంలో ఏమీ అనను. ఆడమగల సంగతులు నాకు ఇంటరెస్ట్, ఆవేవైనా అడుగు" అంది సుజాత.

"అవి నా కవసరం లేదు. ఇక ఇంటికి వెళ్దాం," అంది.

# 17

సుధాకర్ స్టోర్‌రూం తలుపులు తెరిచాడు. దాదాపు వంద డబ్బాలున్నాయి. ఒక్కొక్కటి మూతతీసి, చెయ్యి లోపలబెట్టి కలియబెట్ట సాగాడు. కానీ తనకు కావలసిన వస్తువు అక్కడ కనుపించడంలేదు.

"ఏమిటండీ! వెతుకుతున్నారు. ఏం కావాలి?" అడిగింది సుజాత గుమ్మం ముందు నిలబడి.

"అప్పుడే వచ్చేశారా? వసంతేది?" విస్తుపోతూ అడిగారు సుధాకర్.

"గదికి వెళ్ళింది. నన్ను రమ్మంటే వస్తాను."

"అఖర్లేదండీ!అయినా నాక్కావలసింది మీకేం తెలుసు?"

"తెలీదనుకోండి! ఫలానిదని చెప్పండి. నేనూ వెతుకుతాను" అంటూ లోనికొచ్చి, తలుపులు గొళ్ళెం పెట్టింది.

సుధాకర్ ఆమె చేష్టలు క్రీగంట గమనిస్తూండిపోయాడు.

సుజాత ఉత్సాహంగా సుధాకర్ దగ్గరకు వెళ్ళింది.

"డబ్బాల్లో లేదు. ఒకవేళ మీ దగ్గరుందేమోనన్న అనుమానం వుంది. చూడమంటారా?" నవ్వుతూ అడిగాడు.

"నిరభ్యంతరంగా" అంటూ పైటకొంగు తొలగించింది సుజాత. మదించిన ఆమె యవ్వనం మంచు కప్పిన కొండ శిఖరాల్లా, గుండ్రంగా శంఖువుల్లా తీర్చి దిద్దినట్లుంది.

"ఇక్కడకాదు. రాత్రికి నా గదికి రండి. అక్కడ చెక్ చేస్తాను," అన్నాడు సుధాకర్ మరో డబ్బా మూత తీస్తూ.

ఇంతలో "సుజాత! సుజాత!" పిలుపులు వినిపించాయి.

"మా వారు! చూస్తే చంపేస్తారు మీరు వెళ్ళండి. నేను మెల్లగా వస్తాను," అంది సుజాత.

అంటూ డబ్బాలు దొర్లించింది. అవి క్రిందపడి దబదబ శబ్దమైంది. మురళి గది దగ్గరకొచ్చి తలుపు తెరిచి "ఏం చేస్తున్నావ్?" అడిగాడు.

"మీరు నన్ను బలవంతంగా లాక్కొచ్చి..." అంటూ పెద్దగా ఏడ్చింది.

మురళి కళ్ళు కోపంతో చింత నిప్పుల్లా మారాయి. నౌఖర్ల చేత సుధాకర్‌ను వెడరెక్కలు విరిచి కట్టించాడు.

## 18

అప్పుడే లోనికొచ్చిన రాజాగారు, ఆ దృశ్యాన్ని చూసి బెంబేలు పడ్డారు. నౌఖర్లను దూరంగా వెళ్ళమని కేకేసి, తనే వెళ్ళి సుధాకర్ కట్లు విప్పాడు.

"మురళీ నువ్వెళ్ళు" అన్నాడు రాజాగారు పరిస్థితి అర్థం చేసుకొని.

మురళి మాట్లాడకుండా వెళ్ళిపోయాడు.

"సుజాత కాస్త పిచ్చిది. దాని మాటలు విని వీడు రెచ్చిపోయాడు. మీరు మరోలా అపార్థం చేసుకోకండి," అన్నాడు రాజాగారు.

"నాకెవరో ఇందిర హత్య జరిగిన రాత్రి పాలల్లో మత్తు మందు కలిపి పంపారు. ఆ మందు స్టోర్‌రూంలో ఎక్కడో దాచి వుంటారని అనుమాన మేసింది. నేను దానికోసం వెళ్ళాను. ఈ లోపల ఈ గొడవ జరిగింది. హంతకుడా మందు పొట్లాన్ని తీసుకుని వుంటాడు," అన్నాడు సుధాకర్.

## 19

ఈశ్వరరావు వచ్చాడు. జరిగిందంతా చెప్పాడు సుధాకర్. విని విస్తుపోయాడు.

"ఇంతకూ మీ దృష్టిలో హంతకుడెవరనుకుంటున్నారు," అడిగాడు ఈశ్వరరావు.

"వసంత మద్రాసులో సుందరానికి సంబంధించిన కొన్ని వివరాలు తెలుసుకొచ్చింది. మణిమాల మామూలు బ్రోతల్ గా వుండేది. సుందరం ఆమెకు బ్రోకరుగా పని చేస్తూండేవాడు. వరహాలరాజుపై తమ వల విసిరారు. సుజాత సుందరం కలసి చదువుకొన్నారు. ఆ రోజుల్లో వాళ్ళిద్దరికీ

సంబంధం వుండేది. ఆమెను పెళ్ళయిన తర్వాతగూడా సుందరం, ఆమె కలుసుకుండే వాళ్ళు. ఆమె ద్వారానే రాజుగారి విషయాలు అతనికి తెలిశాయి.''

"ఈ విషయం మీకెలా తెలిసింది?''

"నిన్న మురళి డైరీ చిక్కింది. అందులో అన్నీ వివరంగా రాసుకున్నాడు. అన్నింటికన్నా విచిత్రమైన విషయం మురళికి మగతనం లేదు. పెళ్ళయింది మొదలు వరహాలరాజుగారే కోడల్ని యథేచ్ఛగా అనుభవిస్తూ వచ్చారు. ఈ మధ్య హరిగూడా ఆమె గదిలోకి వెళ్తున్నట్లు అనుమానంగా వున్నట్లు రాసుకున్నాడు. అందులో భార్యమీదికన్న తన అసమర్థత అలుసుగా తీసుకుని తన భార్యను అనుభవిస్తున్న తండ్రిపైన, తమ్ముడిపైన విపరీతమైన పగ రేగుతున్నట్లు చూచాయగా రాసుకున్నాడు,'' అన్నాడు సుధాకర్.

"అయితే ఈ హత్యలన్నీ మురళి చేసివుండాలి.''

"చెప్పలేం! నిన్న సుందరం గది పరిశోధించాను. అతని బెడ్ క్రింద ఐదు లక్షల రూపాయలున్నాయి. అది హరి కిచ్చిన డబ్బు. ఆ డబ్బు అతని గదిలోకి ఎలా వచ్చింది. అతనే హరిని చంపివుండవచ్చు.''

రాత్రికి చెయ్యవలసిన కట్టుదిట్టాలను గురించి ఈశ్వరరావుకు కొన్ని సూచనలిచ్చాడు సుధాకర్.

ఎనిమిదింటికల్లా అందరూ భోజనాలుచేసి ఎవరి గదుల్లోకి వాళ్ళు వెళ్ళిపోయారు.

## 20

గంట పన్నెండయింది.

సుధాకర్ మంచంపైన దుప్పటి కప్పుకొని పడుకున్నాడు. కళ్లు మూసుకున్నాడు తప్ప మేలుకొనేవున్నాడు. వసంత చేతిలో తుపాకీ పట్టుకొని తలుపువారగా నిలబడివుంది.

టక్కున శబ్దమైంది. తలుపు మెల్లగా తెరచుకుంది. నల్లటి ఫుల్ సూట్ లోవున్న వ్యక్తి లోనికొచ్చాడు. వసంత

కర్టెన్ చాటుకు కదిలింది.

ఆగంతకుడు తలుపును వెనక్కి నెట్టి మెల్లగా ముందుకు వెళ్ళాడు. సుధాకర్ బెడ్ ప్రక్క నిలబడి, రెండుక్షణాలు పడుకున్న సుధాకర్ కేసి తదేకంగా చూడసాగాడు. తలవైపుకు నడిచివెళ్ళి, డ్రెస్సింగ్ టేబుల్ సొరుగులులాగాడు. అందులో చకచక వెతకసాగాడు. అతనికి కావలసిందేదో అక్కడ కనుపించక పోవడంతో, మళ్ళీ సుధాకర్ వద్దకు వచ్చాడు. అతని గుండెపై కత్తివుంచి, చేతిని దిండు క్రిందికి పోనిచ్చాడు.

దిండుక్రిందనుండి లావుపాటి పుస్తకం తీశాడు. కత్తిని సుధాకర్ పైనుండి తీశాడు. మెరుపులా మంచంమీదనుండి క్రిందకు లంఘించి, ఆ హంతకుడి వెనుకనుండి రెండుచేతులు ముందుకుచాచి, అతన్ని ఇరికించి పట్టుకున్నాడు సుధాకర్.

వసంత లైట్ స్విచ్ నొక్కింది.

ఆగంతకుడి మొహాన్ని తనవేపుకు తిప్పుకున్నాడు.

"నువ్వా సుందరం?" అడిగాడు సుధాకర్.

సుందరం తలొంచుకున్నాడు.

"ఇంత సులభంగా హంతకుడు చిక్కుతాడనుకోలేదు. ఈశ్వరరావును పిల్చుకొస్తాను," అంటూ వసంత వెళ్ళింది.

"సుందరం ఈ హత్యలు నువ్వేచేశావా?" అడిగాడు సుధాకర్. "ఆఁ! నేనే చేశాను."

"నేను నమ్మను. నువ్వు అబద్ధం చెప్తున్నావ్?"

"సుధాకర్ గారూ! నా చరిత్ర మంచిదికాదు. మణికీ నాకు సంబంధంవుంది. సుజాతను చిన్నప్పటినుండీ ఎరుగుదును. డబ్బుమీద నాకు పిచ్చివ్యామోహం వుంది. ఇవన్నీ మీరు సులువుగా ఋజువు చెయ్యగలరు. అప్పుడు ఈ హత్యలు చేసింది నేనేనని ఎవరైనా నమ్ముతారు," అన్నాడు సుందరం.

"కాదు! హంతకుడెవరో నాకుతెలుసు. అతనే నిన్ను భయపెట్టి, నా గదిలోకి డైరీ దొంగిలించుకు రమ్మని చెప్పాడు.

నిన్ను పంపింది మురళేగదూ!'' అడిగాడు.

అంతలో ఈశ్వరరావు లోనికొచ్చాడు.

"అంతా మీరు చెప్పినట్లే జరిగింది. నేను మురళిగదిబైటే ఫ్లవర్ వాజ్ వెనుక దాక్కున్నాను. అతను సుందరం గది లోకి వచ్చాడు. ఇద్దరూ ఐదు నిముషాలు వాదులాడు కున్నారు. ఆ తర్వాత సుందరానికి కత్తిచ్చి మీ గదికి పంపాడు,'' అన్నాడు ఈశ్వరరావు.

"మురళిని అరెస్ట్ చెయ్యి!'' అన్నాడు సుధాకర్.

"అదింతకుముందే చేశాను. ఇందిరను చంపిన రివాల్వరు గూడా అతనివద్దే దొరికింది. తనే ఈ హత్యలు చేసినట్లు ఒప్పుకున్నాడు. హరిగదిలో డబ్బు దొంగిలించి సుందరం బెడ్ క్రింద పెట్టిందికూడా తానేనట. అతని లిస్టులోసుందరం గూడా వున్నాడు. ఆ తర్వాత తండ్రిని, మణినికూడా చంపాలనుకున్నాడు'' అన్నాడు ఈశ్వరరావు.

"తోడబుట్టిన వాళ్ళనే హత్యచేసిన మురళి అలాంటి ఘోరానికి ఎందుకు పాల్పడ్డాడు?'' అడిగింది వసంత.

"అతనికి మగతనం లేదు. అలాగని అందరూ తెలుసు కోవడం ఇష్టంలేదు. హరి వదినెతో వ్యవహారం సాగించడం మొదలుపెట్టాడు. దాం హరిని పకడ్బందీగా హత్యచేశాడు.''

"ఇందిరను చంపడంలో ఉద్దేశ్యమేమిటి?''

"అతనికి సుందరం, ఇందిర ఏదో తప్పుదోవన పడుతున్నట్లు అనుమానమేసింది. తన చెల్లెలిని వల్లోవేసుకొనగల మగతనం సుందరానికుండడం అతనికి అసూయ కలిగించింది. పైగా ఆమె నన్ను పిలిపించింది. ఈ కోపంలో ఆమెను హరీమనిపిం చాడు'' అన్నాడు సుధాకర్.

వసంత సామాన్లు సర్దేందుకు సిద్ధమైంది. "మీ సహాయానికి కృతజ్ఞుణ్ణి సార్!'' అన్నాడు ఈశ్వరరావు.

—: ఐ పో యిం ది :—

